యువక విజ్ఞానసమితి గ్రంథమాలా ప్రథమ కుసుమము.

శతావధాని

గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారి

# చమత్కార కవిత్వము

సంపాదకులు

నంద్యాల మునిసిపల్ హైస్కూల్ ప్రధానాంధ్రపండితులు

విద్వాన్, కావ్యతీర్థ

మద్దూలపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

యువక విజ్ఞానసమితి ప్రచురణము.

గద్వాల.

1949



వెల 1–8–0

# అభ్యర్థన.

తే. తొమ్మిదేఁడుల పసికూనతోన నడుచు
శాస్త్రిగారి కుటుంబపోషణముకొఱకు
తక్కుఁగల వారి వాఙ్మయోద్ధరణమునకు
సాయపడరయ్య పాఠకసభ్యులార!

---

ఈ పుస్తకములు దొరకు చిరునామా:—

i. కార్యదర్శి,
యువక విజ్ఞాన సమితి,
గద్వాల, నైజాం డొమినియం, దక్కన్.

ii. కవితా సామ్రాజ్యము,
నంద్యాల.

శ్రీ గోపాలకృష్ణాప్రెస్సునందు ముద్రితము, మదరాసు.



శతావధాని గాడేపల్లి వీరరాఘవ శాస్త్రి

జననము :- 30-4-1891 　　　　 మరణము :- 5-3-1945

మ. అరయంగా ద్విన వాబ్జనూతి చతు (౧౮౧౩) రబ్దాతీతవేళన్ కలిన్
ఖరచైత్రంబునఁ గృష్ణసప్తమిని జన్మం బంది, పై తారణాం
తరమా ఫాల్గున కృష్ణసప్తమిని ద్యుస్థానంబుఁ జేరెన్ సుధీ
వర గాడేపలి వీరరాఘవ కవిబ్రహ్మణ్యుఁ డుద్దండుఁడై.

ఓమ్.

# తొలిపలుకు.

---

గాడేపల్లి. వీరరాఘవశాస్త్రి గారితో నాకు 1927 నుండి పరిచయము. అంతకు ముందు నా బాల్యములో వీరి పేరు, ప్రతిష్ఠ, ప్రతిభ వినియుంటిని గాని తృణీకృత బ్రహ్మ పురందరులగు వీరితో నింత పరిచయము గల్గునని కలలోఁ గూడ ననుకొనియుండలేదు. ఆదిలో మైత్రి గుదిరిన వేళావిశేష మేమో అది ఆజీవితాంతమును అవ్యాజముగా అట్లే అతికిపోయినది. ఆవలి యీదినములలోఁ గూడ అదియే యీ గ్రంథసంపాదనమునకుఁ గారణభూత మైనది.

1927లో వారు నంద్యాలలో బ్రహ్మశ్రీ పాణ్యాం రామచంద్రయ్య బి, ఏ. గారి ప్రాజాపత్యముక్రింద సంస్కృతపాఠశాల చెప్పుచున్నప్పటి నుండియు వారు తమ రచనాచమత్కారములను వెల్లడించుచుండెడివారు. అందలి విశిష్టతను జూచి ఆరచనలను నాతోపాటు లోకముగూడ నాస్వాదించి ఆనందించిన బాగుండును నని తదగ్గమై మఱిమఱి హెచ్చరికలు చేయుచు నుంటిని. కాని శాస్త్రిగారు వాక్ఛూరత్వముఁజూపినంత క్రియాశూరత్వమును జూపినవారు గారైరి. నమ్మరాని జీవితమునం దెప్పు డేమగునో యన్న తహతహ నన్నుఁ దొందరపెట్టక పోలేదు. ఇదిగో అదిగో యని చెప్పుచు వచ్చిరే గాని యిప్పుడు నా చేసిన యీకృషి యంతయు వారి జీవితకాలములో వారే చేసియుండవలసియుఁ జేయలేక పోయిరి. పైఁగా న న్నేమో చేసిపెట్టవలసిన దని చెప్పుచు అందులకుఁ దగిన యవకాశము నేని గల్పింపరైరి. చివరకు సంకల్పప్రపంచములోనే సమసి పోయినవారైరి.

అప్పటప్పటఁ దటస్థించినపుడెల్ల, కాలమును నమ్మరా దని కర్తవ్యము నుద్బోధించుచు వచ్చినందుల కిఁక నైన గట్టిగాఁ బూనుకొనవలె నని వృష

కార్తిక బ ౫ ఆదిత్యవారము (7-11-1941) గద్వాలలో నన్ను వారు కోరిరి. ఇదే విషయ మాశువులోఁ జెప్పవలసిన దనియు, దీనితోనే యుపక్రమణ మనియు నేను గోరఁగా వ్రాసికొమ్మని రెండు పద్యములు చెప్పిరి. కల మాఁప లేదు, తుడుపు పెట్టలేదు. ఆపద్యము లివి :—

మ. సరసప్రక్రియ వేల పద్యములు సాక్షాచ్ఛంభు శీర్షస్థలీ
సరిదుత్తుంగ తరంగ మాలికలు నా జానొప్పు వాగ్ధాటితో
విరచింపన్ బడిపోవుచున్నవి; దయన్ వీక్షించి రక్షించి సం
బరమున్ గూర్చుము; కావ్య మేర్పఱతు సుబ్రహ్మణ్యవిద్వత్కవీ !.

శా. అబ్రాశిస్థిత ధారణీవలయ భాషాచార్య సంస్తుత్యవా
క్సుబ్రహ్మణ్యులు నబ్బురంపడఁగ, నీచుల్ కుంద, సౌపర్వరా
జబ్రహ్మేశ ముఖామరస్తుతి కథాంచత్కావ్యనిర్మాణ శి
ల్పబ్రహ్మన్ ననుఁ గూర్చి సాయము నొనర్పన్ జెల్లదే మిత్రమా !

అని చెప్పిరి. ఆ పూనికలోఁ గొన్ని వారు చెప్పుటయు, నేను వ్రాయుటయు జరిగెను. కాని ఒక్కొక్క విషయములో వారు ముచ్చట పెట్టుకొనినచో చెత్త సాగడిది గాదు. మాటలపుట్ట! ఈమాత్రేగాక తర్వాతఁ దర్వాతఁగూడ నేను గద్వాలకు మాఘసభలకు వెళ్లినపుడెల్ల ఆ యున్నంత యవకాశములోనే అంతో యింతో పుస్తకమువిూఁదికెక్కించి వచ్చెడివాఁడను. ఇంతకంటె నప్పు డేమియుఁ జేయఁజాలక పోయితిని.

ఈనాఁ డీమాత్ర మేని యీచరిత్రాంశములను సత్యపూతములను గా సమకూర్చుటకు తారణ ఆషాఢ శుక్లము (1944 జులై) లోను, ఆ మాఘ కృష్ణము (1945 ఫిబ్రవరి) లోను 7, 8 దినములు భగవంతుఁడు సంఘటనము చేయఁగా శీర్షికలు, తత్తత్సంఘటనలు దిఙ్మాత్రముగా గుర్తులు వ్రాయ వీలయ్యెను. ఈ సంఘటనయే లేకపోయినచో గుఱి దప్పిన యూహాగాన మెంత చేయవలసి వచ్చునో తెలియదు. కన్నులు పోయినవానికి దేవుఁడు మఱి

యిచ్చు నన్న సామెత యీవిషయములో సర్వేశ్వరుఁడు సార్థకపఱచు కొన్నాఁడని చెప్పవలె.

ఇప్పుడు సమకూర్చిన యీభాగమునకంటెను ఇంకను సమకూర్పవల సిన దెంతయో మిగిలియున్నది. విడి విడి కాగితములలో నెంత చిన్నచిన్న ముక్కలపై నేని వ్రాయఁబడియున్నవి. అవి యెల్ల నుద్ధరింపఁబడు కాలము వచ్చి అది ద్వితీయ భాగము క్రిందికి లెక్కింపఁబడునాఁటి కిది ప్రథమ భాగము క్రిందికిఁ దీసికొందము గాక.

అలోక సామాన్యములైనవాని నత్యుక్తి క్రిందికిఁ గట్టివేయు స్వభావము గల లోకమునకు స్వభావోక్తిని గూడ సరిగాఁ జెప్ప వలనుపడ దను విషయము జ్ఞప్తియం దుంచుకొన వేఁడవలసియున్నది.

రాఘవ శాస్త్రిగారు గతించిన (5-3-1945) కొలఁది కాలములోనే యీగ్రంథము గ్రథనము చేయఁబడెను. ప్రచురణార్థము చేతనైనంత ప్రయత్నము చేసితిని. శాస్త్రిగారి కవిత్వముపై గాఢాభిమానము గల బ్రహ్మశ్రీ విద్వాన్ సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారును ఎం. ఏ., (హైదరాబాద్ నైజాం కలాశాలాంధ్రోపన్యాసకులు.), బ్రహ్మశ్రీ మాణిక్యశర్మగారును (కర్నూల్), బ్రహ్మశ్రీ పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారును (కొవ్వూరు ప. గో. జి.) కొంత ప్రయత్నించిరి. మఱికొందఱకును అట్టి యభిలాష యుండినది. కాని కాగితమునకే కఱవు వచ్చిన కటుకు కాలములో నెవరి ప్రయత్నములును సాగివచ్చినవి కావు. చివరకు శాస్త్రిగారి కాంతరంగిక శిష్యులైన గొట్టిముక్కుల కృష్ణమూర్తిగారు శ్రీశ్రీ గద్వాల మహారాణిగారి కాక్షిని దక్కించి సఫలప్రయత్నులైరి. ఈనాఁటి కేని యీశ్వరసంకల్పముతో నింతమాత్రము వెలువడఁగల్గినందులకు చేసిన కృషికి సాఫల్యము.

రాఘవశాస్త్రిగా రనేక సందర్భములలోఁ జెప్పిన పద్యము లనేకములు కంఠస్థము చేసినవా రుందురు, అట్టివారు దయచేసి ఆపద్యములను

ఖిలపడిపోకుండ సందర్భముతోఁ గూడఁ దెలుపుచు వ్రాసి పంపుచో కృతజ్ఞతా పూర్వకముగా నందుకొని వానిని ద్వితీయ సంపుటములోని కెక్కింతుము. కనుక తదర్థమై ప్రత్యేక ప్రార్థన.

శరీరమాత్ర విభవముతో నిలిచియున్న శాస్త్రిగారి కుటుంబమును శాస్త్రిగారి కుమారుఁడు పసికూన యెదిగి వచ్చునంతవఱకు ఈకృతికన్య ఆదుకొని పోషింపఁగల్గున ట్లభిమానసంపన్ను లాదరింతురుగాక యని వేఁడికోలు.

కవితాసామ్రాజ్యము
నంద్యాల
విరోధి సం. విజయదశమి.
1-10-1949.

ఇట్లు
భాషాసేవకుఁడు
మ. వేం. సు. శాస్త్రి.



విద్వాన్, కావ్యతీర్థ

ముష్టులపల్లి వేంకటసుబ్రహ్మణ్యా శాస్త్రి

జననము — 23-8-1900.

# మలిపలుకు.



గురుపూజాకైంకర్యమున కవకాశము గల్పించిన శ్రీమత్పరమేశ్వరునకును, బ్రహ్మశ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని, శ్రీ శ్రీ గద్వాల మహారాణిగారికిని ముందు కృతజ్ఞత దెలుపుకొనవలసియున్నది.

తర్వాత, నేను కార్యదర్శిగా నున్నపుడే గద్వాల యువక విజ్ఞాన సమితి గ్రంథమాలలో నీగ్రంథమును ప్రథమ కుసుమముగాఁ బ్రచురింపఁ గల భాగ్య మబ్బినందులకు సంతోషింపవలసియున్నది.

ఈ రూపకముగా కొంత గురు ఋణ విముక్తిని బొందఁ గల్గినందులకు ధన్యోస్మి అని యానందింపవలసియున్నది.

బ్రహ్మశ్రీ శతావధాని గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారికి నే నొక శిష్యపరమాణువను. వారి పాండిత్యప్రకర్షనుగురించి నా చెప్పవలసినది లేదు. ఈగ్రంథమే వేనోళ్లఁ జాటుచున్నది. ముంజేతికంకణమున కద్దమేల? జీవితకాలములో పండితప్రకాండులప్రశంసలకుఁ బాత్రుఁడైన అంతటి యుద్దండ పండిత కవి మఱొకరు పుట్టినంతవఱకు న భూతో న భవిష్యతి అనుకొందము గాక.

గురుశ్రీ రాఘవశాస్త్రిగారి కవితావిహార మెంత కేనియుఁ జాలు నను ప్రశంసలను వినుదుము. నిజమునకు సర్వతోముఖమైన వారి ప్రతిభ, పాండిత్యము అచింత్యరచనాపాటవములే యగును. శ్రీనాథుని యహామహమిక, వేములవాడవారి రౌద్రము, తెనాలివారిహాస్యము, పోతనభక్తి, తిక్కన జాతీయత ఒకటని యేమి? పూర్వకవులలో నొక్కొక్కరియెడఁ గల

యొక్కొక్క విశిష్టత యంతయు మూర్తీభవించినట్లు శ్రీవారి కవితయందుఁ గానఁగల్గుదుము.

ఆదిగురువులనుండి అంతిమశిష్యునివఱకును అవ్యాజ గుణజ్ఞతతోఁ బ్రశంసించిన ప్రశంసాపద్యములు శ్రీవారి యలౌకిక సామాన్యమైన యుపజ్ఞను, అసాధారణ కవితాచాతుర్యమును, అతిమానుషప్రతిభను వేనోళ్ల వెల్లడించుచు సత్యపూతత్వమును సంపాదించుకొన్నవి.

శాస్త్రిగారి రసవత్కవితకు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గ్రథనము బంగారమునకు పరిమళ మబ్బినట్లు. శాస్త్రిపాదులతో అంతరించి పోయినవి పోయినను ఉన్నవానిలోనైన రసవద్ఘట్టము లెన్నియే నింకను నుద్ధరింపఁ దగియున్నవి. శాస్త్రిగారి నిరర్గళ నిరంకుశ కవితాధార కురిపించిన రచనలమొత్త మంతయు సాకల్యముగా ఆంధ్రభారతి కర్పింపఁగల అదృష్ట దినము లెంత దూరములో నున్నవో!

మా గురుదేవులు దాఁటుకొన్న తర్వాత ఈయనాథబాలికను ఆదరించి ఉన్న రూప రేఖా విలాసములనేని ఉడిగిపోకుండ ఉద్ధరింపఁగలవారెవ్వరా? యని యాందోళన పడుచుండ అదృష్టవశమున శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగా రాదుకొనుట యెంతో యదృష్ట మనక తప్పదు. 'ధూమావరుద్ధ దృష్టేరపి యజమానస్య పావకఏ వాహుతిః పతితా!'.

సుబ్రహ్మణ్య శాస్త్రిగారును ఈ గ్రంథమును సమకూర్చి ముద్రణార్థమై చేయవలసినంత ప్రయత్నము చేసిరి. అభిమానులును అవకాశము గల్పించుకొనిరి. ఈసంపుటి తుంగభద్రాతీరమున కొంతకాలము, గౌతమీ తీరమున నొకయేఁడు గాలము సమాధియోగమును సాధించి యేమద్భుత శక్తిని సంపాదించినదో చివరకు కృష్ణాతీరమునందలి గద్వాల సంస్థానమునకే కీర్తి దక్కించినది.

ఈ గ్రథిత గ్రంథ ముద్రణార్థమే శ్రీ సరిపల్లి విశ్వనాథశాస్త్రి ఎం, ఏ గారు సికిందరాబాదులో తమ యాజమాన్యముక్రింద జరుపఁబడు (వ్యయ సం. ర) గణపతి నవరాత్ర సారస్వత సమావేశములకు (30-8-1946)

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నాహ్వానించి యుపన్యాస మిప్పించినపుడు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తిరిగి వచ్చుచు గద్వాలకు వచ్చి మాతండ్రిగారితో ఈ గ్రంథముద్రణమును గుఱించి ప్రస్తావించుచుండఁగా అప్పుడు నే నందు జోక్యము గల్గించుకొని విషయమంతయుఁ దెలిసికొంటిని. అప్పుడు, త్వరగా ఈగ్రంథ మచ్చువేయింపవలె నన్న తహతహ నాలో నుదయించెను. కాని కార్యరూపము దాల్చునంతవఱకును దెలుపరా దన్నయుద్దేశము సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కీనా కోరికను గాని, నా ప్రయత్నమును గాని తెలియఁ బఱుప నిచ్చినది గాదు. ఇట్లగుటచే వారును, నేనును ఒకరికిఁ దెలియకుండ నొకరము ముద్రణ ప్రయత్నమున నుండనే యుంటిమి. కాలము కట్టుకు పాఱుటయు, రాజకీయముగాఁ గూడ చిక్కులు దాపురించుటయు నై కాలచక్రము దొర్లిపోవుచుండెను.

ఈశ్వరసంకల్పముతో కాలపరిస్థితు లొకమాదిరిగాఁ జక్కఁబడిన తర్వాత23-6-1949వ తేది హైదరాబాదులో శ్రీగద్వాల మహారాణిగారితో రాజకీయములు ముచ్చటించుచు సందర్భవశమున మాటలధోరణి సారస్వత రంగమునఁబడ రాఘవశాస్త్రిగారు గద్వాల విద్వత్సంస్థానమునకుఁ దెచ్చిన ప్రతిష్ఠ నుద్ఘాటించి, వారి యనన్యసామాన్య రచనా చమత్కృతులలోని కొన్ని తళుక్కులను వినిపించితిని. అంతటి యనర్గళధారాపూరములతో అనుక్షణము ఆనందింపఁదగిన కవిత యిటీవల వినఁబడని కారణముతో మహారాణిగారిలో నొక్కమాఱుగా నూతనోత్సాహ ముదయించి యెంతైనను అచిరకాలములోనే అచ్చువేయించు నేర్పాట్లు చేయుఁ డని సెల విచ్చిరి.

వెంటనే శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని, మాకు బంధువులును, శ్రీ రాణిగారికిని, రాఘవశాస్త్రిగారికిని గురుస్థానము నగు బ్రహ్మశ్రీ మేడవరము సుబ్రహ్మణ్య శాస్త్రులవారికిని (అళ్ళగడ్డ) ఈశుభోదంతమును దెలుపఁగా వారును నన్నుత్సాహపఱచుటయే గాక శ్రీ రాణిగారియొక్క సారస్వతాభిమానమును, ఔదార్యమును నభినందించుచు లేఖలు వ్రాసిరి.

కని విని యెఱుఁగనంతటి రాజకీయ పరిణామము గల్గి సంస్థాన విలీనీకరణఘుటికలలోఁ గూడ శ్రీమహారాణిగారు కాలగర్భములో విలీనమైన తమ యాస్థాన కవి గ్రంథమును ముద్రింపించుటలో గద్వాల సంస్థానము విద్వత్పోషణముతో వెలసి వెలుఁగొంది విలీనమగుచున్న దనుటకుఁ దార్కాణముగా సజీవ చారిత్రమును సంపాదించుకొన్న దయ్యెను.

1942 వ సం. రమున నెలకొల్పఁబడిన యీయువక విజ్ఞాన సమితి గర్భాష్టమమున నే యీగ్రంథమును ప్రచురింపఁ గల్గుట ప్రతివత్సరము జన్మ దినోత్సవములలోఁ బొందుచున్న పెద్దలయాశీః ప్రభావముచేత నే యనుటకు సందియము లేదు. లక్ష్మీపుత్రులయు, విద్వద్వరేణ్యులయు ప్రాపు నాఁపు చూచుకొని సాంస్కృతిక సాంఘిక సారస్వత రాజకీయ రంగములలో శక్తికి మించిన భారమును సయితము వహించి నిస్స్వార్థజీవులై భారత భారతీ కళ్యాణమునకు జీవితసర్వస్వమును ధారవోసిన కార్యకర్తల నసంఖ్యాకముగ తయారుఁ జేసినది. ఈ సమితి కార్యకర్త లిప్పటికిని కొందఱు వార్ధా శాంతినికేతనములలో విద్యాతపస్సు గావించుచున్నారు.

గురుశ్రీ రాఘవశాస్త్రిగారి యమృతాత్మ గద్వాలసంస్థానముపై ఎంత గాఢాభిమానముతో నున్నదో! నేను శ్రీ గద్వాల మహారాణి గారితో గ్రంథముద్రణకార్య మొప్పించుకొని 30-6-1949 వ తేది ఆంధ్ర పత్రికలో ఈవిషయము ప్రకటించి, తర్వాత గ్రంథముద్రణపు టేర్పాట్లను గుఱించి శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో సంప్రతించుటకై 4-9-49 వ తేది నంద్యాల ప్రయాణము పెట్టుకొనియుండఁగా 3 వ తేదిరాత్రి స్వప్నములో గురుదేవుఁడు కాన్పించి 'నేను కీర్తిశేషుఁడ నైతి నని పత్రికలోఁ బ్రక టించితివా ? సొంతపనులమీఁద మాగ్రామమునకు వెళ్లియుండఁగా' నని, ఆంధ్రపత్రికను జూపి 'చచ్చితి నందునా ?' యని అట్టె చెంపకుఁ బట్టి ఛెళ్లి మని కొట్టెను. ఆదెబ్బతో మెలఁకువ వచ్చెను.

భౌతికదేహము పంచభూతములలోఁ గలిసినను ఆయనవిశుద్ధాత్మ గద్వాల పరిసరములలోనే విహరించుచున్నది కాఁబోలు! పుస్తక మచ్చు పూర్తి కావచ్చిన దని విని సంతోషింపుచుండఁగా 12-12-49 వ తేది వేకువజామున మరల దర్శన మిచ్చెను. కుక్కల అఱపు మెలఁకువఁ దేకున్నచో ఏమి సందేశ మిచ్చియుండునో! ఆయదృష్టము పట్టలేదు. తర్వాతఁ గూడ పదేపదే స్వప్నములో దర్శన మిచ్చుచున్నారు. ఎందులకో! ఈసూపకముగానైన స్వాప్నిక ప్రపంచములో గురుదేవుని సందర్శింపఁ గల్గినందులకు ధన్యోస్మి! తస్మై శ్రీ గురవే నమః!

ఏతద్గ్రంథ ముద్రణమునకు సర్వతోముఖముగఁ దోడ్పడిన యెల్లవారలకును మా సమితిపక్షమున నా ధన్యవాదములు.

గద్వాల.
31-12-1949

గొట్టిముక్కల కృష్ణమూర్తి,
గౌరవకార్యదర్శి
యువక విజ్ఞానసమితి.

## ప్రత్యేకాభ్యర్థనము.

లోఁగడ తొలి - మలిపల్కులలో ఈగ్రంథమును ముద్రింపించిన కీర్తి శ్రీ గద్వాల రాణీగారికే దక్కిన దని తెలిపియుంటిమి. కాని వారిచ్చిన (నైజాము) రూపాయ లైదువందలతో (మన 425) ముద్రణము పూర్తి గాకపోయెను. మఱి మూఁడువందలకు పైగాఁ దగిలెను. ముద్రాపణ ప్రతిష్ఠ దక్కినంతే చాలు నని రాణిగారు మిగతపైకము చేతఁ గా దనిరి. అందుచే ఇఁక భాషాభిమానులే శరణని యిప్పుడీప్రత్యేకాభ్యర్థనము చేయవలసి వచ్చినది. కనుక ఈచేసిన భాషాసేవ నభిమానించి సర్వతోముఖముగ దోడ్పడి ముద్రణవ్యయభారమును తగ్గింతురు గాక యని ప్రార్థన.

గొ. కృ.

# సవరణలు.

ఈక్రింది సవరణలు సవరించుకొని చదువఁ ప్రార్థన.

| పుట. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 18 | 2 | 1918 | 1916 |
| 20 | 9 | 1918 | 1916 |
| 22 | 24 | నైజాం | (నైజాం) |
| 58 | 15 | చెలరేఁగినట్టు. | చెలరేఁగినటు. |
| 65 | 19 | తక్కన | తక్కిన |
| 88 | 17 | 1927 | 1926 |
| 89 | 4 | 1944 | 1945 |
| 120 | 16 | 1918 | 1916 |
| 125 | 13 | శాస్తి | శాస్త్రి |
| 126 | 9 | నంతము నొది | నంతము నొంది |
| ,, | 19 | 1917 | 1916 |
| 130 | 15 | నాలుగువరము | నాగులవరము |
| 135 | 3 | హస్తాపలాలనల్ | హస్తోపలాలనల్ |
| 141 | 12 | పూరగించిన | పూరించిన |
| 150 | 9 | ఆర్యద్యాప్రబోధిని | ఆర్యవిద్యాప్రబోధిని |
| 154 | 16 | స్సుపుత్రె రుత్యః | స్సుపుత్రై ర్యుతః |
| 155 | 18 | నిట పోలినవాఁడు | నిటు పోలినవాఁడు |
| 161 | 5 | రసాతిశేక | రసాతిరేక |
| 162 | 6 | దర్మనీయ | దర్శనీయ |
| 164 | 22 | బహుశుత్రుల | బహుశ్రుతుల |
| 165 | 16 | మీవైషమ్యమే | మీవైదుష్యమే |
| 168 | 22 | మహోదయలు | మహోదయులు |
| 169 | 15 | త్వాటిత | త్పాటిత |
| ,, | 16 | త్వేటి | త్పేటి |
| 176 | 12,13,14 | అవబృథము | అవభృథము |

# విషయ సూచిక.



శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

గాడేపల్లి. వీరరాఘవ శాస్త్రిగారి

# చమత్కారకవిత్వము.

---

శ్లో. దివ మప్యుపయాతానా, మాకల్ప మనల్పగుణగణా యేషామ్,
రమయన్తి జగన్తి గిరః, కథ మివ కవయో న తే వంద్యాః ?

శతావధాని

గాడేపల్లి. వీరరాఘవ శాస్త్రిగారు

జననము:— ఖర చైత్ర బ (౬)౭ గురువారము (30-4-1891)

మరణము:— తారణ ఫాల్గున బ ౭ సోమవారము (5-3-1945)

జీవితకాలము ఒకమాసము తక్కువగా ౫౪ సంవత్సరములు.

వీరి గ్రామము కర్నూలు జిల్లా మార్కాపురము తాలూకా ఎఱ్ఱగొండపాలెము. వీరిది తెలగాణ్య వైదికశాఖ.

వీరు గొప్ప కవీశ్వరులు. అలోకసామాన్యమైన అగణితప్రతిభగల ఆధునిక కవులలో అగ్రగణ్యులు. అసాధారణమైన ప్రతిభ, అనుపమానమైన ధోరణి, ఉదాత్తమైన ధార, ఉచ్ఛృంఖలమైన ఊహ, ఉత్తేజనకరమైన వాక్కు—ఇవి వీరకి భగవత్ప్రసాదితములైన లోకోత్తరగుణములు. ఇన్నిటిని మించినది ఆకారదైర్ఘ్యము. ఆకారదైర్ఘ్యము నధఃకరించినది దీర్ఘ

సమాస సంఘటనము. పిఱికి కండ లేని గుండె! వీరధైర్యము! రాతి బొమ్మలకును చక్కిలిగింతలు పెట్టు చమత్కారసంభాషణము! సమయస్ఫూర్తి, ఏకసంథాగ్రహణశక్తి—ఇవి వీరికి సహజగుణములు. చదివిన దల్పము! సాధించిన దధికము!! ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః!

శాస్త్రిగారి జాతకము.

ఖర నామ సంవత్సర చైత్ర బ౬ గురువారము ౩-౫౦ ఉపరి సప్తమిఘటికలలో **సూర్యాస్తమయానంతరము** ౮ గడియల మీఁదట వృశ్చికలగ్నములో జననము.

ఉత్తరాషాఢా నక్షత్రాద్యంతము ౫౬-౨౩ గర్భభుక్తి ౮౩-౬.

జననకాల రవిదశాశేషము. ౧ సం॥ ౮ మా॥ ౨౯ దినములు.

| | | | |
|---|---|---|---|
| శు | ర బు | కు రా | |
| గు | లగ్నకుండలి | | |
| చ | | | శ |
| | ల కే | | |

| | | | |
|---|---|---|---|
| చ గు | | కు రా | |
| | నవాంశకుండలి | | |
| | | | |
| బు | శు కే | ల శ | ర |

—: అలవడినవిద్య :—

గురుకులవాసమువలన నేమి? జన్మాంతరసంస్కార విశేషమున నేమి? అలవడినవిద్య యజుర్వేదమునందు సంహిత, (కొంత పదము, కొంత క్రమము కూడ.) అరుణపంచకము, ఉపనిషత్పంచకము—స్మార్తభాగములో షోడశకర్మలు—, శ్రౌతములోఁ గొంత భాగము—, సాహిత్యములో నాటకాంతసాహిత్యము—, జ్యోతిషములో జాతక ముహూర్త భాగములు—, మంత్రశాస్త్రములో కొద్దిపాటి పరిచయము (వారు వ్రాసిపెట్టుకొనిన విషయములను బట్టి), వేదాంతములో నొకరికీ నచ్చఁజెప్పఁగల పరిశ్రమ—, ఉపన్యాసములో గంభీర ధోరణి—, రాజకీయములలో నొకరికిఁ దీసిపోవని ప్రజ్ఞ అన్నిటికి మెఱుఁగుపెట్టినది కవిత్వము.

౫౭ సంవత్సరముల జీవితకాలములో వీరు భాషకుఁ జేసిన సేవ ౩౭ సంవత్సరములు. విద్యాభ్యాసమునకు వినియోగించిన కాలము ౧౧ వ సంవత్సరమునుండి ౨౦ వ సంవత్సరమువఱకు విఘ్నాయత్తమైన కాలముతోఁ గూడ ౧౦ సంవత్సరములు.

—. అధ్యయన పాఠము :—

౧౧ వ యేఁట బ్రహ్మోపదేశము (ఉపనయనము) అయిన తర్వాత తండ్రిగారియొద్దనే స్మార్తభాగములో షోడశకర్మలును, యజుర్వేదములో సంహిత, అరుణపంచకము, ఉపనిషత్పంచకము, అవసరమైన శ్రౌతభాగము వల్లించిరి. సంహితలోఁ గొంత కొఱవడియుండఁగా స్వగ్రామములోనే

బ్రహ్మశ్రీ రాళ్లభండి నృసింహశాస్త్రులవారియొద్ద దానిని పూర్తి చేసికొనిరి. సంహితలో కొంత పదము, కొంత క్రమము కలిసెను. అంతటితో వేదవిద్య కుత్సర్జన మయ్యెను.

—: సాహిత్యపఠనము :—

౧౯ వ యేట సాధారణసంవత్సరములో బ్రహ్మశ్రీ మేడవరము సుబ్రహ్మణ్య శాస్త్రులవారియొద్ద స్వగ్రామము లోనే కావ్యపాఠ మారంభించిరి. నాటకాలంకారసాహిత్య గ్రంథములు మా రెడ్డివారిపల్లె బ్రహ్మశ్రీ భారతుల నృసింహ శాస్త్రులవారియొద్దఁ బూర్తి చేసిరి. పరీధావి సంవత్సరాషాఢ శుక్లైకాదశినాఁటి పితృమరణముతో సాహిత్యశాస్త్రమునకు స్వస్తి చెప్పఁబడినది. ఇంతకును నేఁ డింత ప్రశంసాపాత్రు లనుగాఁ జేసిన సాహిత్యశాస్త్రమునకై వీరు పడిన గురుకుల వాస క్లేశము 3 సంవత్సరములు గూడ లేదు. వేదము చదువు దినములలోనే స్వయ ముద్భవ మైనది కవిత్వము. కావ్యపఠ నముతోనే ఆవిర్భవించినది అవధానశక్తి. ఈ విషయములు మున్ముందు విశదపడఁగలవు.

—: శాస్త్రిగారి కుటుంబ పరిస్థితి :—

పండిత కుటుంబములకు సర్వసాధారణమైన దరిద్రదేవ తానుగ్రహము శాస్త్రిగారి కుటుంబముపై లేకపోలేదు. బ్రహ్మసృష్టిలోఁ బ్రయోజనములేని దుండదు; గనుక నిదియు నొక లోకకల్యాణమునకే కావలయును! లేకపోయినచో కాలగర్భములోఁ గలిసిపోవలసిన వ్యక్తుల నెందఱనో కవులు మృతజీవులను జేయవలసిన యవసర మే ముండును? ఎఱిఁగిన

వారు చెప్పినంతలో పూర్వమునుండియు శాస్త్రిగారి సంసారము శరీరమాత్రమై భవమునకుఁ దగ్గియుండలే దని చెప్పుదురు. వీరి తండ్రిగారితర మంతయు 'బ్రాహ్మణస్య ధనం భైక్షు' మ్మన్న శాస్త్రనియమము నుల్లంఘించి నడిచినది గాదు. అయిన నేమి? త్యాగభోగములకు కొఱవ లేదు.

మొదటినుండియు వీరి కుటుంబము పండిత కుటుంబ మని చెప్పుదురు. వేదశాస్త్రములు, యజ్ఞ యాగాది వైదిక కర్మములు అవిచ్ఛిన్నముగా నడిచిన ఆహితాగ్ని కుటుంబము. రాఘవశాస్త్రిగారి తండ్రి శివరామదీక్షితులు క్రమాంత స్వాధ్యాయపరులు. ఆధానము చేసి అవిచ్ఛిన్నముగా అగ్ని హోత్రము లుంచుకొన్న అతిదీక్షాపరతంత్రుఁడైన కర్మఠుడు. శాస్త్రిగారి జ్యేష్ఠసోదరు లిరువురిలో పెదకోటావధానులు గొప్ప చదువు చదువుకొనకపోయినను ఇంటి విద్య అంతో యింతో నేర్చినవాఁడు. కాని చినకోటావధానులు వేదములో దిట్ట. అందె వేసిన చేయి. ఘనాంత స్వాధ్యాయము నేర్చిన ఘనపాఠి. ఏకసంథాగ్రాహి. ఈ యేక సంథాగ్రాహిత్వమే రాఘవశాస్త్రిగారియెడను, వారి చిన్నన్నగారియెడను ప్రత్యేక శ్లాఘనీయములై వెలసినవి.

## —: శివరామ దీక్షితులవారి నియమము :—

వీరరాఘవశాస్త్రిగారి తండ్రిగా రగు శివరామ దీక్షితులవారు సాక్షాత్తు వేదపర్వాణ మని, ఋషి యని, బాగుగాఁ జదువుకొన్నవా రని, మంచి సదాచారసంపత్తి గలవా రని, నిత్య సంతృప్తు లని, నిరతాన్నప్రదాత లని, నిత్యాగ్నిహోత్రు

లని అందఱకును ఎంతో గౌరవము. దీక్షితులవారు నిత్యము యాయావరము వెళ్లువారు. వెళ్లినప్పు డెంతో ఆదరముగా వారిని సత్కరించెడివారఁట. దీక్షితులవారును ఆ సంచిత ధాన్యమును దెచ్చి, అంగడిలోఁ బోసి, దానికి వచ్చినన్ని బియ్యము, ఉప్పు, పప్పు పదార్థములు దీసికొని ఆనాఁటి కది నిశ్శేషముగా ఆరగింపవలసినదే, అంతే. యదహ్నా త్కురుతే పాపం తదహ్నా త్ప్రతిముచ్యతే! అయిన నేమి? అసాక్షి భోజనము చేసిన దిన ముండదఁట. ఏవేళకేని పదార్థమును మార్చుకొని తెచ్చి, పండు గనియో, పర్వ మనియో, నో మనియో, వ్రత మనియో యేదో యొక పేరు పెట్టి అప్పటి కప్పు డొక బ్రాహ్మణుని, ఒక ముత్తైదువను బిలుచుకొనవలసినది, షడ్రసోపేతముగ భోజనము చేయవలసినది. ఇది వారి నిత్యజీవితమఁట! ఇంటిలో తిండికి తక్కువమంది యగుట యెప్పుడు లేదు. కావలసినంత బలఁగము! ఇట్లు జరుగవలసి యున్నవి. అన్నప్రదాతలును, విద్యాదాతలును గాఁబట్టి విద్యార్థులకుఁ గొదవ లేదు. బంధుప్రీతికి కఱవు లేదు గాన చుట్టపక్కములకు కొఱవ లేదు. ఇంతకును దీక్షితులవారి జీవిత చరిత్రమునకు మెఱుఁగుపెట్టినది వారి భార్య సుబ్బమ్మగారఁట. పతిభక్తిపరాయణురాలైన యాయిల్లాలంత లేవడి సంసారములోఁ గూడఁ గనఁబఱచెడి సర్దుబాటు, సహనభావము, వచ్చిన వారియెడఁ జూపు ఆదరాతిశయము—ఇవి కులస్త్రీలకు గుణపాఠము లని చెప్పుదురు.

—: పిత్రాదివియోగము :—

వీరరాఘవశాస్త్రిగారితండ్రి డెబ్బదియేండ్ల పూర్ణాయుర్దాయముతో శాస్త్రిగారి ౨౧వ యేట పరీధావి ఆషాఢ బ ౧౧లు పరమపదించెను. తల్లియుఁ బూర్ణాయుర్దాయముతోనే (శాస్త్రిగారి ౨౩వ సంవత్సరమున) భావ సం. ర కార్తిక బ ౧౨లు కాలధర్మము నొందెను. జ్యేష్ఠసోదరులగు పెదకోటావధానులు తండ్రి మరణానంతర మచిర కాలములోనే గతించిరి. చినకోటావధానులు రక్తాక్షి కార్తిక బ ౧లు చనిపోయిరి. శాస్త్రిగారికి ద్వికళత్రయోగము పట్టినది. ప్రథమ కళత్రము ఇలపావనమువారి యాఁడుపడుచు. ఆయమ రెండేండ్లు కాఁపురము చేసి రుధిరోద్గారి సం. ర ఆశ్వయుజ బ ౫లు కాలధర్మము నొందఁగా మఱి మూఁడేండ్లకు అక్షయ సం. శ్రావణ బ ౧౩లు ద్వితీయ వివాహము చేసికొనిరి. ఈయమకే ఒక కొమార్తెయు, ఇరువురు కుమారులును (పోయినవారు పోఁగా) నుండిరి.

శాస్త్రిగారు గతించిన 3 మాసములకు రెండవ కుమారుఁడు గతించెను. శాస్త్రిగారి కుటుంబ మింత్రమాత్రమే గాక పెద్దన్నగారి భార్యయు, చిన్నన్నగారి భార్యా కుమారులును, ఇరువురు చెల్లెండ్రలో నొక్కతెయు, ఆమె కుటుంబమును ప్రకృత మున్నారు. (1945.)

—: శాస్త్రిగారి బుద్ధికుశలత :—

వీరరాఘవశాస్త్రిగారు చాలవఱకు తమ తండ్రిగారి యొద్దను, ఏ కొంచెమో బ్రహ్మశ్రీ రాళ్లభండి నృసింహా

శాస్త్రిగారియొద్దను వేదము వల్లించి రని చెప్పితిమిగదా! వేదము వల్లించుకాలములోనే యీయనబుద్ధి పాదరసమువలెఁ బ్రాఁకిపోయెడిదఁట. ఎందులోఁ బట్టినను ఏక సంథాగ్రాహిత్వము, ఏదో యొక లోకోత్తరత్వము! శబ్దజ్ఞానము లేక పోయినను కొన్నిచోట్ల వేదమున కర్థము చెప్పెడివాఁడఁట. కా దని వాదించిన, ఔ నని తెలిసిన వానివలె గట్టిగఁ జెప్పుచుండెడివాఁడఁట. క్రమము, జట, ఘన—ఇట్టి వని తెలియని నాఁడే ఆధోరణిలో అవి పడుచుండెడివఁట. ఇఁక, నేర్చుకొనిన షోడశకర్మలు చేయించువిషయములో చక్కని శబ్దజ్ఞానము గలవానివలె చాకచక్యముగా, జడుపు లేకుండ సభలోఁ జేయించువాఁడఁట. ఇ వన్ని చూచి అప్పుడే కోనసీమనుండి చదువు పూర్తిచేసికొని వచ్చిన బ్రహ్మశ్రీ మేడవరము సుబ్బరాయశాస్త్రిగారు (ఎల్లగొండపాలెము) ఈతని కొ కక్షరము చెప్పినచో మాట దక్కించుకఁగలఁ డని యూహించి 'కావ్యపాఠము చదువుకోరా చెప్పెద' నని చెప్పిరఁట. వేదము వల్లించిన నోటికి కావ్యపఠన మంత కష్టము కాదు గాని అదేమో రాఘవశాస్త్రిగారికి శబ్దములే (అంతకు ముందు ప్రయత్నించి యుండఁగా) నోటఁబడినవి గావఁట. అందుచేత బలవంత మూఘుస్నాన మైనది. సుబ్రహ్మణ్యశాస్త్రులవారు చదువుకొమ్మన్న తరువాత కాఁబట్టని చదువు గనుక రాఘవశాస్త్రి ఒక నియమము కోరెనఁట. 'చెప్పిన పాఠ మడుగకుండ, అడిగినంత పాఠము చెప్పవలసిన' దని ఆ నియమము. కానీ చూత మని ఆ నియమమునకే ఒప్పుకొని సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రఘు

వంశ మారంభించిరఁట. అప్పటికే వారి దగ్గఱ భారవి, మాఘము చదువుచున్న విద్యార్థు లుండఁగా మన రాఘవ శాస్త్రి ఆరంభించిన పాఠ మంతలోనే అడుగుపట్టించి భారవి పాఠములోనికి చొకళించి, తోడివిద్యార్థులతో సహకరించె నఁట. శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రులుగారే రాఘవశాస్త్రిగారి తెలివి తేటలను గుఱించి యిట్లు చెప్పిరి. సమాసములు చెప్పు నపుడు విశేషణపూర్వపదకర్మధారయసమాసములో 'నీలం చ త దుత్పలం చ నీలోత్పల' మ్మని విగ్రహము చెప్పునపుడు రెండు చకారము లెందుకో చెప్పుఁ డని యారంభములోనే అడిగెడివాఁ డని చెప్పిరి. విద్యాగురువులకడ నింతటి ప్రతిభను గనఁబఱచుట చేతనే శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రులుగారు నల సంవత్సరాది నాఁడు దొనకొండలోఁ దమ యధ్యక్షతక్రిందఁ జేసిన శతావధానములో శిష్యుని ఆశీర్వదించుచు నిట్లు వ్రాసిరి.

శ్లో. జన్మాంతరాదృష్టవశానుయాత
విద్యావశేషైద్యకవిత్వ భాజః,
నిమిత్తమాత్రం తవ శిష్యరత్న !
వయం గురుత్వస్య పదే నిషణ్ణాః.

శా. ప్రారంభించిరి నాదుసన్నిధిని గావ్యం బెందఱో, వారిలో
నీరీతిన్ సుకవీశులై శతనధానేచ్ఛన్ సభన్ జేసి యీ
ధీరోత్తంసులు మెచ్చ, ధారగణయు సందీపింపఁ బద్యంబు లిం
పారన్ జెప్పుచుఁ గీర్తి గొంటి ; విది మా కానందమున్ గూర్చెడిన్.

అని యీ సందర్భమునఁ దమ సంతోషము నపారముగాఁ గొన్ని పద్యములలో వెల్లడించిరి. అవి ముందు ప్రకటింపఁ

బడును. విద్యాదాతలగు గురువులే స్వయముగా నిట్లు వెల్ల డించుటచే నీ విషయములో నతిశయోక్తి కవకాశము లేదని పాఠకలోకము గ్రహింపఁగల్గును.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు నిమిత్తమాత్రులుగాఁ జెప్పిన చదువులో రాఘవశాస్త్రిగారు పట్టు మని యొక కావ్యములో వరుసగాఁ జదివినవి నాల్గు సర్గలుకూడ లేవఁట. అక్కడ కొంత, అక్కడ కొంత. ప్రారంభించినది రఘువంశము. పదిదినములలో భారవి విద్యార్థులతో సతీర్థ్యత్వము. గురువుగారు చెప్పవలసినది, శ్రోత్తగాఁ దెలిసికొనవలసినది అన్న భాగమే వీరిలో లేనిది. సంప్రదాయవిచ్ఛేదము జరిగింపరాదని గురువులయొద్ద పుస్తకము పట్టిన పూర్వుల చరిత్ర సత్యపూతమే యనిపించుట కిదియు నొక దృష్టాంతమే.

అలోకసామాన్యమైన ఆ పాఠమైనను శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిలవారియొద్ద నెన్నాళ్లో జరిగినది గాదు. కొలఁది కాలములోనే శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారికి శోభజాడ్యము కనిపించుటయు, మా రెడ్డివారి పల్లెనుండి శ్రీ భారతుల నృసింహశాస్త్రిగారు చుట్టాలను జూడ చందవర మగ్రహారమునకు వచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిలవారిని జూచి పోవుటకుఁగా నని పోలేపల్లె అగ్రహారమునకు (సు. శాస్త్రిగారి స్వగ్రామము) వచ్చిరఁట. (వీరు రాఘవశాస్త్రిగారి మరణానంతరము ౨౬మాసములకు పార్థివ శ్రావణ పూర్ణిమనాఁడు గతించిరి.) అప్పుడు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నృసింహశాస్త్రిగారితో రాఘవశాస్త్రిగార ప్రతిభావిశేషములను జెప్పి 'నాకు నయ మగు

నంతవఱకు ఈతనిని మీదగ్గఱ నుంచుకొని ఒకసూరము చెప్ప వలసిన' దని చెప్పి రాఘవశాస్త్రితో 'ఏమిరా వెళ్లెదవా?' అని యడిగిరఁట. 'మీ రిచ్చిన యభయదానమే వారు నిచ్చి నచో వెళ్లుదు' నని చెప్పెనఁట. ఆనియమ మే మని నృసింహ శాస్త్రిగా రడుగ, 'చెప్పినపాఠ మడుగరాదఁట, అడిగినంత పాఠము చెప్పవలె నఁట. ఇది నియమ' మని సుబ్రహ్మణ్య శాస్త్రిగారు చెప్పఁగా 'ఇది యేమి నియమ?' మని నృసింహ శాస్త్రిగా రాశ్చర్యపడుచు సుబ్రహ్మణ్యశాస్త్రిగారివలన విషయ మంతయు వినియున్నవారు గాన, రాఘవశాస్త్రిగారి కుపనిషత్తులు వచ్చును గాఁబట్టి, అవి తాము నేర్చుకొన వీ లగు నని ఆ నియమమునకు బద్ధు లయియే రాఘవశాస్త్రి గారిని బిలుచుకొనిపోయిరి. అక్కడ రాఘవశాస్త్రి సహజ ప్రతిభతో వారి కుపనిషత్తులు చెప్పుచు, వారికడ నాటకాలం కారములు చదువుకొనుచు విషయము వచ్చినపు డబ్బురము గల్గునట్లు చర్చించుచు నుండెను. కావ్యపాఠారంభమునుండియే కవిత్వము చెప్పుట, అవధానములు చేయుట అలవాటు పడి యున్నవి గనుక సమయము వచ్చినపుడు కవితాధోరణితో ఆశ్చర్యము గలిగించుచు నుండెను. వీరి దగ్గఱ నున్నపుడే తండ్రి చనిపోవుట, ఇంతటితోనే విద్యకు స్వస్తి చెప్పుట సంభ వించెను.

—: కవితావిర్భావము :—

మహాకవి వాల్మీకికి 'మా నిషాద! ప్రతిష్ఠాం త్వ...' మ్మను మాటతోనే కవితాధోరణియావిర్భవించినట్లువీర రాఘవ

శాస్త్రిగారికిని కవితావిర్భావఘట్ట మొక యద్భుతావహముగాఁ గన్పట్టుచున్నది.

బ్రహ్మశ్రీ రాళ్లభండి నృసింహశాస్త్రిగారియొద్ద (ప్రమాదీచ చైత్రములో) అధ్యయనము చేయుచున్నప్పుడొకనాఁడు వల్లె వేయుచున్న తరుణములో ఒక ప్రౌఢవితంతువు శాస్త్రులుగారింటికి వచ్చినదఁట. ఆమె లోపలికిఁ బోయిన యించుక సేపునకుఁ దమతోపాటు చదువుకొనుచున్న తుమ్మలపల్లి కామయ్యగారి కుమారుఁడు నరసింహ మను విద్యార్థి లోపలికిఁ బోయి త్వరలో రాకపోయెనఁట. అప్పుడు రాఘవశాస్త్రి

ఉ. తుమ్మలపల్లి కామయసుతుండు వితంతులఁ గేశయుక్తలన్
రమ్మని కౌఁగిలించి యధరంబును జుంబన మాచరించి, దో
సమ్మని యెంచకే రతుల సంతస మందుచు నుండు; నిట్టి కా
ర్యమ్ములు వీనిపూర్వు లెవరైన నెఱింగిరె? యెంచి చూడఁగన్.

అని యాశువుగా పద్యము వ్రాసి తోడివిద్యార్థులచేతి కిచ్చెనఁట. అది వా రందఱు చదువుకొని గురువుగారికిఁ గూడ వినిపించి గేలిచేయ నారంభించిరఁట.

'చండాలవ చ్ఛాందస' మ్మని కవితాకన్య దూరముగాఁ దొలఁగిపోయెడి వేదాభ్యాసికి ఛందోనియమము లేమో బొత్తిగాఁ దెలియనికాలములో అప్రయత్నముగా, ఆఱితేఱిన వారు వ్రాసినట్లు, ఆశువులో ఈ పద్యము దొర్లుట భవిష్యద్యోగమునకు గొప్ప సూచక మని అప్పు డానందపడిన గురుజనులు తత్పరిణామమునకు మిక్కిలి సంతసించినవారే యైరి.

నిజమున కీపద్యము కృతహస్తులు వ్రాసినంత జిగిబిగి గల్గి యున్న దని యనుభవజ్ఞులకుఁ దోఁపకమానదు.

ఈ పద్యము తిన్నగా నరసింహముచెవిని బడఁగానే ఆతఁడు మండిపడుచు 'రాఘవుఁ డేమి పద్యము వ్రాసినాఁడో చూడండి' అని గురువుగారితోఁ జెప్పికొని యేడ్చుచు, చెల రేపుకొన్నచోఁ దనకే రసాభాస మగు నని నిబ్బరించుకొని బతిమాలుటలోనికి దిగి మంచి యభిప్రాయముతోఁ బద్యము చెప్పవలసిన దని రాఘవశాస్త్రి ననేకవిధములఁ బ్రార్థించెనఁట. ఆమీఁద అట్లే కొన్ని పద్యములు చెప్పెనఁట. కాని యా పద్యము లీపద్యమువలె నల్వురినోళ్ళఁ బడినవి గావు. రాఘవ శాస్త్రిగారును ధారణ పట్టియుండకపోవుటచే 'ఎక్కడనో వ్రాసి పెట్టియుందును, చూచి చెప్పెదు' నని నాతోఁ జెప్పిరి; కాని ఆపని పూర్తి కాకమునుపే వారు దాఁటుకొనిరి.

అప్రయత్న జనితమైన ఆదిమశ్లోక మపారమైన రామా యణరచన కాధార మైనట్లు స్వయముద్భవమైన రాఘవ శాస్త్రిగారి యీప్రాథమిక పద్యావిర్భావ మెటువంటి వాఙ్మయసృష్టికిఁ బునాది యయ్యెనో యిప్పు డనుభవైక వేద్యమై తెలియఁబడుచున్నదిగదా!

జన్మాంతర సంస్కారమును బట్టి స్వతస్సముద్భూత మైన కవిత్వముతోపా టవధానశక్తియు శాస్త్రిగారి కారంభ ములోనే ఆవిర్భూతమైనది. శ్రీమేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రి గారియొద్ద పుస్తకము పట్టినప్పటినుండియే ఆశుకవిత్వ మల్లుట, అవధానధోరణిలోనికి దిగుట, పిల్లపిల్ల యవధానములు చేయుట,

అప్పటిలో అత్యుచ్ఛ్రియముగాఁ బ్రభ వెలిఁగించుచున్న తిరుపతి వేంకట కవులతోనే పద్యరచనతోనే ఉత్తరప్రత్యుత్తరములు నడుపుట ఈ మొదలైనవానితో కవితాలంకకు మాటాకు హత్తినది.

ఆప్రకారముగా అడ్డు లేకుండ అందులోనే అధికవ్యాసంగము సాగినదో అపు డెట్లుండునో యేమో! 'ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః' అన్న ప్రతిష్ఠ యెక్కడ తప్పిపోవునో యని భగవంతుఁడు పితృవియోగము ఘటించెను. అంతటితో సంసారభారము నెత్తిని బడుటయు, చదువు ముగియుటయు నయ్యెను. ఇంతకు వయసు ౨౧ సంవత్సరము.

'జొన్నలు జమ పేలాలు ఖర్చు' గా నడిచిన సంసారమగుటచే తండ్రిగారు గతించిన తర్వాత కుమారులకు దక్కిన పిత్ర్యమైన ఆస్తి తద్దిన మొక్కటి, తర్వాతి ఋణ పణముల కాస్పద మిచ్చిన దాహిత్రసంబంధమైన భూములు కొన్ని. తండ్రి తర్వాత సంసారమును దొర్లించుటకు శాస్త్రిసోదరులు రెండుగాండ్ల సేద్యము, దానికిఁ దగిన కామాటము పెట్టి కృషి సాగించిరి. ఇ దంతయు అప్పు గొని చేసిన విభవమే. ప్రకృతి రమణీయములే యైనను పనికిమాలినవిగాఁ జేయఁబడెడి బ్రాహ్మణమాన్యములు పాఁటఁబోసిన గంజివలె బండెఁ దున్నవి గనుకను, ఇచ్చిన డబ్బునకు తెచ్చిన యెద్దులు మొదలైనవి పూట యుండును గనుకను అప్పిచ్చువా రాత్మలాభమును జూచుకొన్నారు. ఈవిధముగా కామాటము సాగిపోవుచున్నది.

—: అన్నగారి యౌదార్యము :—

ఇఁక ఇంటిలో పెత్తనము పెదకోటావధానులది. ఆయన తండ్రిని మించిన కుమారుఁడు. ఆయనను గుఱించి రాళ్లభండి నృసింహశాస్త్రిగా రొకపద్యము చెప్పియున్నారు. నృసింహ శాస్త్రిగా రెఱ్ఱగొండపాలెములో భారతము పురాణము చెప్పుచుండఁగా పెదకోటావధానులు ప్రతిదిన మదే పనిగా తప్పకుండ అందఱికి నశ్యదానము చేయుచుండెడి వాఁడఁట. అప్పుడు వీరు వారు సంతోషముగా మాట్లాడుకొనుచు శాస్త్రులుగారితో 'ఇంత నశ్యదానము చేయుచున్నాఁడే కోటావధానులు! ఇతనిపై ఒక్కపద్యము చెప్పఁగూడదా?' అని యడిగిరఁట. అంతట నృసింహశాస్త్రిగారు

ఉ. గుప్పున మంచివాసనలు గుప్పెడి పాటిపొగాకు నిప్పునన్
జొప్పడఁ గాఁచి, గోఘృతము సున్నము గూర్చి పురాణవేళలన్
దప్పక నశ్య మిచ్చు నిరతంబు బుధాళికి; గాడెపల్లి కో
టప్పకుఁ గల్పభూజ కలశార్ణవ కర్ణులు సాటివత్తురే?

అని పద్యము చెప్పిరఁట. పెదకోటావధాను లనఁగా నిట్టి వాఁడు. ఇఁక నీయన చేతిక్రింద నడిచిన సంసార మేరీతిగఁ జక్కఁబడినదో తెలియఁగలదు. క్రొత్త సేద్యము! అందు లోను బ్రాహ్మణసేద్యము! ఇచ్చినంతవఱకు అప్పు తీసికొని వచ్చుట, అవసరములు తీర్చుకొనుట. ఇట్లుండఁగా రాఘవ శాస్త్రిగారు సంపాదనకు బయలుదేఱవలసిన యవసర మేర్ప డెను. అప్పు డక్కడక్కడ ఆశుకవిత్వమో, అవధానమో

చేసి అబ్బినంత యింటికిఁ బంపించుచు వచ్చిరి. ఎంత పంపినను కోటావధానుల చేతిలో భస్మమైపోవుచు వచ్చినది.

అపకారియే యుపకారి యన్నట్లు సర్వశూన్యమైన దారిద్ర్యమే శాశ్వతప్రతిష్ఠకు సాధనభూతమైనది. అట్లు గాక ధనద్రవ్యాలకు లోపమే లేకపోయినచో నొకరిని దేబెరింపనలసిన యవసర మేముండును ? ఇది కారణముగా శాస్త్రిగా రనేక స్థలములలో అవధానములు, ఆశుకవితాప్రదర్శనములు, ఘంటాశతకల్పనలు, గ్రంథరచనలు మొదలగునవి బాహాటముగాఁ జేయవలసివచ్చెను. కనుకనే దారిద్ర్యదేవతా స్తవములో దానిమాహాత్మ్య మిట్లని యుత్కీర్తనము చేయఁబడినది.

శ్లో. హే దారిద్ర్య ! నమ స్తుభ్యం సిద్ధోహం త్వత్ప్రసాదతః,
పశ్యా మ్యహం జగ త్సర్వం, న మాం పశ్యతి కశ్చన.

(ఓ దారిద్ర్యమా! నీకు నమస్కారము. ఏమి నీ మహిమ! నీయనుగ్రహమువలన నేను తిరస్కరిణీవిద్యాప్రభావాదులు గల సిద్ధుఁడనైపోయితిని! ఎట్లన? ప్రపంచము నంతయు నేను జూచుచున్నాను, కాని న నొకఁడైన నను జూచుట లేదు.)

ప్రమాదీచ సంవత్సరమునుండి పింగళ సంవత్సరము వఱకు ఈమైదేం డ్లేకదీక్షగా శాస్త్రిగారికి కవితాయాత్ర సాగినది. పోయినచోటనెల్ల అవధానమో ఆశుకవితాప్రదర్శనమో, ఘంటాశతకల్పనమో, గ్రంథరచనయో సల్పుట, అక్కడ వచ్చిన సంభావన యింటికిఁ బంపుట, యిది యప్పటి

పని. ఈప్రకారముగా రాఘవశాస్త్రిగారు సంపాదించిన ద్రవ్యము—ఆదినములు గనుక విశేషముగానే యుండెనఁట!

శాస్త్రిగారు ధగిడీ భిక్షయే గాని, దైన్యభిక్ష యెప్పుడు-ఎఱుఁగరు. వారిజీవితమధ్యములో వారినోటినుండి వెలువడిన వాఙ్మయములోనైన దీనోక్తు లెక్కడనేని కానరావు. ఏవిధము లైన కల్పనలలో నైనను తమగొప్పతనము బయటఁ బడవలసి నదే గాని దేబెరింత యనునది లేదు. మచ్చున కొక విషయము:—

—: టిక్కెట్టిమ్మన్నందులకు :—

ప్రభవ సంవత్సర భాద్రపదమాసములో (1927) రాఘవశాస్త్రిగారు గుంటూరు వెళ్లుచు గుంటూరు రైల్వే స్టేషనులో దిగి ఆబండిలోనే కొప్పరపు సుబ్బరాయకవిగారు వచ్చి తటస్థింపఁగా ప్రాంగణము (ప్లాట్ఫారము) మీఁద నిరువురు మాట్లాడుచుండిరఁట. అప్పుడు స్టేషన్ మాష్టర్ వచ్చి 'డి. టి. యస్. వచ్చియున్నాఁడు, ఇక్కడ నిలువరాదు. టిక్కెట్టిచ్చిపొండి, తే టిక్కె' ట్టని తొందరించెనఁట. అంతట రాఘవశాస్త్రిగారు

శా. డీ. టీ. యస్ మొదలైన మీ దొరలె ధాటీనిర్జితాభ్రాపగా
త్యాటోపప్రద మామకాశుకవితోద్యచ్ఛక్తి నీక్షించి లా
లాట న్యస్త తదీయ హస్తు లగు లీలల్ మీరు వీక్షింపమిన్
తే టిక్కెట్టన నోరు పైకెగసె, లేదేన్ శక్యమా? మేష్టరూ!

అని ఆశువుగాఁ జెప్పి మఱికొన్ని పద్యములు గూడఁ జెప్పిరఁట! మేష్టరుగారికి భయ మేమాయెనో గాని బ్రహ్మానందమైనది.

—: శాస్త్రిగారి సాహసము :—

పై పద్యము విడిగా నున్నప్పుడు చెప్పినది. అది య టుండ నిండు. నల సం॥ వైశాఖమాసములో (26-6-1918) నెల్లూరు టౌనుహాలులో వావిలికొలను సుబ్బారావుగారి యధ్య క్షుతక్రింద జరుగుచున్న శతావధాన ప్రారంభ కాలమున

శా. ఏస్థానంబునఁ బాఱఁజూచినను, నిం దెచ్చోఁ బరీక్షించినన్
బ్రస్థానత్రయశాంతికిన్ దగిన విద్వద్బ్రహ్మలే, వేదభా
ష్యస్థార్థప్రతిపాదనాచతురులే, సాహిత్యవిద్భోజులే!
యీస్థానంబున మద్వధాన మటవే? యేధైర్యమే శాంకరీ!

అని తమయిష్టదేవతయొక్క సాహసమున కాశ్చర్యపడిన శాస్త్రిగా రనంతరము చెప్పినపద్యములోని విద్యాగర్వ మించుక చిత్తగింపఁదగియున్నది.

చ. అడిగిన ప్రశ్నజాలముల కన్నిటికిన్ బ్రతి చెప్పలేక యే
యిడుమల కొటపట్టగునో యింతటిసత్కవిసార్వభౌముఁ డం
చడలెదఁ దాల్పఁబోక హృదయంబులఁ గల్గిన కోర్కెల్ల వె
ల్లడిగ వచింపుఁ డోసభికులార! యి కేటికి సంశయించుటల్?

అని క్లిష్టసమయములందుఁ గూడ నీప్రకారము ధీరోక్తులు పల్కినవారే గాని దీనోక్తులు నోట వెలువరించినవారు గారు. నెల్లూరులో జరిగిన యీశతావధానములోనే అష్టావధాన కార్యములుగూడ జరిపించుట, అందులో సర్వతోముఖముగ జయ మొంది పద్యప్రశంసల నందుట ఆవిషయము మున్ముందు సాకల్యముగా వ్రాయఁబడును.

శాస్త్రిగారు చేసిన అవధానములు, చెప్పిన ఘంటా శతములు మొదలగునవి వారు జ్ఞాపకము చేసికొని చెప్పు చుండఁగా నేను పట్టిక వ్రాసిపెట్టినవి ౮౯ వఱకుఁ గలవు. ఇంకను జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని చెప్పెదు మనిరి కాని యది పూర్తి గాలేదు. పట్టిక కెక్కకుండ మఱుఁగుపడిన వెన్ని యుండునో! ఈ ౮౯ లో ఆశుప్రబంధరచనలు కలియలేదు. అవి కొన్ని గలవు. ఈయవధానాదిపట్టిక వేఱొకచోఁ జేర్పఁ బడును.

—: అవధాన ఫక్కి :—

శాస్త్రిగారు చేసిన యవధానములలోఁ గాని, ఆశుకవితలోఁ గాని అవకతవక లేశ మణుమాత్రము ఉండరాదు. వచ్చిన విషయము గాని, ఇచ్చిన సమస్య గాని 'యిది నాచేతఁ గా' దని మీఁదు పెట్టినది వారిజీవితములో లేదు, ఒక్క 'శార్ఙ్గ్యంఘ్రిస్మరణవలన సద్గతిగల్గున్' అను సమస్య తప్ప. ఈ సమస్యా విషయమైన గాథ ముందు విశదపఱుపఁబడును. నల్వురితో పోటి వచ్చినను ఒకరికంటె పై చేయియే గాని పడిపోవుట యంచు నెఱుఁగరు. అవధాన శకమును నెలకొల్పిన తిరుపతి వేంకట కవు లొకయుత్తేజము గల్గించిన యాదినములలో అవధాని యన్నచో పట్టి చూడవలె నన్న పట్టుదలతోనే ప్రతి వారు నుండిరి. ఇది గాక యిప్పటికంటెను అప్పుడు కవులు, పండితులు మంచి ఘటికులుగా నుండిరి. కనుక అప్పట్లు శాస్త్రి గారి నెదుర్కొన్న ప్రశ్నలు, సమస్యలు, సందర్భములు, సంఘటనలు గడ్డువిగానే యుండినవి. ఎట్లున్నను కక్కుఱితిపా

టనునది లేదు గనుక అనుకొన్నదానికంటె అధికముగానే అడిగినవారానందపడుచు వచ్చిరి. అనర్గళమైన ఆశుధార వాచో విధేయముగా నుండుట, శతావధానములోఁ గూడ అష్టావధానకార్యములు చేయుట, ఎంత దుష్కరప్రాసమైనను సుకరప్రాసముకంటెను సులువుగాఁ బూరించుట ఇవి శాస్త్రిగారికి సభారంజనమునకు సహకారము లైనవి. ఈనడక రచ్చపట్లు మొదలు రాజాస్థానములవఱకును ఏకధాటిగా నడిచినది. ఆశువులోఁ జెప్పునపు డెవరైన దుష్కరప్రాస వేసికొనువా రుందురా? శాస్త్రిగారిసాహసము చూడండి! (26–6–1918) నెల్లూరు శతావధానారంభములో 'చెప్పెదను వ్రాసికొనుఁ' డని లేఖకునికి హెచ్చరిక చేయుచు ఎత్తుకొనిన యెత్తుగడలోనే 'వ్యాఘ్రుదిని బయలుదేఱె' నని ప్రారంభించిరఁట! అప్పుడే సభలో 'ఎత్తుకొనుటతోనే దుష్కరప్రాస వేసికొన్నాఁడే, అందులోను ఘ్రప్రాసయే, ఎట్లు పూరించునో? యని కొందఱును, ప్రకృతోపయోగముగా ఘ్రకారప్రాసతోడి పదము లేమున్నవో? యని కొందఱును, మొదటనే చిక్కువడున ట్లున్నాఁడే యని కొందఱును జిజ్ఞాసాపరులు, జిగీషాపరులు తమకుఁ దమకుఁ దోఁచిన ట్లెల్ల ననుకొనసాగిరి. శాస్త్రిగారి యుద్దేశములో నిది ఘ్రప్రాస యన్న దృష్టి లేదఁట. గ్రప్రాస అని యేమఱుపాటున ననుకొనిరఁట. అప్పుడు మఱొకమాఱు చదువుకొనునప్పటికి దుష్కరప్రాస పడినదే యని స్ఫురణకు వచ్చి, అయినను మించిపోయిన దేమున్న దని ఆశువున కాటంకము లేకుండ ఆందోళనపడువా రాశ్చర్యపడునట్లుగా

కం. వ్రాఘ్రుదిని బయలుదేఱె న
నాఘ్రాతప్రసవ పరిమళామోదదమై
మీ ఘ్రాణంబులఁ దనితీఱెడు
శీఘ్రంబుగ వ్రాసికొనుఁడు చెప్పెద నింకన్.

అని అవలీలగఁ బూర్తిచేసిరఁట. నాల్గు ప్రాసములు పూర్తి యగుసరి కవధానిగారిశక్తి యందఱు నావర్జనము చేసెను.

అవసర మగు నని ముందుగా అల్లి పెట్టుకొను నలవాటు వీరిలో లేదు. ఎప్పుడైనను సద్యస్కల్పనకు సమయము దొరకినఁజాలును. ఆశువుగఁ జెప్పనీ, ఆలస్యముగఁ జెప్పనీ (ఆలస్యముగ ఆలోచించి చెప్పిన దెప్పుడూ లేదు గాక.) 'అంబర చుంబిభావాకర్షణమె గాని క్రిందిచూపుల దేబెరింత లేదు.' వీరిసమాసజాటిల్యములో నెందుఁ జూచినను సందు చిక్కదు. పండితులను, పామరులను ముగ్ధులను జేయు సమయోచిత సామగ్రి చాలినంత యున్నది గాఁబట్టి అసూయాపరులమాట యేమో గాని గుణగ్రహణపారీణు లగువారు తల లూఁచి మెచ్చుకొనఁదగిన సందర్భము లెన్నియో గలవు.

—: గుంటూరు చేఁదబావిని గుఱించి. :—

క్రోధన సంవత్సర మార్గశీర్షములో (1925) శాస్త్రి గారు గుంటూరువెళ్లి స్నానార్థమై చేఁదబావిదగ్గఱకుఁ బోయి రఁట. కొందఱు బావిలోనికి చేఁద విడుచుట, నీళ్లు తోడుట చూచి, తాము బావిలోనికి చేఁద విడుచుచు నొక సీస పద్యము చెప్పిరి. 'బావు లమితమైన లోఁతు' అని చెప్పవచ్చును

గాని ఆ కల్పనలోనే విశిష్టత! అదియే శాస్త్రిగారి దగ్గఱ నున్న లోకోత్తర చమత్కారము!

సీ. తొలునొత్త నారసాతలి కేఁగి కొలు వున్న
బలిచక్రవర్తిని బథము వేఁడి
తరువాతఁ దనవేయి తలల భూమిని దాల్చు
కాకోదరేంద్రు మార్గంబు నడిగి
ఆమీఁద శేషున కాధారమై యున్న
కమఠమూర్తిని నవకాశ మడిగి
పదపడి సకలంబు పంటితో నెత్తిన
శ్రీవరాహస్వామిఁ ద్రోవ వేఁడి
తే. గర్తపురవర కూప సంకలిత సలిల
సంగ్రహోయాత పౌర హస్త ప్రసర్ప
దసమ రశనా సమన్విత మైన చేఁద
కదిసి చనుచుండె నీరంబు గానలేక.

ఇందులో ఎత్తుగీతిలో వేసిన సమాసము గుంటూరిచేఁద త్రాటిని మించిన పొడుగుతో నున్న దని విన్నవా రానందపడ కుందురా? గుంటూరు వాస్తవ్యులకు తమయూరి బావు లగాధము లని ప్రస్తావనకు వచ్చినపు డది యొక లోపముగాఁ దోఁచినను తమబావులను గుఱించి వ్రాసిన శాస్త్రిగారి పద్య మును విన్నతర్వాత 'ఏయూరి బావులకు కవితారస మబ్బిన?' దని గర్వపడకుందురా?

—: శాస్త్రిగారి వీరధైర్యము :—

శాస్త్రిగారి గుండెలో పిఱికి కండ లే దని చదివి యున్నారుగదా! చూడండి! ఆత్మకూరు సంస్థానములో నైజాం

ఆస్థానవిద్వాంసులు! అష్టభాషావిదులు! చతుస్తంత్రవేత్తలు! శతఘంటారచయితలు! బాలసరస్వతి బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులవారు వినుచుండఁగా కుర్మతి వేంకటేశ్వరస్వామి తిరునాళ్లలో స్వామిని సందర్శించి కోవెలనుండి మెట్లు దిగి వచ్చుచు శ్రీవైష్ణవులను గుఱించి ఏమి పద్యము చెప్పిరో చిత్తగింపుఁడు.

సీ. శ్రీరంగపురము వేంచేసి చోళునిసిరి
కావేరినీటిలోఁ గలిపినారు
రామానుజాశ్రమ రాజంబు నెలకొల్పి
కంచిలోఁ బెద్దమ్మ నుంచినారు
కృష్ణరాయలఁ బెద్ద వైష్ణవాగ్రణిఁ జేసి
ఆనెగొందిని పుట మార్చినారు
ఇంటింట వైష్ణవ మిచ్చి బుజాల్ గాల్చి
సురపురం బారతిఁ జుట్టినారు
తే. పెద్దనామాల సాముల పేరు దాల్చి
ఆక్రమించిరి గద్వాల నాత్మకూరు
నేమి సేయంగ నున్నారొ యింకమీఁదఁ
జిరతరోల్లాస! కుర్మతి శ్రీనివాస!

ఈపద్యములో గతగోష్ఠి యెట్లున్నను వర్తమాన పరిస్థితినిగుఱించి చెప్పినదాని కెంతయేనియు సాహస మనక తప్పదు. ఈపద్యమును విని ఆచార్యులవారు రసికులు గావున సద్యః కల్పితమైన యీపద్యరచన కెంతో యానందించుచు అందలి విషయమును గుఱించి 'నిజమే, మావా రట్లే చేసినా' రని వాస్తవము నొప్పుకొనుటయే గాక మాకే తెలియని

యింత చరిత్రజ్ఞానము మీ కెట్లు తెలిసెనయ్యా? యని యెంతో యాశ్చర్యపడిరఁట! ఈపద్యాంతమునఁ బ్రయోగింపఁ బడిన శ్రీనివాస! యను సంబోధన దేవునికిని, ఆచార్యుల వారికిని ఉద్దేశింపఁబడినదిగాఁ దెలియవలయును.

ఈ శ్రీనివాసాచార్యులవారే ఆత్మకూరు సంస్థానములో తిరుపతి వేంకటకవులను డీకొనినది! ఈమహనీయుని మూలముననే తిరుపతి వేంకటకవులకు గజోత్సవ పర్యంతము సమ్మానము చేకూరినది! అట్టివారు రాఘవశాస్త్రిగారి కవితాధాటిని గుఱించి యొకప్పు డిట్లు ప్రశంసించి యున్నారు.

—: బాల సరస్వతి చేసిన ప్రశంస :—

శా. ఎన్నో పద్యములన్ రచించి తడబాటింతైన లేకన్ రసో
త్పన్న శ్రీకర వాక్యగుంఫన కవిత్వ ప్రాజ్య సామ్రాజ్యమం
దౌన్నత్యంబు వహించి రాజమకుటాగ్రాంచన్మణీకాంతి సం
ఛన్నాంఘ్రిద్వితయుండ వైతివి కవీశా! రాఘవార్యాగ్రణీ!

చ. పటుతర ధారణాపటిమ, పండితమోద మొసంగు వాణి, రా
ట్పటుల సభాంతరాళ కవి సంఘ పరిస్తుత కీర్తి, సర్వది
క్తటములఁ దాండవింపఁగను గౌరవమున్, బ్రతివాది దుర్దమ
త్రుటనము నిర్వహించుకొను తోరపుశక్తియు నీకె రాఘవా!

కం. కందనవోల్ జలవిలయ మ
మందానందమున నడుగ మాయెదుట నె ము
న్నుందు రచియించెఁ దమవా
గిందిర, యానందజనక మిది గాదె బుధా!

## —: కర్నూల్ జలప్రళయము :—

కర్నూల్ జలప్రళయమును గుఱించి శ్రీమాన్ బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులవారాశువుగాఁ జెప్పుమని యడిగినట్లును, రాఘవశాస్త్రిగారు వారియెదుటనే అత్యాశువులోఁ జెప్పినట్లును ఈవిషయ మాచార్యులవారు చేసిన ప్రశంసాపద్యములలోఁ బ్రసక్తాను ప్రసక్తముగా వచ్చినది. ఆచార్యులవారు కోరినవియు, శాస్త్రిగారు చెప్పినవియు నగు ఆ పద్యము లివి:—

ఉ. పొంగిన తుంగభద్ర యనఁ బోలిన వాలిన కైతధారతో
డం గరునూలు ముంచిన జలప్రళయంబు వచింతుఁ జేతనా
భంగిని, బుక్కపట్టణపు బాల సరస్వతి కోరెఁ; గాన నీ
వుం గరుణించి తోడ్పడవె పూర్తిగఁ జెప్పెద నోసరస్వతీ!

కం. శ్రీకర నల కార్తికమునఁ
బ్రాకటముగ వెల్ల చవితి ప్రారంభముగా
నేకోత్తర వాః పూరము
లీ కందనవోలు ముంచ నెసఁగుచు వచ్చెన్.

కం. ఉదయాది వర్షధారా
స్పద మయి సాయంతనంబు సరికిని హంద్రీ
నది దరుల కధికమై పురి
సదనంబుల బిగువుఁ జూడ సమకట్టె నహో!

కం. తెల తెల వాఱెడి లోపల
నలబలముగఁ దుంగభద్ర యతిజవమున లో
గిళు లంటి రాఁదొడంగెను,
బలుకఁగఁ దరమౌనె? తత్ప్రబలతరఘోషల్.

సీ. పోయిన నిల్లెగా ! పోవుఁ, బ్రాణములఁ గా
పాడుద మని తీవ్రపడెడువారు
తీవరించినను సతియు బిడ్డలును రారె ?
అయ్యయో యని ఖేద మందువారు
ఖేద మందిన నేమి ? మీఁదు మించెను, కోట
కరుగుద మని బండ్ల నరయువారు
బండ్లను బిల్వ, రూప్యములు రెం డన, విధి
లేక యూఁదల లూఁచి లేచువారు
తే. స్వామి భృత్యుఁడు నను భేద మేమి లేక
కళవళంపడఁ జేసిన కందనోలు
హంద్రి తుంగభద్రాప్రవాహప్రళయము
నిట్టి దని చెప్పఁగలవాఁడు పృథివి లేఁడు.

—: సులభంబైన సమాస మాయెనఁట ! :—

క్రోధన మార్గశిరములో (1925) ఒక పెండ్లి పెత్తనమునకుఁగా రాఘవశాస్త్రిగారు గుంటూరు వెళ్లియుండఁగా అప్పు డక్కడి కవధానము చేయవలె నని శ్రీపిశుపాటి చిదంబరశాస్త్రిగారును, శ్రీగోరావఝ్ఝుల రామకృష్ణ శాస్త్రిగారును వచ్చియుండిరఁట. వీరికి, వారికి విశేషపరిచయము గనుక సభ, సందర్భము, అక్కడిపరిస్థితులు ముచ్చటించుకొనసాగిరఁట. ఆయూరిలో నియోగి వైదిక కక్షలు ముమ్మరముగా నున్నవి గనుక అవధానసభ జరుగుట కవకాశములు తక్కువగానే యుండఁగా రాఘవశాస్త్రిగారు గూడఁ గలిసి తగినవారితో మాట్లాడి నాల్గుదినములలో నవధానసభ జరుగునట్లుగా నేర్పాట్లు గావించుకొనిరఁట. ఈలోపల నొకనాఁ డొకమిత్రుని

యింటిలో వీరు మువ్వురు చేరియున్న తరుణములో రాఘవ శాస్త్రిగారు రెండుపద్యములు వ్రాసి కూరుకుపాటు రాఁగా కన్ను మూర్కొనిరఁట. అప్పుడు రామకృష్ణ చిదంబర కవు లాకాగితము దీసి చదువుకొని 'రాఘవశాస్త్రికూడ అందఱివలెనే సులభమైన సమాసమునే వేయును గాని విశేష మేమియు లేదే' అని యనుకొనుచుండిరఁట. ఇంతలో మెలఁకువ వచ్చి ఆమాటలు చెవిని బడుటచే వెంటనే రాఘవశాస్త్రిగారు వ్రాయుచున్న పద్యములను బూర్తి చేసి, ఇట్లనుకొనిరిగదా యని కాగితము దీసికొని ఆశువుగా

మ. సులభంబైన సమాస మాయెనఁట! దిక్స్ఫద్ధాంత కాంతా నిర
ర్గళ లావణ్య మయ ప్రవాహ విహర త్కల్లోల మాలాతి ని
ర్మల డిండీర కణాయమాన సుయశో రామా మనోహారి వా
గ్విలస ద్భా[illegible]ను నన్నెఱుంగరొకో ? దేవీ! యెంతమాటాడెఁ జూ!

మ. సులభంబైన సమాస మాయెనఁట! సంక్షుభ్య ద్ధరాభృ త్సభా
స్థల విద్వ న్నికురుంబ వా గ్విహర ణాసంఖ్యాక మాద్య ద్యశో
జ్జ్వల దభ్యున్నత నూత్న కావ్యరచనా జాగ్ర త్కరాగ్ర ప్రభా
నిలయుం డీతఁ డటం చెఱుంగరొ! భవానీ! యెంతమాటాడెఁ జూ!

మ. సులభంబైన సమాస మాయెనఁట! రక్షో యక్ష గీర్వాణ దోః
కలితానంత నిరుద్ధ మందరనగో త్కర్షాతి హర్షాయితో
జ్జ్వల దుచ్చండ పయః పయోధి భవ దివ్య ద్వీచికా జాత మం
జుల పీయూషమునైనఁ దేఁగల కవీశుఁగా నన్ను గుర్తింపరో!.

శా. గర్వగ్రంథి విరుద్ధ పండిత కవి క్రవ్యాద త త్తద్వచః
ఖర్వాహంకృతి సంప్రదాయ త్రుటనాగణ్య ప్రతాపోజ్జ్వల

చ్ఛర్వాణీ పద పంకజం బిడిన సాక్షా ద్రాఘవాభిఖ్య కం
తర్వాణీమణి సాయ మీయ చోకో ! తత్తన్నాట్యరంగంబులన్ .

శా. క్షీరాంభోధి తరంగ ఘుంఘుమ రవాకీర్ణ స్ఫుర న్మందర
స్ఫారోదగ్రవిహార నిర్మథన సంజాతామృతప్రాయ వా
గ్ధారా ధోరణిఁ జూపువారలకు, తండన్నానలన్ బాడునా
మారా కారుల కేటి దీటు ? వచనోన్మాదం బిదే శాంకరీ !.

శా. వారన్ వీరును, వీరు వా రనినఁ గావ్యం బొక్కొ ? భాగీరథీ
సారోదార తరంగ రంగ దమలాబ్జ ప్రోజ్వల న్మాధురీ
పూరంబుల్ చవిఁ జూచి మై మఱచుచున్ బుంఖాను పుంఖోత్పత
త్సారంగావళి చూపుగాన మన స్వేచ్ఛన్ జూపఁగాఁ జెల్లదే ?

శా. ఉచ్చైయః పదగాములైన కవు లత్యూహా......

ఇట్లే యింకఁ గొన్ని పద్యములు వ్రాసి చేతి కిచ్చిరఁట. (తక్కిన పద్యములు విస్మృతము లైన వనియు, ఎక్కడనైన నున్నవేమో చూచి చెప్పెదు ననియుఁ జెప్పిరి.) ఈ పద్యములు చూచి చిదంబర శాస్త్రిగారు చెప్పకొనవలసిన మాట యీా క్రిందిపద్యములతో రాఘవశాస్త్రిగారిని ప్రశంసించిరి.

చ. నవనవ సాహితీగుణ ఘనత్వ మహత్త్వ పటుత్వ తత్త్వ సం
స్తవ విభవాభిరామ సముదార రస ప్రకటీకృ తార్భటీ
కవన విలాస సంచలిత కోకవిమండలుఁ డైన వీరరా
ఘవుని కవిత్వ నైపుణి జగత్త్రితయిన్ భ్రమియింపఁ జేయదే ?

శా. సద్యః ఫుల్ల రసాలసాల సుమన స్సారస్య సంపాదనా
హ్లాద్య త్కోకిల కాకలీ కలకలామంద్రధ్వనిన్ బోలి గా
స్వాద్యానంద రసాతిరేక సముదంచ త్ప్రౌస్ఫుట ప్రక్రియా
హృద్యంబైన భవద్వచోరచన నే నెంతేని శ్లాఘించెదన్.

—: శాస్త్రిగారి కవితా ప్రచారము :—

వీరరాఘవశాస్త్రిగారు తమ యనుభవములో జరిగిన విషయములను ఘంటా ఘోషముగాఁ జెప్పుచుండుట వారియల వాటు. అసూయాపరు లతిశయోక్తుల క్రింద దోషారోపణ చేయుదు రేమో కాని శాస్త్రిగా రావిధముగాఁ జెప్పుచుండుట చేత ఆయాపద్యము లనేకుల నోళ్లఁ బడి ప్రచారములోనికి వచ్చినవి. ఒక చిత్రము చూడండి! శాస్త్రిగారి కట్టకడపటి దినములలో జరిగినది! వారింకొక నెలకు గతింతు రనఁగా జరిగిన తారణ మాఘమాస సభలో (గద్వాల.) బ్రహ్మశ్రీ గొట్టిముక్కల వేంకటరామశాస్త్రిగారు (గద్వాల) తమ రెండవ కుమారు నైదేండ్లవానిని సంభావన యిప్పించుకొనుటకుఁ బంపించి వాని పాండిత్యమును వెల్లడిచేయించుటకై అమరశ్లోకములు, మఱికొన్ని స్తోత్రపాఠములు చెప్పు మని చెప్పించి, రాఘవశాస్త్రిగారు చెప్పిన 'సులభంబైన సమాస మాయెనఁట' అన్న పద్యములు చదువు మని చెప్పిరి. ఆ కుఱ్ఱ వాఁడు నిర్భయముగా, గంభీరముగా ఆ మొదటి పద్యము చదివెను. అప్పుడు వేంకటరామశాస్త్రిగా రాపద్యములు వ్రాసిన సందర్భము విశదీకరించి చెప్పఁగా సంస్థానము నుద్ధరించు చున్నచు, సంభావన యిచ్చుచున్న శ్రీమాన్ ఆరామతేయ్యాం గారు (హైదరాబాద్) ఆనందభరితు లైరి. అప్పుడు సభలో నున్న పండితులదృష్టి శాస్త్రిగారివైపు ప్రసరించెను. కవి, తన జీవితకాలములోనే రాజసభలో నింతమాత్రము ప్రచార మునకు వచ్చినపు డాకవి కింతకంటె నేమి కావలయును?

వేంకటరామశాస్త్రిగారైనను మెచ్చుకొని మెచ్చుకొనుటకై తమ కుమారునిచే జదివించినవారు గారు. వీరరాఘవశాస్త్రి గారి కవిత్వముపై వారికిఁ గల గాఢవిశ్వాస మట్టిది. శాస్త్రి గారి పద్యము లనేకములు వేంకటరామశాస్త్రిగారికిఁ గంఠ పాఠముగా వచ్చును. వారును, వీరును ఎల్లగొండపాలెములో శ్రీమేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రులవారిదగ్గఱ సతీర్థ్యులుగా నుండుటయే గాక శాస్త్రిగారితో పాటు ఆరంభములో కొన్నాళ్లు కలిసి సంచారముగూడఁ జేసినవారు. ఆ సంచార కాలములో రాఘవశాస్త్రిగారు పోవు పోకడ, ఆ నిర్లక్ష్య స్వభావము, ఆ కనఁబఱచెడి కవితాధాటి, ఆ చర్య లన్నియు స్వయముగాఁ దోడ నుండి చూచినవారు గాన వేంకటరామ శాస్త్రిగా రావిషయములు చెప్పుచుండఁగా వినవలె. మహాద్భుతముగా నుండును. వేంకటరామ శాస్త్రిగారు సుబ్రహ్మణ్యశాస్త్రులవారి దగ్గఱ భారవి చదువుకొనుచున్న ప్పుడే రాఘవశాస్త్రిగారు రఘువంశ మారంభించి భారవి పాఠములోఁ గలిసికొన్నది! ఆ విద్యాభ్యాసకాలములోని రాఘవశాస్త్రిగారి ప్రతిభావిశేషము లమితముగా వీరు శ్లాఘించి చెప్పుదురు. వీరు వా రేల? కావ్యగురువులు శ్రీ మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రులుగారే ప్రశంస చేసి చెప్పు దురు. అట్టి యభిప్రాయము నవ్యాజముగా వారు తమ యాశీ రభినందనములలోనే వెల్లడించి యున్నారు.

అతిశయోక్తులు చెప్పికొని అధికగౌరవము సంపాదింప వలె నని శాస్త్రిగారికిఁ గాని, ఆవిధముగాఁ జేసి లేని గౌరవ

మును జేకూర్తు మని ఆ పులకుఁ గాని లేదు. ఉన్న దున్నట్లుగా నైన గ్రహింపఁ గల్గినచో నంతె చాలు ననియే అందఱి యుద్దేశమును. ఒక్కవిషయము—

—: నాసమక్షమున జరిగినది :—

31-1-1931 వ తేది నంద్యాలలో జరిగిన కృష్ణరాయ వర్ధంతికి కొందఱు పండితులతోపాటు రాఘవశాస్త్రిగారు గూడ వచ్చిరి. ఒక సోదరకవులు 'ఆంధ్రభాషాప్రశంస' అను పేర ౧౭ పద్యముల చిన్నపొత్త మచ్చొత్తించి గ్రంథకర్తృత్వము తమపైఁ బెట్టుకొని సభలోఁ బంచిపెట్టిరి. చదువుకొన్నవా రందఱు సెబా సని మెచ్చుకొనిరి. ఆ పద్యములు చూచుకొన్న తర్వాత రాఘవశాస్త్రిగారు బగ్గున మండిపడి నాపద్యములను వీం డ్రచ్చు వేయించుకొన్నారు చూడు మని నమ్మకున్న నన్ను వారినోటనే చెప్పింతు నని యొప్పించి తర్వాత నింటికి వచ్చి వారిని జాడించి యడిగిరి. వారును 'మీతో ఇన్నాళ్లు పరిచయము గల్గించుకొన్నందులకు మాకింతమాత్రము హక్కు లేదా?' యని యొక్కమాటతో శాస్త్రిగారిని నిరుత్తరులను జేసిరి. పరిశీలించి చూడఁగా రాఘవశాస్త్రిగారు 'ఆంధ్రభాషాప్రశస్తి' అనుపేర నచ్చు వేయించుటకుఁ గా నాయొద్ద నుంచిన వ్రాఁతప్రతిలోని ౩౬ పద్యములలో ౧౬ పద్యము లివిగా నుండెను. ఋజువుపఱచుట కీ రెండు గ్రంథములును నాయొద్ద నుండఁ గలవు. రాఘవశాస్త్రిగారి యుద్దండ కవితా తాండవ మీవిధముగా లోకమున కుపకరించినది.

ఈ ప్రకరణమున సోదరకవులు సంగ్రహించిన వానిలో నొకటి రెండైన నుదాహరింపక విడువరాదు. మాదిరికి:—

ఉ. నన్నయ కన్నవాఁడు, కవినాథుఁడు తిక్కన పెంచినాఁడు, వి
ద్వన్నుతుఁడైన పెద్దన సదా రసపుష్టి నొనర్చినాఁడు, పో
తన్న యఖండభక్తి రస మబ్బఁగఁ జేసినవాఁడు, దేశముల్
గ్రన్ననఁ ద్రిప్పె నీతెలుఁగుకన్నె నిలన్ గవిసార్వభౌముఁడున్.

ఉ. భర్గ జటాటవీ లుఠ దభంగ తరంగ వియద్ధునీ జవా
నర్గళ నిర్గ తామల రసాధిక సాధువచోవిలాస నై
సర్గిక పాండితీగరిమ చాఁన వేములవాడ భీముఁ డీ
మార్గము మంచి దంచుఁగద మానక యాంధ్రకవీంద్రుఁ డొటయున్.

ఉ. అర్జున భీష్మ కర్ణ భయ దాహవ రంగత లోగ్రకార్ముకో
త్సర్జిత వాయువేగ శరజాల సమాన మహోశుపద్య వా
గూర్జిత కీర్తిశాలి యన నొప్పుచుఁ జెల్లున భట్టుమూర్తి తా
నార్జన సేయఁడే నరవరాధిపదత్త జయాంక రాంకవాల్ ?

మ. సరసంబై చతురార్థశబ్దయుతమై శయ్యాన్వితంబై యలం
కరణావిష్కృతమై ధ్వనిప్రథితమై గంభీరవా గ్గుంభనా
కరమై పొల్చు కవిత్వ మల్లు నతఁ డొక్కండే కవీశుండు నాఁ
బరగున్, గ్రామ్యపదంబు లల్లుకొను యంబ్రహ్మల్ కవిబ్రహ్మలే ?

—. ఆత్మగౌరవము :—

ఆత్మగౌరవము నాసింపని వ్యక్తి యుండనే యుండఁడు గదా! ఎరవుసరకులతోనేని హెచ్చుస్థాయికిఁ ద్రొక్కువా రుండఁగా నిజమైన శక్తి సామర్థ్యములు గలవారు తమ గొప్పతనమును జెప్పికొనుటలోఁ దప్పేమి? చెప్పికొనకున్నచోఁ దెలియఁబోవదు గదా! ప్రౌఢకవుల వాగ్వైఖరిలో నిట్టి చాయలు కనఁబడుచునే యుండును. మురారికవి

శ్లో. దేవీం వాచ ముపాసతే హి బహవ స్సారం తు సారస్వతం
జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః.

అని, సరస్వతీదేవి నుపాసించినవా రెందఱేని యుందురు గాక, సారస్వతములోని సారస్యము దెలిసికొన్నవాఁడు గురుకులవాసక్లేశము ననుభవించిన మురారికవి యొక్కఁడే యని చెప్పికొన్నాఁడు.

రాఘవశాస్త్రిగారే ప్రసక్తిలోనేని తన గొప్పతనమును చెప్పుకొనుటలో నేమఱినవారు గారు. ఒక సందర్భములోఁ జెప్పినది.

కం. భారతుల నారసింహుని
కూరిమిశిష్యుండ నృపతికోటికిరీట
స్ఫారుప్రభాకదంబక
రారాజత్పదుఁడ వీరరాఘవసుకవిన్.

ఒకప్పుడు వ్రాయుచున్న కలము చెడిపోయిన దఁట. అప్పుడు చెప్పినది.

ఉ. తూలిక మందగించినఁ గుతూహల భావపరంపరల్ నట
త్కాల గళోత్తమాంగ పరితః ప్లవమాన వియన్నదీజలో
ద్వేల విలాసవీచికలతీరునఁ బైపయిఁ బొంగి పార్ల నే
లీలను నడ్డగింప నగు ? లేఖిని నిచ్చిన నాల్కయోఁగునే ?

ఒకమాఱు వేంకటరత్నశాస్త్రి అను మిత్రునికి వ్రాసిన లేఖలో

సీ. తేనియల్ చిలుకు పూసోనవానలరీతి
నల్లిబిల్లిగఁ బద్య మల్లఁగలఁడు
జడదారులను నైనఁ బెడదారిఁ బట్టించు
శృంగారరసము వర్ణింపఁగలఁడు

కాముకులకునైన జ్ఞానోదయం బిడు
వైరాగ్యబోధ నేర్పులుపఁగలఁడు
కటికవాఁడైనను గరఁగి నీరుగ మాఱఁ
గరుణారసం బెత్తి కురియఁగలఁడు
తే. వీరరాఘవు సామర్థ్యవిధము దెలియఁ
దమ్ముఁ బోలిన రసికావతంసములకె
గాక యీర్ష్యాళువుల కెఱుఁగంగ నగునె?
రమ్యగుణభర్త్రి! వేంకటరత్నశాస్త్రి!

ప్రథమకళత్ర వియోగదశలోఁ జెప్పినది.

సీ. నీభర్త కొనగోటి వైభవంబున కైన
జోడురాని మహేంద్రుఁ జూచినపుడు
నీనాథువాగ్ధాటితో సాన గానట్టి
కవి గురువర్యులఁ గాంచినపుడు
నీపావనత్వంబుఁ జూచి వేల్పులఁ బాఱు
నమరకల్లోలిని నరసినపుడు
నీరోగ్యతను జూచి యేయెడఁ బోలని
తెఱగంటిసుతుల డగ్గఱినయపుడు
తే. ఏమి దివి? యని సర్వోత్తమామితేడ్య
మధ్యలోక మహాకవి మౌక్తికాయ
మాను నీప్రాణనాథుని మాటఁ దలఁచి
పద పద యటంచు నీవె వచ్చెదవు సాధ్వి!

ఇట్టి వింకను మున్ముందు చవిచూతము గాక.

—: తన కవిత్వ మిట్లుండునఁట :—

దైవముదిన్నె (కర్నూల్ జిల్లా) రామారెడ్డిగారి సంస్థానములో రాఘవశాస్త్రిగారికొక గొప్ప గౌరవస్థానము గలదు. అడిగినదాని కనుకూలమైన సమాధానము పద్యములలోనే

చెప్పుదురు గనుక రాఘవశాస్త్రిగారితో వినోదకాలక్షేపములు జరుగుచుండును. అక్షయ సంవత్సర వసంత నవరాత్రోత్సవములకు రెడ్డిగారింటికి మదరాసునుండి బంధువులు వచ్చియుండి రాఘవశాస్త్రిగారితో పెద్దన, తనకవిత్వమును గుఱించి మాలిక చెప్పికొనియుండెఁ గదా! మీకవిత్వమును గుఱించి మీ రేమైన మాలిక చెప్పఁగలరా? యని వినోదముగా నడిగిరఁట. అపుడు అత్యాశువుతో వ్రాసికొనుఁ డని

కం. వదలిన యభ్యాసంబే, గద వదలితి !; నైజశక్తి కన్నొ౛ఱఁగెన ? స
మ్మదపడి రాడ్బంధువు లడు, గుదురఁట యత్యాశు, వంబకున్ దయలేదే?

ఉ. మాటకు కోటిపద్యము లమానుషశక్తి రచించునట్టి వా
గ్ధాటి చెలంగి యాశుకవితా జవతాండవ మాసఁజేయు మీ
బోఁటి రసజ్ఞు లుండి, నృపపుంగవుఁ డింగితవేత్త గా, నిరా
ఘాటముగా వచింపక జగన్నుతుఁడౌ కవి యూరకుండునే ?

చ. సరిదసమాన వేగమునఁ జక్కని చిక్కని ధారతోడ నీ
సరసులు వహ్వ రే ! యన, రసప్రసర ప్రచుర ప్రవాహముల్
దరులకుఁ బొంగి పార్ల, మిగులన్ గురియింపవె పద్యవృష్టి నో
పరమదయాపయోనిధి ! సభాజనవశంకరీ ! మహేశ్వరీ !.

ఉత్పలమాలిక:—(రగ గీట్లు.)

శ్రీరమణీయులార ! సరసీరుహ
సారవచస్కులార ! విలస త్క
హోరి విహారులార ! పరమాదర
నూరివరేణ్యులార ! పరిశుద్ధ వచో రచనా చమత్కృతియా
సార రసానుభావ గుణ పాక సమంచిత వృత్తి రీతి వి
స్తార మదీయ దివ్య కవితా వనితాభిరతి ప్రసక్తి సం

స్కారము లిందుఁ జూపుటకుఁగా నిదె కోరితి; రేను బూనితిన్ ;
ధోరణి విన్నచోఁ—గనక తోయజ కాండ వినిస్సర ద్రసా
సారమయ ప్రవాహరుచి సారెకు సారెకుఁ దోఁచు—; నల్లికల్
గూరుచుచో—వసంత నవ కోమల పల్లవ వేల్ల దుల్లతా
గార నిరంతరాయ పరికల్పన నుల్లస మాడు—; వ్యంగ్యపు
స్ఫేరుపుఁ జూప నెంచ—రమణీయ మహోజ్జ్వల యౌవన ప్రభా
చారు విలాస సంభరణ సారసపాణి విలాస వాక్చమ
త్కార విశేష వైఖరులు కన్నులఁ గట్టినయట్లు తోఁచు—; నో
రూరఁగఁ జేయు మత్కవిత నూఁకొను భాగ్యము గల్గినంత—శృం
గార రసానుభావ పరికల్పిత యౌవన ఘూర్ణమాన పం
కేరుహలోచనా ప్రథమకేళి వినోద బహుప్రకార వి
స్తార దృఢోపగూహన నితాంత రతిశ్రమ పారవశ్యమున్
గూరుపఁగావలెన్—; ప్రణయకోప వికార పరీత భామినీ
ధీర విహార మానసగతి స్ఫుట వర్తన లెల్లఁ గొల్లగా
నేరుపఁగావలెన్—, రుచిర నిర్మల శారద చంద్ర చంద్రికా
పూర విపుష్య దంబుధి విఘూత తరంగ ఘుమంఘుమార్భటీ
ద్వ్యారవి మండలావృత ముహుర్ముహు రాగత మామకీన వా
గ్ధారను జూడఁగావలదె? తామర సాయత లోచనా నవ
స్మేర మరీచికా నిచయ శీర్య దనన్య రసోపమాన గం
భీర కవిత్వవా గ్విమల వీచికలన్ దనివోందఁ జెల్లదే?—;
వీరరసం బొకింత కనుపింపఁ దలంచినఁ బెక్కులేల? యే
భీరువునన్ శశాంకధర భీష్మ కిరీటి కుమార ముఖ్యు దో
స్సార నిరుద్ధ దుర్భయద సంగర రంగములోనఁ జొచ్చి త
ద్ఘోర శరప్రయోగములఁ గొంకక, టాంకృతు లుప్పతిల్ల, రో

పారణితాత్ముఁడై వలయితాద్భుత చాప వికర్ష దాశుగ
స్ఫార విహార నిర్దళిత భండన పండిత శీర్షకాండుఁడై
పేరును గాంచఁగా వలయు—; ప్రేమము నే వచియింప గోవధా
చారులు గాఁ జెలంగెడు కసాయిగణంబులె మొద్దుకత్తులన్
బారఁగ వైచి నిష్కృతికిఁ బాతరలాడవలెన్—; మఱింత శృం
గారముఁ జూపుచో—విషమ గహ్వర వాసముఁ జేసి నిర్జలా

హారులు నైన యోగులె యొయారు లయారె! పయింబయిన్ రసం
బూర వచింతు రంచు విరహోదధిలోపలఁ జేరి యౌవన
ప్రారభమాణ యోషి దురువర్తుల మాంసల సుస్తనాగ్ర క
స్తూరి పరీమళంబులకుఁ జొక్కుచు దాసులు గావలెన్—; మఱిన్

సార విరాగమున్ నుడువఁ—జక్కని చక్కెరబొమ్మ నక్కునన్
జేరిచి, మోవి నొక్కుచును, జిక్కని తేనియ లాని, మారుబల్
పోరుల మేర మీఱి, పవలున్ రెయి గుర్తెఱుఁగంగ లేని శృం
గార రసానుభావుఁడును గౌఁగిలి వీడుచుఁ గావిబట్టలున్,

నీరముతోఁ గమండలువు, నీటగు దండము నూని కొనలన్
దూఱి తపంబు సేయవలెఁ—; దోరపుహాస్యరసంబు దెల్పుచో
బోరన పొట్ట చెక్కలయి పోవలె—; దోషమొ దూష్యమో యిటుల్
తీరుగ నున్న దున్నటులఁ దెల్పితి; మాటలు వేయు నేటికిన్?

అని గడగడ చెప్పివేసిరఁట. అప్పుడు 'వ్రాసికొందుము. చెప్పుఁ' డని కూర్చున్నవారు తీవ్రముగా వ్రాయఁజాలక తడఁబడుచుండఁగా

మ. జలదారంభ విజృంభమాణ ఘన వర్ష ప్రోద్భవాసాంద్ర ధా
రల ధిక్కార మొనర్చు మత్కవన ధారా ధోరణీ ధాటికిన్

నిలువన్ జాలి, లిఖింపఁ బూని, కలము న్జేపట్టి, నా చెప్పిన
ట్టుల వ్రాయంగల ధీరుఁడైన మొనగాఁడున్ గల్గు నే యెవ్వఁడేన్ ?

ఉ. ఆఁగునె వీరరాఘవుని యాశువు ? పార్థశరప్రయోగ మే
యాఁగిన నాఁగుఁగాక, ప్రమథాధిపశీర్షపతన్నదీజలం
బాఁగిన నాఁగుఁగాక, సముద్రగతపోధన శాపవాక్కులే
యాఁగిన నాఁగుఁగాక, వశమా ? బిస నిల్పు బిసప్రసూతి కేన్ ?

ఉ. కమ్ములమీఁద 'రైలు' వడిగాఁ జనునట్లు కవిత్వమందు లో
ప మ్మన నెందు నేనియు లవ మ్మగుపట్టఁగనీక, యింత శీ
ఘ్రమ్ముగ వర్ణ్యమున్ నుడువ రాఘవశాస్త్రికె గాక యింక సా
ధ్య మ్మగు నే మఱొక్కరికిఁ ? దజ్జ్ఞుల కియ్యది క్రొత్త వింతయే ?

ఉ. ట క్కొకయింత లేకయ హుటాహుటి గంటకు నూఱుపద్యముల్
జక్కఁగఁ జెప్పఁగల్గుదును, జాతురి మీఱ శతావధాన స
మ్యక్కరణం బొనర్చెద, నిఁ కష్టవధాన మటన్న నల్లె; నా
కిక్కడ దాఁప నేల ? వచియించితి నున్నది యున్నరీతిగన్.

అని చెప్పిరఁట. అడిగినవా రెంతయానందపడియుందురో అది యనుభవముమీఁది మాటగదా !

—: కలమా ! సాగ విదేమి ? :—

రైలుబండినడకతో కవిత సాగించు శాస్త్రిగారికి గద్వాల సభలో నొకప్పు డేదో వ్రాయఁబోఁగా (అంతకు ముం దేవో గృహచ్ఛిద్రములలోఁ బడి కలము ముట్టకుండి రఁట.) కలము సాగకపోయినదఁట. అప్పుడు కలమా ! సాగ విదేమి ? అని సంబోధించి

మ. కలమా ! సాగ విదేమి ? కుంభభవ గంగానందన ద్రౌణి క
ర్ణ లసత్కార్ముక ఖేలనాభిరత పార్థప్రౌఢ గాండీవ ని
ర్గళ దుద్దండ కఠోర కాండచయ ధారాపాత సంస్ఫీత వి
ర్మల పద్యార్భటిఁ జూపు మ ద్దెవరె ? యీ రాజన్యసంఘంబులన్.

అని యట్టె ఒక్క విసరువిసరిరి. నిజముగా ఆనాఁడు కలమే సాగి యున్నచో ఈపద్యమున కవకాశ ముండియుండదు గదా ! కనుక ఏదైనను ఒక మంచికొఱకే యని భావింతము గాక. భారతయుద్ధములో పార్థప్రౌఢ గాండీవ నిర్గళ దుద్దండ కఠోర కాండచయ ధారాపాత మె ట్లుండెనో గాని శాస్త్రిగారి నిరర్గళ కవితాధారాపాతము మాత్రము పాఠకలోకమునకు గుర్తింపఁ జాలియున్నది.

—: గద్వాల సంస్థాన ప్రథమ ప్రవేశము :—

ప్రమాదీచ సంవత్సరమునుండి (౨౨ ఏండ్లవయసు.) సంసారభారము నెత్తిని బడుటచే సంపాద్య మవసరమై అవధానాదులు చేయ మొదలు పెట్టి ప్రమాదీచ మాఘమాసారంభమువఱకు ఆదవాని, దైవముదిన్నె, పార్లపల్లె, మట్ట్రేడు, మంచాల (కర్నూలుజిల్లా) మొదలైనచోట్ల అవధానాదులు చేసి శాస్త్రిగారు మంత్రాలయమునకు మధ్వస్వాములవారి వేదాంతసభలకుఁ బోయిరఁట. అక్కడ అనర్గళముగా ఆశుకవితాప్రదర్శనము జరుగుటయు, ఆసభలకు వచ్చియున్న గద్వాల సంస్థాన విద్వాంసులగు శ్రీమాన్ పురాణం నృసింహాచార్యులుగారును, శ్రీమాన్ పుల్లగుమ్మి వేంకటాచార్యులుగారును శాస్త్రిగారి యాశుకవితాప్రదర్శనమునకు

మిక్కిలి సంతోషించి విద్వత్ప్రభువులగు గద్వాల మహారాజా వారి సంస్థానమునకు రావలసిన దని యాహ్వానించిరఁట. ఆసంవత్సరము మాఘమాస సభలకే శాస్త్రిగారు గద్వాలకు వెళ్లిరి. ఇదియే వారి కట ప్రథమప్రవేశము. మహారాజ శ్రీ సీతారామభూపాలుని సందర్శించి ఆశువుగా

చ. కవనము సాహితీపటిమ గల్గియుఁ, వేదములందుఁ గొద్దిగాఁ
దవిలి పరిశ్రమంబు, నవధాన మొనర్చెడి రీతి నేర్చి, స
త్కవిజన కల్పభూజు లని ఖ్యాతిని గాంచిన మిమ్ముఁ జూడ ను
త్సవముగ వచ్చినాఁడను యథార్థము సుమ్ము నృపాలశేఖరా!

అని చెప్పిరఁట. ఆవల శ్రీశాస్త్రిగారి యాశుకవితాప్రదర్శన ములతో శ్రీరాజాగా రెట్లు వినోదించినదియు, ఎంతగా నభిమానించినదియు, ఏవిధముగా సత్కరించినదియు మున్ముందు నారయుదముగాక.

—: గద్వాల విద్వత్పరీక్షలో విశిష్టత :—

ప్రమాదీచ మాఘమాససభలకు వెళ్లివచ్చిన తర్వాత రాఘవశాస్త్రిగారు మఱుసంవత్సర మానంద మాఘపూర్ణిమకు గద్వాలకు వెళ్లిరి. ఆసంవత్సరమే బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, బ్రహ్మశ్రీ నెమలూరి వేంకట శాస్త్రిగారును వచ్చియుండిరి. క్రొత్తగా వచ్చినవారిలో ఉద్దండ కవీశ్వరు లీముఫ్వురే. కనుక విద్వత్పరీక్షలోఁ బాల్గొన్నవా రీముఫ్వురే యైరి. ఆనాఁడు జరిగిన పరీక్షలో నిచ్చిన ప్రశ్నలలో జ్ఞాపక ముంచుకొని రాఘవశాస్త్రిగారు వ్రాసిపెట్టుకొనియున్నవాట్టినకు కొన్ని.

౧. ఇంకన్ గస్తురి బొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగమ్మునన్.
౨. కూకొగ్రంబున భాసిలెన్ శుభజలస్తోమంబు కాసారమున్.
౩. దారము లేనిహారము సుదారత నీ కెవ రిచ్చి రమ్మరో!

అను సమస్యలు మూఁడు. ఈసమస్యలకు పూర్వకవులు పూరించిన భావములు గాకుండ పూరణ చేయవలయు నని రాజాగారు చేసిన నియమము.

'ఇంకఁ గస్తురిబొట్టు పెట్టకు' మను సమస్య కవ్వారివారు 'కాంతా! నీశరీర మిప్పటికే వియోగానల జ్వాలాతప్తమై యుండఁగా నీ విప్పుడు కస్తురి బొట్టు పెట్టినచో మఱింత యుష్ణాధిక్య మగును గాన ఇంకఁ గస్తురిబొట్టు పెట్టకు' మని పూరించిరఁట. (పద్యము జ్ఞాపకము లేదన్నారు.) నెమలూరి వారు ఈనవనాగరక కాలములో స్త్రీ లందఱు పాశ్చాత్య పద్ధతి నవలంబించి బొట్టుపెట్టుకొనకుండఁగా నీ వేల పెట్టు కొందువు? ఇంకఁ గస్తురిబొట్టు పెట్టకు' మని పూరించిరఁట. (పద్యము జ్ఞాపకము రాలే దన్నారు.)

రాఘవశాస్త్రిగారు చేసిన పూరణము:—

శా. అంకం బించుక దాల్చు నంచుఁ గడుఁ గార్శ్యం బందు నంచుంగదా
పంకేజారిని జూడ రోసితివి! దివ్యత్వన్ముఖాంభోజమం
దంకం బేమియు లేదు, కార్శ్య మనరా, దద్దానిపై నేల? నీ
వింకన్ గస్తురి బొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్.

అని. ఇదే సమస్యకు పూర్వకవిపూరణ మిట్లు.

శా. పంకేజానన! నేఁటిరేయి వినుమీ! పంతింబుతో రాహువున్
శంకాతంకము లేక షోడశకలాసంపూర్ణు నేణాంకునిన్

బొంకం బార్చెద నంచుఁ బల్కినఁ దగన్ బొంచుండి నే వింటి, నీ
వింకన్ గస్తురిబొట్టు పెట్టుము తన్వీ ! ఫాలభాగంబునన్.

అని. శుంకాగ్రంబున భాసిలెన్...అను రెండవసమస్యకుఁ దక్కినవారి పూరణము లేమో గాని రాఘవశాస్త్రిగారు చేసిన పూరణ మిట్లు. (విషయ నిగరణము)

శా. శ్రీకల్యాణలతావిశేషమున రాజిల్లెన్ సుమశ్రేణి, వా
ణీ కీర్ణాకృతిలో సుధారసము రాణించెన్, సుధాదీధితిన్
లోకాలోక కళంక మేర్పడియెఁ, బూలున్ బూవులన్ దాల్చె, నీ
శుంకాగ్రంబున భాసిలెన్ శుభజల స్తోమంబు కాసారమున్.

మూఁడవసమస్య దారము లేనిహార...మను దానికి నెమలూరివారు 'పచ్చ లాదారము లేనిహార' మనియు, అవ్వారివారు 'మందారము లేనిహార' మనియు, బూర్తి చేసిరఁట. (ఆపద్యములు శాస్త్రిగారు వ్రాసిపెట్టక భావ మును మాత్రమే గుర్తుపెట్టుకొన్నా మని చెప్పిరి.) వీరరాఘవ శాస్త్రిగారు

ఉ. సారసగాత్రి యొక్క తె నిశాసమయంబున మంచిముత్తెముల్
గూరిచి తా ధరించి, తనుఁ గూడెడి నాథుఁ గవుంగిలింపఁ జే
కూరెను గుర్తు; లవ్వి గని కోమలి కిట్లని రెల్ల నెచ్చెలుల్
దారము లేనిహారము సుదారత నీ కెవ రిచ్చి రమ్మరో !

అని పూరించిరి. దీనికి పూర్వకవి పూరించిన పూరణ మిట్లు.

ఉ. భూరివివేకులౌ విటులఁ బూఁబొదరిండ్లను గూడి వారిచేఁ
గోరిన భూషణంబు గొని కోమలి ధారిణి వైతి; పందులో
హారము లుల్లసిల్లఁగ మహీప్రవరుల్ వినుతింపఁ బచ్చ లా
దారము లేని హారము సుదారత నీ కెవ రిచ్చెఁ జెప్పవే !

అని. ఈసమస్యాపూరణలలో 'సమానానా ముత్తమశ్లోకో అస్తు' అన్న కీర్తి రాఘవశాస్త్రిగారికే దక్కిన దన్నసంగతి యుచితజ్ఞులగు పాఠకులే గమనించుకొనఁ గల్గుదురు.

విద్వత్పరీక్షలలోను, కల్పనాచమత్కృతిలోను, కవితా ధారలోను, ఆశుకవితాప్రదర్శనములోను రాఘవశాస్త్రిగారి దగ్గఱ నున్న మెలఁకువను గమనించి మహారాజాగారు సభా సన్మానానంతరముగూడఁ గొన్నాళ్లు వారిని నిల్పుకొని ఆశు కవితావినోదముతో నానందించుచు నుండిరి.

—. పాడుబావిపై పద్యము :—

ఈ యానంద సం॥ర మాఘమాసములోనే ఒకశుక్ర వారమునాఁడు మహారాజా సీతారామ భూపాల్ బహద్దర్ వారు కృష్ణకు స్నానమునకుఁ బోవుచుఁ దమవెంటఁ బిలుచు కొని పోవుచున్న కవీశ్వరులకు మార్గమధ్యములో నీళ్లు లేక పాడువడియున్న యొక బావిని జూపి (ఇటు కృష్ణ, అటు తుంగభద్ర యున్నను దీనిలో నీళ్లు లేకపోయినవే యన్న భావము మనసులో నూహించుకొని) యీపాడు బావిని వర్ణింపుఁ డని చెప్పిరి. అప్పుడు వారివెంట రాఘవశాస్త్రి గారును, నెమలూరి వేంకటశాస్త్రిగారును, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును నుండిరి. రాజాగారు చెప్పఁగానే రాఘవశాస్త్రిగారు వారిభావమునకు సూటిగా

చ. కల దటఁ గృష్ణ నెత్తిన జగజ్జన కల్మష నాశనక్రియా
మల గుణపుష్ప దర్శన విమర్దిత లౌకిక తృష్ణ; క్రింద నే

పాలిచెను దుంగభద్ర నిజభూరితరంగ సముద్ర—ఐన—నీ
తలఁ గల ద్రావ లదేమొగదె? త్రాగను నీరము లేవు కూపమా!

అని చెప్పిరి. గుణజ్ఞులగు రాజాగారు మిక్కిలి సంతోషించిరి.

—: కృష్ణానదీ సందర్శనము :—

ఆవల కృష్ణను సమీపించి యానందపడుచు రాజాగారు వినుచుండఁగా ఆశువుగా రాఘవశాస్త్రిగారీపద్యము చెప్పిరఁట. ఆనాఁడు శుక్రవారము గనుక

ఉ. శారధునీతరంగ రభసప్రతిమాన తరంగ ఘుమంఘుమ
స్ఫార రసోల్లస త్కమల బంభర సంభృత ఝాంకృతి స్వనో
దార సుఖప్రదాయి నిజదర్శన నాశిత తృష్ణ కృష్ణ చే
కూరెను, నీపురాకృతము కొంచెమటే? కన శుక్రవారమా!

—: దుస్సేల్వాల బహూకరణము :—

ఈయానంద సంవత్సర మాఘమాసములోనే గద్వాల మహారాజాగారు తమ కృష్ణాగ్రహారములో (గద్వాలకు 3 మైళ్లదూరము కృష్ణానదియొడ్డున) సభ చేయించిరఁట. ఆసభకు రాఘవశాస్త్రిగారు సేల్వ లేకుండ నట్టి పైపంచ వేసికొనియే వెళ్లిరఁట. అప్పుడు మహారాజాగారు సేలువ లేకుండ మాసభకు వచ్చెద రేల? యని యడిగిరఁట. మహా రాజులు! వినోదమునకు కఱ వేమి? వెంటనే రాఘవ శాస్త్రిగారు

కం. పంకజ నిర్యద్రసకణ
సంకాశాస్మత్కవిత్వ చంద్రాస్య భవ
ద్రాంకవము గోరె నృపమక
శంకా! హతదీనమానవావళి శంకా!

అని చెప్పిరఁట. అనఁగా మీ రిచ్చిన సేల్వ వేసికొనవలె నని మాకవితాకన్య కోరుచున్న దని చెప్పిరఁట. వెంటనే రాజా గారు గద్వాలకు కారు పంపి జోడుసేల్వాలు తెప్పించి సభలో కప్పిరఁట. అప్పుడు చెప్పిన పద్యము:—

చ. అడిగినయంతమాత్రమున నట్టిటు చూడక సత్కరింపఁగాఁ
దొడఁగు నృపాలచంద్రుఁడు చతుర్జలరాశిపరీతమైన యీ
పుడమిని లేఁడు; రామనృపపుత్రుఁ డితం డొకఁడే లభించె; నీ
యిడుములు గడ్డ కెక్కె, వరియించి సుఖించు కవిత్వకన్యకా!

అని చెప్పిరఁట. కాళిదాసువంటి కవి ఉన్నాఁడా? అని యొక ప్రభు వడుగఁగా భోజరాజువంటి ప్రభు వున్నచో కాళిదాసు వంటికవి వెంటనే ఉండు నన్నాఁడఁట ఆకవి!

—: గ్రాంథిక కవితావశ్యకతను గుఱించిన మాలిక. :—

ఆనందమాఘమాస సభలలో అప్పుడు వార్తాపత్రికలలో నిరాఘాటముగా వ్యావహారికభాషలో వ్రాయుచు గ్రాంథికభాషను దూషించుచున్న వ్యాసరచయితలను గురించి చర్చకు రాఁగా రాఘవశాస్త్రిగా రిట్లు చెప్పిరి.

మ. తన కంచంబున గాడిదల్ పొరలి కూఁతల్ గూయ రోఁతన్నమా
టసుకో, కన్యనిసెత్తిపే ల్వెదకి, దూరాలోచనప్రక్రియా
జనితామర్ష విమర్శనల్ సలుపు దోషజ్ఞుల్ మహాజ్ఞానవా
హినిఁ దీర్ఘంకరు లైరి; నీకుఁ గొద వేమీ? పత్రికారత్నమా!

మ. భయ దోగ్రానల గాఢకీలికలు శుభ్రజ్యోత్స్నలున్ వైషయా
శ్రయ భేదంబున సత్కవిద్రుహిణు వాచానూచికల్ వానిపై
పయి భావవ్యతిరేకకోకిలలు పర్వన్ రెండునున్ బ్రాణసం
చయ బాధాకృతి కారణంబు లని భాషా! నీవు గుర్తింపుమా!

అని చెప్పినమీఁదట ఆచర్చలో గ్రాంథిక భాషయే ఆవశ్యక ముగా నుండఁదగిన దని తీర్మానింపఁబడెనఁట. అప్పుడు శ్రీ సీతా రామభూపాలుఁడుగారు వట్టిమాటలతోఁ గాదు, ఎందులకు గ్రాంథికభాష ఆవశ్యకమో ఛందోబద్ధముగాఁ జెప్పవలసిన దని యనఁగానే రాఘవశాస్త్రిగారు చెప్పిన మాలిక.

మత్తేభమాలిక. ౬౦ గీట్లు.

మును భోజాదిక విక్రమార్క ముఖ భూపుల్, కృష్ణరాయాది స
జ్జనపాలాగ్రణు లెందఱో సుకవితాసామ్రాజ్యసంపూజ్యతా
భినివేశంబును దాల్చి సత్కవిత నే ప్రేమించి తత్తత్కలా
ఖనులన్ దేలిన కావ్యరత్నముల నాకర్షించి విద్యావివా
దన శాణంబుల నిగ్గు దేల్చి మకుటాంతర్నిత్యసంస్థాపనం
బును గావించి యశశ్శరీరు లయి సొంపున్ గాంచి రౌఁ; దక్కభూ
ప నికాయంబులు, రాజరాజులును, విద్వాంసుల్ గుణోత్తంసులై
ధనికాగ్రేసరులై వృథా చెడిరి కాదా? వారి నేవారలే
నను కోఁ జూచిన లాభ మున్నదియె? యూరా? పేర? త్రేతాయుగం
బున లోకత్రయ సాధు సంహనన సంభూతాసురవ్రాత ఖం
డన పాండిత్య శరప్రకాండ భుజదండ స్థేముఁ డారాముఁ డా
యినవంశంబునఁ బుట్టుఁగాక, మిథిలాధీశాత్మజన్ జెట్టవ
ట్టును గా, కింద్రజు నొక్కకోలఁ బడఁగొట్టుంగాక, వారాశిఁ గ
ట్టును గా, కద్భుత బాహువిక్రమ కలాటోపాతి దుర్ధర్షమూ
ర్తిని రాత్రించరు రావణున్ దునిమి పృథ్వీభారమున్ మట్టువె
ట్టును గా, కాతఁడు దేవదేవుఁడో! నరుండో! యౌనుగా, కెవ్వరై
న నగుంగా, కలనాకుజన్ముఁడు పురాణం బంచు నేవెత్తియో
గొని రామాయణమున్ రచించుట నె గా! క్షోణిన్ బుధారాధ్యుఁడై

ఘనుఁడై యారఘురాముఁ డిప్పటికినిన్ గల్యాణసంధాయియై
జనితానందరసప్రసేకుఁ డయి సాక్షాన్నామపారాయణం
బున ఘోరాఘవిపాటన ప్రథితుఁడై మోక్షప్రదుండై మహా
జన చేతోంబుజ భృంగమై మఱియు విశ్వస్తుత్యకీర్తిచ్ఛటా
జనకుండై విలసిల్లఁగాఁ గలిగెఁ! దాఁ; జర్చింపఁగా ద్వాపరం
బున నారాయణమూర్తియున్, నరుఁడునీభూభారమున్ మాన్పటల్
పనిగా యాదవ పాండవాన్వయములన్ జన్మించియే యున్నవా
రని యోజింపుఁడు, చండకార్ముకకలా వ్యాపారపారీణులై
ఘన నక్తంచర యోధులన్ గడపి సాక్షాచ్ఛ్రీ కురుక్షేత్ర ధా
త్రిని గంగాసుత కుంభజాత కృప రాధేయాది యోధావళీ
ధను రామ్నాయము చీరికిన్ గొనక తద్గాండీవముక్తాశుగా
భినిపాతమ్ములఁ జిమ్మి, కౌరవతతిన్ భేదించి , ధర్మాత్మజా
తుని రారాజు నొనర్చి రం చనుఁడు, సాధుండైన వ్యాసర్షి యే
మని యోజించెనో! భారతం బనుచు వ్రాయన్, వారిచారిత్రముల్
జనసంఘం బెఱుఁగంగఁ గల్గె; నటుపైనన్ నేఁటి కాగ్రంథమే
మనకున్ బంచమవేదమై నిఖిల ధర్మజ్ఞాన సంప్రాప్తి సా
ధనమై దేశపరిస్థితుల్ దెలుప నద్దంబై పురాణేతిహా
స నయోక్తుల్ వివరింప దంట యయి శశ్వన్నామపారాయణ
ప్రణుతి ధ్యాన ముఖాఖిల క్రియలచేఁ బాపాటవీహవ్యవా
డ్ఘనతేజం బయి ప్రాలఁగాఁ గలిగె; లేకన్ శక్యమే? ఆవిధం
బున గైర్వాణినో దేశభాషనో రహిన్ బొత్తంబులన్ వ్రాయఁగా
ననువౌఁ గాని, యె చెప్ప వాడఁబడునో యా భాషనే వ్రాయ, నె
ప్పు నదే వాడుక యున్నె? కాలము సనన్ బోకున్నె యవ్వాడుకల్?
మనభాషాంగన నేటఁ ద్రోసి, యిఁక గ్రామ్యం బంచు నేరీతి గీ

కిన నీగీకుల కర్గ మున్నదియె? వక్తృశ్రోతృ మర్యాదలన్
గనలే, కర్గవిపర్యయమ్ములిడి, చంకల్ దట్టువా రెట్టిభా
వనలన్ దెచ్చెద? రెన్ని కావ్యము లనల్పప్రక్రియన్ జూచి యీ
పనిఁ బూనన్ వలె?—నేఁటి మా కవుల కీప్రారబ్ధమే లే; దిఁ కే
ఘన గీర్వాణము రాదు, వ్యాకరణమా? కన్నెత్తియే చూడ, రిం
కనఘంబై తగు లక్షణస్ఫురణమా? యజ్ఞాతపూర్వంబ; యిం
క నిఘంటుల్ సులభంబు; లవ్వి గొని సాకల్యంబుగాఁ గావ్యకృ
ద్ఘన కీర్త్యంగన నీల వేసి, పిదపన్ గన్గిటి, యాలింగన
మ్మునఁ జేకూరిన మోద మంది, పరిష ద్భూపాల సమ్మాన సం
జనితానందము విందు గాంచి, పరులన్ సైరింప లే కెన్నియో
వినరానట్టి యసహ్యవాక్యముల నవ్విళ్లూరఁగాఁ బల్కుచున్,
దన సర్వజ్ఞత మానముద్రలుగ, లేదా! మూతి విర్పుల్ గ, నే
మనియో పల్కులు వైకృతిన్ గొలుపుచున్ హర్షించు విద్వాంసుల
ల్లన వర్తిల్లుచుఁ గాలపద్ధతుల నేలా? దూఱ?—భాషాసతిన్
వినయోపేతులరై యజించి కవితావిజ్ఞానమున్ గాంచి, క్రొ
న్ననవిల్కాని నవాంబుజాస్త్రి) మన నానావర్ణనాభ్యాస శ
క్తిని సంధించి జగత్త్రయీవిజయ సాధీయాచ్ఛకీర్తిన్ మహా
జను లౌరా! యన సేకరింపనలె నాచంద్రార్క మూర్వీస్థలిన్.

అని ౬౦ గీట్ల మాలిక వ్రాసిరి. (ఈపద్యమాలిక అభినవ సరస్వతి 1935 సెప్టెంబరు సంచికలో ముద్రితమై యున్నది.)

వాచోవిధేయములై అప్రయత్నపతితములైన శబ్ద జాలములయు, యతిప్రాసలయుఁ గూర్పు ఎట్టివారికేని ఆశ్చర్యము గలిగింపదా? పరీక్షపట్టి యిదే విషయమును గుఱించి

యెంతవఱకు వ్రాయఁగలరో వ్రాయు మని యడుగువా రుండినచో శాస్త్రిగారు, చెప్పినది చెప్పకుండ వందలకొలఁది పాదములు పెంచి యిదే మాలిక వ్రాసియుండఁ గల్గుదురు. భవభూతి మహాకవి చెప్పినట్లు

శ్లో. యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యే వాన్వవర్తత,
ఉత్తరం రామచరితం తత్ప్రణీతం ప్రయుజ్యతే.

అని రాఘవశాస్త్రిగారియందుఁ గల వాగ్దేవీ కరుణాకటాక్ష వీక్షణ మట్టిది. ఆ భగవతీ విలాస మింక నెన్ని విధములఁ బ్రకాశించినదో మున్ముందు చూతము గాక.

—: శాస్త్రిగారికి రాజాగారిసత్కారము :—

ఆనంద సంవత్సరములోనే సన్మానసభ జరుగుచున్నది. రాఘవశాస్త్రిగారు తమవివాహమునకు రాజాగారి వలన గొప్ప సహాయము పొందవలె నని తలపెట్టుకొని యున్నారు. సమయము వచ్చినది. సమాచారము చెప్పివేసినారు. కవిసామర్థ్యము నెఱిఁగిన విద్వత్ప్రభువునకు— అందులో నెఱదాతకు—తెలియరాని దేముండును? రెండు మాటపదా ర్లిచ్చిరఁట. అంతట శాస్త్రిగారు

చ. కవి కఁట! పెండ్లికార్య మఁట! కారుణికాగ్రణి గద్వాల భూ
ధవుఁ డఁట దాత!, మేల్ రసికతాఖనులై తగు వేంకటార్యము
ఖ్య విబుధు లెల్ల శ్రోత లఁట! యన్యుల వేఁడుట సంభవించెఁగా
శివశివ! యంచు లోకులు వచింపఁగఁ జూడరటయ్య భూపతీ!

అని చెప్పిరఁట. అంతట రాజాగా రానందపడుచు 'ఇంతేగదా! పెండ్లి యెప్పుడు? పెండ్లి చేసికొని వచ్చి అయిన మొత్త

మేదో తెల్పుఁడు. ఆభారము మా దనుకొనుఁ' డని యనఁగానే ఆ సంతోషముతో శాస్త్రిగా రొకపద్యము చెప్ప నారంభించిరఁట. అప్పటికి తెల్లవాఱుజాము కావచ్చుటయు-, నిద్ర రెప్పలమీఁదఁ దూఁగాడుటయు— నై యేమి చెప్పు చున్నదియుఁ దెలియకుండ నిట్లు ప్రారంభించిరఁట.

ఉ. నూటికిఁ బద్యజాలము వినోదముగా రచియింపఁగా నిరా
ఘాటులటం చెఱింగి ధనగౌరవ మొందియు నీవిలో శిలా
పాటవముణ్ గ్రహించు నరపాలుర చెంగట లాభ మేమి ? మా
బోఁటి కవీంద్రకోటికి

అని చెప్పునరికి వినుచున్న విజ్ఞు లందఱును మహారాజాగారంత యౌదార్యము కనఁబఱచినను నిద్రమత్తులో నేమో విపరీత ధోరణిలోనికి దించుచున్నాఁడే యని వెలవెలఁ బోసాగిరఁట. నిజముగా నిద్రమత్తులో ఏమి చెప్పినదియుఁ దమకే బోధపడ లేదఁట. సరిచూచుకొనుసరికి దారి దప్పినట్లుగానే తోఁచఁగా ఆవల నందఱ కాశ్చర్యము గలుగునట్లుగా

మా, బోఁటి కవీంద్రకోటి కిది పో నినుబోఁటిఁ డొకండు చాలఁడే?

అని పూర్తి చేసిరఁట. చిట్టచివర కభిప్రాయము తల క్రిందుగ మాఱిపోయినపు డెంత యాశ్చర్యము గాదో చూడుఁడు!

నిద్రపై శార్దూలమును విడుచుట :—

నాఁటిరాత్రి యంతయు నిద్ర లేక మేల్కొని యుండుటచే తెల్లవాఱ వచ్చుసరికి రాఘవశాస్త్రిగా రూరక నిద్రతోఁ దూఁగుచుండిరఁట. అప్పుడు మహారాజాగారు

చూచి వినోదముగా 'నిద్రమీఁది కొక శార్దూలమును విడువఁ గూడదా? అట్లు తూఁగుచున్నారే!' అని యనిరఁట. 'మహా రాజా! వేఁటాడకండి, ఇదే శార్దూలమును విడుచుచున్నా' నని నవ్వించి శాస్త్రిగారు

శా. శ్రాంతిం గైకొని పద్య గద్య రచనా సందర్భముల్ చూచి భూ
కాంతుం డెప్పడు దేనిఁ గూర్చి నుడువంగాఁ గోరునో యంచు ను
న్నంతన్ నా కను మూయ వచ్చెదవె నిద్రా! కొంచుకొ మ్మింక నిన్
బంతానన్ సమయింపఁగా విడుచుచున్నా నిద్దె శార్దూలమున్.

అని చెప్పిరఁట (శార్దూలవృత్తమును). సమయోచితముగాఁ జక్కని సమాధానము వచ్చినందులకు సరసులైన ప్రభువు లెంత సంతసింపరు? ఎంత సత్కరింపరు?

—: కేశవస్వామిసన్నిధిలో ఆశువు :—

ఈ యానంద - సమావేశములోనే శ్రీరాజాగారు కేశవస్వామి సందర్శనార్థమై వచ్చియుండి రాఘవశాస్త్రి గారిని గర్భవతిగా నుండియున్న తమభార్యకు కుమారుఁడు గల్గున ట్లాశీర్వచనపద్యములు చెప్పవలసిన దని స్వామి సన్నిధిలో కోరిరఁట. అప్పు డాశువుగాఁ జెప్పిన పద్యము లలోఁ గొన్ని-

మ. కవిరాట్పోషణుఁ, డంతె కాక విలసద్గాంభీర్యధుర్యుండు, కే
శవ పాదాబ్జమధువ్రతుండు, ధరణీశస్తుత్యుఁ, డుద్యన్మహా
హవ పాండిత్య విశారదుండు త్వరలో నావిర్భవం బంది భూ
ధవవర్గంబుల మీఱుఁ గీర్తి నిడు సీతారామభూపాలకా!.

మ. అవనీనాయక గర్వ నిర్వారణ ధైర్య స్థైర్య గాంభీర్య శౌ
ర్య విభూతుల్ చెలువొంద రాజ్యపతియై యాయాకవి శ్రేష్ఠవా
గ్భవ పీయూష రసాభిలాషి యగు సంపత్పూర్ణునిన్ గాంచి యు
త్సవమున్ గాంతువు కొద్దికాలమున సీతారామభూపాలకా!

మ. గణనాతీత కవీశ పద్మపటలీ కంజాప్తుఁ డాశత్రురా
డ్ఘన దోర్వీర్య మదేభ కుంభ విదళ త్కంఠీరవుం డాశ్రితా
వన దీక్షన్ వహియించు నీకుఁ ద్వరలో వంశంబుపే ర్నిల్పఁగాఁ
దనయుండై జనియించు నిక్క మిది సీతారామభూపాలకా!

మ. కలుగుంగా కిట సంపదృద్ధులు శరత్కాలక్షపానాథ ని
గ్గళి తానేక మయూఖ మధ్యగత ధారా ధోరణీ ద్రావితో
త్పలినీశోపల వాః ప్రపూరముల చందం బొప్పు మాబోంట్లవా
క్కులచే నిక్కము గద్దువాల నృపతీ! క్షుభ్యద్రిపుక్ష్మాపతీ!

అని అడిగిన దే తడవుగా అప్పటి కప్పు డశ్వాశువులోఁ జెప్పినది చూచి మహారాజాగా రావల నేమి గానున్నను సద్యస్కాల ములో మాత్రము పుత్రోత్సవ మయినట్లుగనే యానందపడిరి. భగవదనుగ్రహమున రాఘవశాస్త్రిగా రిట్టియనేక సంఘటన లతో మహారాజాగారి యాదరాభిమానములకుఁ బాత్రు లైరి.

—: మహారాజాగారికి కూఁతురు గల్గుట :—

ఆనంద-మాఘమాసోత్సవములు పూర్తియైన తర్వాత ఆసంవత్సరమే వేపర్లలో (నైజాము కృష్ణాతీరము) మహా సామ్రాజ్యపట్టాభిషేకము జరుగనుండఁగా రాఘవశాస్త్రి గారి కచ్చటి కాహ్వానము వచ్చెను. జగన్మోహనముగా జరుగ నున్న యామహోత్సవమునకుఁ బోయిరావలె నని

శాస్త్రిగారు 'సెల వీయవలసిన' దని మహారాజావారి నడిగి రఁట. 'రాణిగారికి ప్రసవదినములు గా నున్నవి, కుమారుఁడు గల్గు నని యాశీర్వదించితిరి గదా! ఆవేళకు కవీశ్వరు లుండ వలె' నని రాజాగారు పోనీయక నిల్పుకొనిరి. ప్రసవమున కింకను కాలము గడచుచుండఁగా శాస్త్రిగారు 'అప్పటికి ముందుగా వత్తు' నని సెలవు దీసికొని వెళ్లిరఁట. రాజా గారికి కొమార్తె గలిగినది. ఉత్సాహ ముడుగారినది. శాస్త్రి గారును నామకరణమునాఁటికి వచ్చిరి. 'కవీశ్వరునివాక్కు లన్యథాభూతము లైనవి గదా!' యని రాజాగా రనిరఁట. కుమారుఁడు గల్గున ట్లాశీర్వదింపుఁ డన్నారు గనుక మహా రాజాగారి సెల వైనట్లే చెప్పుటగదా మాపని?' అని శాస్త్రిగారు సమాధానము చెప్పిరఁట. శాస్త్రిగారి యుక్తి చమత్కారమునకు రాజాగారు సంతోషించిరి.

తర్వాత రాజాగా రాకొమార్తెకు పురుషవేషము వేసి తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని కొలువుదీఱుచుండెడి వారఁట. అట్లు కూర్చున్నప్పుడు వెనుకటిది జ్ఞాపకము చేయుచు శాస్త్రిగారు 'కవిశ్వరులవాక్కు లన్యథాభూతములు గాకుండఁ జేయుచున్నారు చూచితిరా?' యని యను చుండుటయు,-'ఔను, నిజమే, మీవాక్కులు చెల్లినట్లే' యని రాజాగారు చెప్పుచు సంతోషించుచుండుటయు జరుగు చుండెడిదఁట. ఒకప్పుడు రాజాగా రాకొమార్తెను దొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని కొలువుదీఱియుండఁగా శాస్త్రిగా రీపద్యమును జెప్పిరి.

చ. మొగమున భాగ్యలక్ష్మి, భుజమూలమునందున రాజ్యలక్ష్మి, తా
నగపడకుండ మీహృదయ మంతటఁ బాయనిధైర్యలక్ష్మి, రే
ల్పగలును నంకపీఠి వరలక్ష్మియు ముద్దులు మూటఁ గట్టఁ జి
ర్ణగవున రాజ్య మేలెదవె న్యాయపథంబున భూతలేశ్వరా!

(రాజాగారి ఆకొమార్తెపేరు వరలక్ష్మమ్మ అని. ఈమెపేరిటనే తర్వాత శాస్త్రిగారు ధ్రువచరిత్ర మంకిత మొనర్చినది.)

—: ఆత్మకూరు సభకు వెళ్లి వరల రమ్మనుట :—

ఆనంద మాఘమాససభలు ముగిసి పోయినను సీతా రామభూపాల్ బహద్దరువారు రాఘవశాస్త్రిగారికి సంభావన యిచ్చి పంపక వినోదముగా కాలక్షేపము సేయుచు నుండఁగా శాస్త్రిగారు ఆత్మకూరు సభకు వెళ్లిరావలసియున్నది గనుక సెలవు దీసికొందు నని రాజాగారి నడిగిరఁట. అప్పుడు రాజా గారు 'సంభావన దీసికొని మరల ఇటు వచ్చి వెళ్లవలసిన' దని చెప్పిరఁట. అప్పుడు శాస్త్రిగారు

మ. జననాథా! దయ యుంచవయ్య విలసచ్చాతుర్య మొప్పన్ సగవి
త్వనిరూఢిన్ బ్రతిపక్షు దుష్కవి కవిత్వాహంక్రియాధ్వాంత చా
లన మేపారిచి ఆత్మకూర్నృప సభాలంకార మేపారఁగాఁ
జని మోదంబున వచ్చెదన్ మరల నీసాన్నిధ్యమున్ గోరుచున్.

అని చెప్పి ఆత్మకూరు సభకుఁ బోయి తిరిగివచ్చిన తర్వాతఁ గూడ రెండు మూఁడు మాసములదాఁక సంభావన యియ్య

కుండ నిల్పుకొని ఆవల ఇచ్చినమీఁదట ఇఁక సెల వీయవల సిన' దని

చ. దినమున కెక్కుడేని కవిధీరులమై యొకనాల్గు రూపికల్
గన కిటు లుంట గౌరవమ ? గంటకు నూఱులు పద్యముల్ వినూ
తనముగఁ జెప్పఁగాఁ గలుగుధాటిని మీర లనుగ్రహించి చూ
చినదె కదా ! యిఁకేటికి విశేషము లిచ్చుట ? ధారణీపతీ !

అని చెప్పి సెలవు దీసికొనిరఁట. శాస్త్రిగారి యీచర్య లన్నియు వారి యిరువది నాల్గవయేఁడు నిండి నిండక ముందటివి.

—: శార్ఙ్గ్యంఘ్రిస్మరణ...సమస్యపై చర్చ :—

ప్రమాదీచ ఆనంద సంవత్సరములలో జరిగిన సంఘటనలతో రాఘవశాస్త్రిగారు గద్వాల రాజాగారి యాదరాభిమానములు చూఱగొని మరల మూఁడవమాఱు రాక్షస సం ర మాఘ మాసములో వచ్చిరి. ఈమాఱు వచ్చిన యీ సమావేశములో రాజాగారికి శాస్త్రిగారియెడఁ గలిగియున్న యభిమానము విశేషించుట కొరక విచిత్రసంఘటనమును భగవంతుఁడు కల్పన చేసియున్నాఁడు. ఎట్లన ?

సంస్థానమునకు వచ్చెడి పండితులలోను, కవీశ్వరులలోను, బ్రాహ్మణేతరు లుండుట చాల అరుదు. సీతారామభూపాలుని తండ్రికాలమునుండియు చెమికల చెన్నారెడ్డి (ప్రొద్దుటూరు తాలూకా, పర్లపాడు.) అను రెడ్డికవి గద్వాల సంస్థానమునకు వచ్చుచుండుట, సత్కారము లందుచుండుట కలదు. కులస్థులలో నీమాత్ర మొక్కరైన నున్నారని

సంస్థానమువారి కభిమానము. ఇట్లుండఁగా చెన్నారెడ్డిగారికి పండిత సత్కారముగా సంస్థానమునుండి సేల్వా బహుమాన మందవలె నని యభిలాష. సంస్థానములో ఒక మర్యాద గల దఁట. బ్రాహ్మణేతరులకు సేల్వాలు గాక, రాజాగారు ధరించు దుస్తు లిచ్చుటయే యాచారమఁట. అందుచేత 'సేల్వా లందు కొను నాచారము నూతనముగా నెలకొల్పవలె' నని రెడ్డిగా రాస్థాన విద్వాంసులగు శ్రీమాన్ పుల్లగుమ్మి వేంకటా చార్యులవారి నాశ్రయించి 'సంస్థానములో సేల్వా యిప్పింప వలసిన' దని ప్రార్థించిరఁట. ఉన్నవా రందఱికంటె మిన్న యనిపించుకొనకుండినచో సత్కారము జరుగఁబోదు గావున ఆస్థానవిద్వాంసులు రాఘవశాస్త్రిగారిపైఁ గల వేఱు భావ ముతోఁ దమ్మాశ్రయించిన రెడ్డికవి కభయదానము చేసి, 'ఎందుకైన మంచిది, రాఘవశాస్త్రిగా రడ్డుపడకుండ ఆయ నను గూడ ఆశ్రయింపవలసిన' దని చెప్పిరఁట. అప్పుడు చెన్నారెడ్డిగారు రాఘవశాస్త్రిగారి దగ్గఱకుఁ బోయి నమ స్కరించిరఁట. అంతకు ముందఱ ఒకటి రెండు సంవత్సరముల నుండి పరిచయమైనది గనుక రాఘవశాస్త్రిగారు ఛలోక్తిగా 'జీర్ణవసనప్రాప్తి రస్తు' అని ఆశీర్వదించిరఁట. సాధారణ ముగా శాస్త్రిగారి సంభాషణములో ఛలోక్తు లిట్లే యుండును. ఈమాట అనుటలోఁ గూడ రాజాస్థానములో మామూలుగా జరుగు బహుమానము (వేసికొన్న దుస్తు లిచ్చుట) జరుగుఁ గాక అన్న యుద్దేశ్యమే. ఆమాటకు చుఱుక్కు మని రెడ్డి గారు వచ్చిన కోపమును పెచ్చుపెరుఁగనీయక లోలోన

అణఁచుకొని, ఆవల తన సంగతి చెప్పికొని, సరే అని యని పించుకొని, అభయదాతలకడ కరిగి శాస్త్రిగారి ఛలోక్తిని దెలియఁ జేయుసరికి వారును ఇంచుక పట్టిచూడఁదగిన విష యముగానే యున్న దనుకొని దుర్ఘటములైన కొన్ని ప్రశ్న ములను సిద్ధపఱచి వానిని నాఁటి సభలో నీయఁదలఁచి శతావ ధానులు చేతఁ గా దనఁగా సాధించిన ట్లగు నని ఆప్రశ్నలలో అతిక్లిష్టము లైనవానిని గొన్నిటిని రెడ్డిగారికి శ్రుతపఱచి, అత్యంతక్లిష్టములైనవాని కించుక సహాయము గూడఁ జేసి సభలో నేమో చేయవలె నని పన్నాగము పన్నికొనిరి. ఈ రహస్య మెట్లో రాఘవశాస్త్రిగారి చెవిని బడి, తిన్నగా ఆప్రశ్న పత్రము, దానికి రెడ్డిగారు సంపాదించిన తోడ్పాటు చేతికిఁ జిక్కించుకొనిరి.

సాయంకాలము సభ. ఈ సంవత్సరముకూడ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, నెమలూరి వేంకటశాస్త్రి గారును వచ్చిరి. ఆత్మకూరు సంస్థాన విద్వాంసులు బాల సరస్వతి బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులుగారును, ఉప ద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రిగారును వచ్చియుండిరి. క్రొత్తగా పిశుపాటి చిదంబరశాస్త్రిగారుకూడ వచ్చిరఁట.

ఆ సభలో ఆశ్రితకవి కభయదానము చేసిన ఆచార్యుల వారు తిన్నగాఁ బ్రకరణములోనికి దించి, రెడ్డికవిని గొప్ప చేయఁదలఁచి, రాజాగారితో చెప్పి రెడ్డిగారు శతావధానుల కంటెను గొప్పవా రని ప్రశంసకుఁ దెచ్చి తాము సిద్ధము చేసి తెచ్చిన ప్రశ్నపత్రమును రాజాగారికిఁ జూపి వారి యనుమతి

దీసికొని, కవీశ్వరులతో 'రాజాగారు కొన్ని ప్రశ్న లిచ్చు చున్నారు. కవీశ్వరులు సమాధానములు వ్రాయవలె' నని ప్రశ్నలు వ్రాసికొమ్మనిరి. అప్పు డిచ్చిన ప్రశ్నలలో కొన్ని సమస్యలు :—

౧. కేశాద్యగ్రాజ్ఞు లనఁదగిరి పాషండుల్.

౨. వీధ్వ్యజు నుమ గనియె నని వివేకికిఁ దెలియున్.

౩. శార్ఙ్గ్యంఘ్రి స్మరణవలన సద్గతి గల్గున్.

౪. గరుడుఁడు గణపతికిఁ దండ్రి గావలె సుమ్మీ.

౫. పాపమ్మా! దానిమగని పని సరి గాదా?

ఇందులో పాపమ్మా! దాని మగని...అను సమస్య సప్తస్వరములతోనే పూర్తి చేయవలె నని నియమము చేసిరి. ఈసమస్యలను గూర్చినది ఉపద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రి గారఁట. తర్వాత, ప్రాసలు లేని, అర్థసారస్యము కుదురని యిట్టి సమస్యలను అసలువారుకూడ పూరింపవలసియుండు నని వాదోపవాదములు చెలరేఁగెనఁట. అప్పుడు. 'ఈవాద మేల? శార్ఙ్గ్యంఘ్రి స్మరణవలన సద్గతి గల్గున్ అన్న సమస్య పూర్తి చేయండి' అని వేంకటాచార్యులు గారు చెప్పిరి. రాఘవశాస్త్రి ప్రభృతులు దీనికి ప్రాసలు లేవు. కాన దీనిని దీసివేయవలసిన దనిచెప్పిరి. కాదు వ్రాసితీఱవలె ననఁగా ఒకే ప్రాసతో వ్రాసిరఁట. ఒకే ప్రాస గూడ దని ఆక్షేపింపఁగా ప్రాసలు లేని దాని కాక్షేపించిన నేమగు? నని కవీశ్వరులు వాదు లాడు

చుండిరఁట. ఇంతలో చెన్నారెడ్డిగారు నేను కొంచెము వ్రాసినా నని లేచి చెప్పిరఁట. ఏది? చదువు మని ఆచార్యులు గారు చెప్పఁగానే చెన్నారెడ్డిగారు

కం. భార్గ్యాభ కచల కైనను
భార్గ్యాదిక జటుల కైన ... ...
శార్ఙ్గ్యాదిక ... ...
శార్ఙ్గ్యంఘ్రి స్మరణవలన సద్గతి గల్గున్. (పద్యము పూర్తి దొరక లేదు.)

అని చదివిరఁట. అందఱును భేష్ భేష్ అని చప్పట్లు గొట్టఁగా శతావధానులు కూడ వ్రాయలేనిది వ్రాసినా నని రెడ్డిగారా సంతోషము పట్టఁజాలక అంతలోనే

శా. శ్రీ గద్వాల పురాగతాఖిల కవిశ్రేష్ఠాళి జుట్లెల్ల నే
నూఁగన్ జేసితిఁ; బట్టి యూఁచితి, నొహాహొహొ ...

అని యీపద్యము చదివిరఁట. అంతట పిశుపాటి చిదంబర శాస్త్రిగారు లేచి 'కవుల జుట్టుపట్టి యూఁచితినా? ఈయధికార మెవ రిచ్చిరి? ఇది రాజసభయా? మఠమైనవా? దేనిలో నీవు దీటు కొందువో ర' మ్మని ప్రతిజ్ఞ దీసిరఁట. అంతట రాజాగా రిట్టి యధిక ప్రసంగము రాజసభలలోఁ జేయరా దని రెడ్డికవిని మందలించిరఁట.

రామాయణములో పిడుకల వేట్లాట యిది జరిగిన తర్వాత రాఘవశాస్త్రిగా 'రీ సమస్యాపూరణములో ప్రాస పోయినది, మఱొక పర్యాయము చదువవలసిన' దని యడిగిరఁట. అప్పుడు వేంకటాచార్యులవారు తీసికొని చదువఁగా

భార్గ్యాభము కాదనియు, భార్గాభ మని యగు ననియు పండితులకు పండితులకే వాగ్వాద మారంభ మయ్యెను. బాలసరస్వతి ప్రభృతులు రాఘవశాస్త్రిగారి వాదము సరియైన దని నిర్ణయించిన మీఁదట శాస్త్రిగారి యాక్షేపణ నెగ్గెను.

ఈ ప్రకారముగా నిది వీఁగి పోయిన తర్వాత ఉన్న సత్యమును బైటఁ బెట్టవలె నని రాఘవశాస్త్రిగారు 'నిజముగా ఈ సమస్య చెన్నారెడ్డి పూరించిన దేనా? ఇదిగో పీ రీయఁ దలఁచిన ప్రశ్న పత్రము, అందులో పూర్తి చేసి యిచ్చిన భాగము—అని తమ చేతికి దొరకిన ప్రశ్న పత్రమును రాజాగారికిఁ జూపెట్టిరఁట. అప్పుడు రాజాగారు తమ సభాంగణమున నిట్లు జరుగుట యపకీర్తికర మని మందలించిన మీఁదట ఎవరికో యేమో యనుకొన్నది తమకే బెడిసి కొట్టఁగా అవమాన ప్రసంగ మాయెనే యన్న యావేశముతో ఆస్థానవిద్వాంసుల ఆఁపు చూచుకొని చెన్నారెడ్డిగారు రాఘవశాస్త్రిగారివైపు తదేకదృష్టితోఁ జూచుచు వెక్కసము పట్టఁజాలక

'అతి చాతుర్యము వైదికద్విజులకే యబ్జాసనుం డిచ్చెఁగా !'

అని యొక గీటు పఠించిరఁట. (వైదికద్విజుల కనఁగా వైదిక పక్షుల కను నర్థాంతరమే యిట నభిప్రేతము.) వెంటనే **రాఘవ**శాస్త్రిగారు రాజాగారు **వినుచుండఁగా దీనిని నీవు**

పూర్తి చేయుదువా? నన్ను పూర్తిచేయు మందువా? అని యడిగి అంతటితో ఆఁగక అత్యాశువుగా

మ. అతి చాతుర్యము వైదికద్విజులకే యజ్ఞాసనుం డిచ్చెఁ గా
గతి యిం కేమని ఖేద మొందకు, దివాకః ప్రౌఢ కల్లోలినీ
వితతోత్తుంగ తరంగ ఖేలన కలా విశ్రాంతి రాయంచ కీ
క తటాకంబుల గ్రుడ్డికొంగల కొగిఁ గల్పించునే యెన్నఁడేఁ ?

అని, వైదికద్విజుల కనఁగా రాజహంసలకే బ్రహ్మదేవుఁడు దివ్య గంగా విహారణ కౌశల మీయక చెఱువులలో చేఁపలు పట్టుకొను గ్రుడ్డి కొంగల కిచ్చునా? యన్న భావముతోఁ బూర్తి చేసిరి. చెన్నారెడ్డిగారి కొకకన్ను గ్రుడ్డిది కావుటతో బెడిసి తగిలెనే యన్న వ్యసనోదయ మాయనకును, ఆనంద మన్యులకును గా నుండెను. రాజాగారీవినోదమును జూచుచు కలవాస్తవమును జిత్తగించినవారు గనుక సభలో సమస్య యిచ్చునది నీవా? క్షమాపణ చెప్పికొని నమస్కరింపవలసిన దని చెన్నారెడ్డిగారిని మందలించినమీఁదట రెడ్డిగారు నమస్కరించుట కేమి? ఒకమాఱు గాదు, వేయిమాఱులు, బ్రాహ్మణోత్తములు గదా యని లేచి నమస్కారము చేసి తర్వాత రాఘవశాస్త్రిగారితో ద్వేషభావముతో నే నన్నదిగాదు. నా యభిప్రాయమును రేపు మనవి చేసికొందును. క్షమింప వలసిన దని కోరఁగా అప్పుడు రాఘవశాస్త్రిగారు

మ. ద్విజ శబ్దార్థము పక్షులైనపుడు నీద్వేషంబు యుక్తంబు; యీ
ద్విజు లాలాటిరు గారు, శాస్త్రకలనా దేదీప్యమానుల్, సుర
వ్రజ కల్లోలవతీ సువర్ణ కమల ప్రాంచ ద్రసోల్లాస వా
స్త్రిజగ త్పూజ్యులు; నెట్లు సాగు నిఁక నీదుర్గర్వగర్వవాచాలతల్ ?

అని చెప్పిరఁట. అంతటితో ఆశ్వాసాంతము ముగిసెనఁట. ఇట్టి పరిస్థితిలో రాజాగారికి రాఘవశాస్త్రిగారిపై నభిమానము గల్గుట కభ్యంతర మే మున్నది? నిజముగా ఆనాఁ డీసభా వేశములో జరిగినది యథాస్థితిగ వ్రాయవలె నన్నచోఁ జేతఁగా దని చెప్పినను దప్పు లేదు. నాఁడు సభలో నుండి చూచుచున్నవారు చెప్పెడి విషయములో ఈవ్రాసినది యేపాటిదో లెక్కకు రాదు. యథార్థము నేని ఉన్న దున్నట్టుగా వ్రాయ వీల్పడదుగదా!

కచ్చ వచ్చినచో సామాన్యముగా వదలిపెట్టుట రాఘవశాస్త్రిగారి ప్రకృతి గాదు. ఒక్క రాఘవశాస్త్రిగారికే గాదు, అభిమానము గల ప్రతివ్యక్తికిని పరులు చేయఁ దల పెట్టిన పరాభవమునకుఁ బ్రతిఘటించియో తీఱవలయు నను పట్టుదల యుండును. ఉండి తీఱవలెఁగూడ. కచ్చ సాధించు విషయములో రాఘవశాస్త్రిగారికిఁ గల పట్టుదల మఱికొన్ని దృష్టాంతములతో మఱొకచోఁ బరికింతము గాక.

—: పందిని మత్తేభముఁ జేయుట :—

నల సంవత్సర శ్రావణమాసములో (నైజాం) దొంతి సంస్థానమునం దష్టావధానము చేయుచుండఁగా (పేరున కష్టావధానమే అఁట. ఇచ్చినప్రశ్న లిరువదియఁట.) అందులో నొక పృచ్ఛకుఁడు 'పందిని మత్తేభముఁ జేయండి' అని యడిగెనఁట. సమయము దొరకిన సామాన్యముగా విడుచువారా? కవులు! పృచ్ఛకునికి దొరకిన వర్ణ్యవస్తువునకు సంతోషించుచు (అడిగిన పృచ్ఛకుఁ డేమైన ననుకొననీ)

మ. మన సామర్థ్యము చూడఁగాఁ దలఁచి నిర్మర్యాదకార్యక్రమం
బున వర్ణింపఁగ వస్తు వేర్పడియె; సభ్యుల్ సన్నుతుల్ సేయఁగా
నవపద్యప్రతిభాస్వభావ రచనా త్యాశూక్తి వైచిత్రిఁ బం
దిని మత్తేభముఁ జేయఁగావలయు ధాత్రీభృత్కుమారీమణీ !

అని యిష్టదేవతకు నివేదించుకొని పృచ్ఛకుఁడు కోరినట్లుగనే

మ. పురిపార్శ్వంబులఁ జక్కఁజేయుచును నే భూపాలకశ్రేణితో
నరకా సైనను బత్తెముల్ గొనక, నిన్నర్థించి సేవింతు సం
కర వర్ణంబుల లాభ కాంక్షకయి సాక్షాద్దేహ మర్పించు నూ
కర ! ఆత్మార్పణముల్ బరోపకృతి కగ్రస్థాన మీవే సుమీ !

అని పందిని మత్తేభముఁ జేసి వేసిరి. పందిని గుఱించి మత్తేభ వృత్తములోఁ జెప్పవలసిన దని యడుగుటకు పృచ్ఛకుఁడు చేసిన చమత్కార మది! ఇటులనే తిరుపతి వేంకటకవులకుఁ గూడ నొక శతావధానములో నొకపృచ్ఛకుఁడు చీఁకుముల్లును గుఱించి సీసపద్యము చెప్పవలసిన దని వికటప్రశ్నగా నడుగ, బుద్ధిలేక యెందుల కడిగితిరా! యని యనుకొనునట్లుగా ఆ చీఁకుముల్లుపైఁ బెట్టి చీవాట్లు పెట్టుచు

సీ. నిన్నుఁ గాల్చినఁ గాని నీబుద్ధి మానవే
ఛీ ! యే మనందు నే ? చీఁకుముల్ల !

అని యిట్లు తక్కినపాదములు గూడఁ జెప్పిరి. కనుక కవుల కవకాశము దొరకవలెఁ గాని దొరకిన యవకాశమును జాఱ విడుతురా ?

రాఘవశాస్త్రిగా రవధానమధ్యములో అత్యాశువుగాఁ జెప్పినను పందిపైఁ జెప్పిన పద్య మెంత ప్రౌఢముగాను, ఎంత భావగుంఫితముగాను నున్నదో పాఠకలోకము గమనింపఁగల్గును.

ఈపద్యము చెప్పినతర్వాత వేంకటచయను లనువారు పందిమత్తేభ మైనది! భేష్!! భేష్!!! బలే బాగున్నది!! అని భావగర్భితముగా ననిరఁట. అందుమీఁదట శాస్త్రిగారు

ఉత్పలమాలిక. (౮ గీట్లు)

ఆదివరాహమై జగము లన్నిటిఁ జూఁప తెలుంగు చుట్టు గ
ర్వోదయుఁ రాక్షసుం దునిమి, యోగ్యసపర్యల నందినట్టి ల
క్ష్మీదయితుండు పంది; యిఁక శేషునకున్ దొలికూర్మమూర్తికిన్
పాదయి కోలకొమ్ముపయిఁ బర్వత సర్వసముద్ర ముద్రితో
ర్వీ దృఢ కాన నోరు నగరీ భర దిగ్గజరాజి కూఁతయై
మేదిని దాల్చియున్ బ్రభల మించియు నాఁటికి నేఁటికిన్ మహా
మోద మొనర్చుఁ బంది; యదె పో యిటు మన్నిరవద్యపద్యభా
వోదిత మయ్యె; నక్కజము నొందెదో ? పంది మదేభ మాటకున్ !

అని చెప్పిరఁట.

—: మొట్టమొదటి యష్టావధానము :—

రాఘవశాస్త్రిగారు విద్యాభ్యాసకాలములోనే చిటి పొటి పద్యములు చెప్పుచు, చిన్నిచిన్ని యవధానములు చేయుచు వచ్చినను పెద్దలసమక్షమున నెన్నికలోనికి వచ్చిన యవధానము ప్రమాదీచ వైశాఖమాసములో ౨౨ వ యేఁట స్వగ్రామములో (ఎఱ్ఱగొండపాలెములో) రాళ్లభండి

నృసింహశాస్త్రిలవారియింటఁ జేసిన అష్టావధానమే. ఈయవ ధానసభ శాస్త్రిగారి వేదవిద్యా గురువు లగు రాళ్లభండి నృసింహశాస్త్రిగారి యధ్యక్షత క్రిందనే జరిగెను. నృసింహ శాస్త్రిగారు క్రమాంతస్వాధ్యాయపరు లగుటయే గాక కవి త్వమునందును జక్కనిపరిశ్రమ చేసినవారు. ఈయవధానములో నృసింహశాస్త్రిగారు శిష్యునిశక్తిని బరీక్షింపవలె నని ఆలోచన మానములోఁ గొంత పరీక్ష చేసిరి. వీరు చిన్నప్పు డెప్పుడో తమ కిచ్చియున్న ప్రశ్నలలో రెండు, మూఁడు ప్రశ్న లిప్పు డితరులచే నిప్పించి, యెట్లు పూర్తి చేయునో చూడవలె నని పరీక్షించిరి. చివరకుఁ దమకంటెఁ గూడఁ దమశిష్యుఁడు మిక్కిలి ప్రావీణ్యముగాఁ బూర్తి చేయుటచే నవధానాంత మున నంత్యోపన్యాసమునం దీవిషయము వెల్లడించి చెప్పిరి. ఈ యష్టావధానములో జరిగిన విషయములలో రాఘవశాస్త్రి గారు నాచే వ్రాయించి పెట్టినమట్టునకే తెలియఁబఱుప నగును. సమగ్రముగా జ్ఞాపకము చేసికొని చెప్పుదు మనిరి; కాని కాల మోర్వ లేకపోయినది. ఉపలబ్ధములైన పద్యములు:—
ఆదిలో భారతీస్తవము.

ఉ. అష్టవధానమంట! బుధు లంపఱు చూడఁగ వేడు కంట! త
త్కష్టము నేన యోర్తునఁట! కాదనఁ జాలను దల్లిరో! దయా
దృష్టి నిగుడ్చి ప్రోతు వను ధీరతతోఁ దలఁ దాల్చినాఁడ, ని
ర్దుష్టముగా రచించి విబుధుల్ కొనియాడఁగఁ జూడు భారతీ!.

కం. శ్రీకరుని, రాళ్లభండి మ, హాకులజు నృసింహశాస్త్రి నద్భుతవిద్యా
శ్రీకుని, సద్రసకవితా, పాకవివేకుని నుతింప బ్రహ్మకుఁ దరమే?

నృసింహ శాస్త్రిగా రిప్పించిన సమస్య మొదటిది.

'మఠమున సన్న్యాసి యొకఁడు మానినిఁ గూడెన్'.

కం. పఠనాభ్యాసాదులలో
శఠుఁ డయ్యును సన్న్యసించి స్మరసుమ బాణో
ల్లుంఠితాంతరాత్ముఁ డగుచున్
మఠమున సన్న్యాసి యొకఁడు మానినిఁ గూడెన్.

అని రాఘవశాస్త్రిగారి పూరణం.

నృసింహశాస్త్రిగారు చిన్ననాఁడు పూరించిన దిట్లుఁట.

కం. కఠినము లగు పూములుకులు
శఠుఁడై మదనుండు వేయ శమదమములు వీ
డి తవరతనమున కొడఁబడి
మఠమున సన్న్యాసి యొకఁడు మానినిఁ గూడెన్.

నృ. శా. గా రిప్పించిన రెండవప్రశ్న నస్యపుఁగాయపై కందపద్యము చెప్పవలె ననె. రాఘవశాస్త్రిగారు చెప్పినది

కం. శ్రీ సుందరతర పృథులీ
లా సంభృత లికుచ సదృశ లక్షణ రుచరూ
పా ! సర్వరసిక పుంగవ
నాసాకృత భాగధేయ ! నస్యపుఁగాయా !

అని నృసింహాస్త్రిగారు వ్రాసిన పద్య మిదియఁట.

కం. నస్యపు బుఱ్ఱ చెలంగె స
దస్య జన ఘ్రాణ సుఖద దక్షు లలిత రం
ధ్రాస్యం బచ్ఛవిభా సా
రస్య తిరస్కృత వియచ్చరస్త్రీకుచమై.

రాఘవశాస్త్రిగారి పద్యములలో గిడతపడకుండ నడి

చిన నడకకును, గమకమునకును మెచ్చుకొని నృసింహశాస్త్రిగారు గుణజ్ఞులగుటచే 'నాసాకృత భాగధేయ! నస్యాపుఁగాయా!' అని వేసినందులకు మిక్కిలి ముఱిసిపోయిరఁట.

ఒక పృచ్ఛకుఁడు ప్రతాపరుద్రీయశ్లోక మిచ్చి తెనిఁగింపఁగోరెనఁట. అప్పు డధ్యక్షులైన నృసింహశాస్త్రిగా రది తెనిఁగించుట కష్టము గాని నేను దెనిఁగించి యున్నాను 'వాల్మీకే ర్మునిసింహస్య' యను శ్లోకమును. అదే యితఁడును తెనిఁగింపనీ యని చెప్పిరఁట. రెండు తెనిఁగింతు నని రాఘవశాస్త్రిగా రనఁగా కాదు ఈయొక్కటే చాలు నని నృసింహశాస్త్రిగారు సెల వీయఁగా రాఘవశాస్త్రిగారు

కం. నాకుజముని కేసరి కవి
తా కాననమునఁ జగించి దశరథతనయా
స్తోక కథా ధ్వని వినిచినఁ
జేకొని పరగతిని నెవఁడు చెందక యుండున్?

అని యాంధ్రీకరించిరఁట. నృసింహశాస్త్రిగారిపద్య మిదియఁట

తే. అటవిఁ దిరుగాడి మునిసింహుఁడైన నాకు
భవుని వ్యాఖ్యాత మగు రామభద్రుకథను
సాధువృత్తిని నెమ్మది సంస్మరించి
యెవఁడు ధారుణి సద్గతి నెనయకుండు?

ఇందులకు మూలశ్లోకము :—

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ?

అని సభలో నడిగిన రెండవ సమస్య

మారెడుఁగాయలోన నొకమానిని యుయ్యెల లూఁగఁ జొచ్చెడున్.

ఉ. తీరని కర్మనిష్ఠల క్షితిన్ జరియించెడి బాపలే సదా
చారములన్ త్యజించెదరు, సాధుల బాధలఁ బెట్టు దుష్టులే
ధారుణి నేలఁ జొత్తు, రయథార్థము గా దిది, కాలధర్మమే
మారెడుఁ; గాయలోన నొకమానిని యుయ్యెల లూఁగఁజొచ్చెడున్.

మూఁడవ సమస్య :—

రంభాఫల మెంత రుచియో రసికుఁడె యెఱుఁగున్.

అనఁగా అరఁటి పం డెంతో విష మఁట. ఆసంగతి రసికుఁడే యెఱుఁగునఁట! శాస్త్రిగా రీసమస్యను రంభారావణసంవాదములో రంభ రావణునితోను, రావణుఁడు రంభతోను అన్నట్లుగా

కం. గంభీరవాక్కు లేటికి ?
శుంభద్గర్వా ! విషమ్ము సు మ్మధర మనన్
రంభకు రావణుఁ డనె నిటు
రంభాఫల మెంత విషమొ రసికుఁడె యెఱుఁగున్.

అని పూరించిరి.

జయప్రదముగా అవధానము ముగిసిన తర్వాత అధ్యక్షులు రాఘవశాస్త్రిగారిశక్తికి మెచ్చుకొని యెక్కడికిఁ బోయినను జయించుకొని రాఁగలఁ డనియు, 'పుత్రా దిచ్ఛేత్పరాజయ' మ్మన్నట్టి కీర్తి తమకుఁ దక్కిన దనియు నభినందించి

చ. నవరస భావవైఖరి, మనఃప్రియ శయ్య, యలంక్రియార్థ గా
రవములు గల్గి దుష్కవుల రాపిడి కోర్చి, తృణీకరించి, స
త్కవు లలరన్ రసజ్ఞసుఖదాయిని యయ్యెను గాడెపల్లి రా
ఘవుని కవిత్వకాంత కసుగందదువో యొవ రెంత లాగినన్,

అని ప్రశంసాపద్యమును జెప్పి యాశీర్వదించిరి. అన్నట్లు వారి యాశీర్వచన ఫలితముగా ఆవల జరిగిన చర్యలలో లోటు పాట్లు లేకుండనే అమోఘముగానే జరిగినట్లు తెలియనగుచు న్నది 'ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి' అని గదా యున్నది ?

—: మఱుదిన మే రెండవ యావధానము :—

రాళ్లభండి నృసింహశాస్త్రిగారింట ప్రథమావధానము జరిగిన మఱుదినమే ఆయూరిలోనే తుమ్మలపల్లి కామావధా నులవారింటిలో రెండవ అవధానసభ జరిగెను. ఆ యవధా నారంభములో పూర్వదినము జరిగిన యవధానముపై నెవరో పేరు దాచుకొని ఆక్షేపణ భావముతో నేవో పద్యములు వ్రాసినా రన్న విషయము రాఘవశాస్త్రిగారిచెవికి వచ్చి యుండుటచే అందునుగుఱించి ముందుగా నిట్లు ప్రస్తావన దెచ్చిరఁట.

ఉ. ధారణ దప్పకుండ నవధాన మొనర్చిన రాఘవుం బుర
స్కారము చేసి ప్రాజ్ఞులె ప్రశంస లొనర్ప, నెవండొ తాఁ దిర
స్కారము చేసెనంట! అటు చాటున నేమిటి ? కింతమందిలోఁ
బేరుకొనంగ రాదె యిట ? వీరుఁడు రాఘవుఁ డేమి భీరుఁడో ?

అని చెప్పి యిష్టదేవత నుద్దేశించి

చ. చెదరని ధారణాపటిమఁ జిత్తజు మార్గణ నిర్గళ ద్రసా
భ్యుదయము నియ్య మందఁ దగుచుండిన పద్యము లిచ్చి యాసభా
సదన మలంకరించితివి, శాంకరి ! నిన్న; నకైనఁ గొంద ఱె
య్యదియొ పచించిరంట, యిపు డందఱు మెచ్చెదునట్లు సేయవే ?

చ. ధనమున కోసఁజేయక బుధప్రకటస్తవనీయమైన కీ
ర్తిని గొనఁగాఁ దలంచి యరుదెంచినవాఁడను గాన నోజగ
జ్జనని ! భవత్కృపారస మొసంగి మనోజ్ఞ కవిత్వ కల్పనా
ద్యనుపమ కౌశలంబు లిడు టర్హము, కీర్తికరంబు శాంకరీ !

అని ప్రార్థించిరి.

ప్రశ్న :—హరిహరుల తారతమ్యమును గూర్చి శార్దూలము.

శా. చేతుల్ మోడ్చి నుతించువారలఁ గృపాసింధుండునై ప్రోచుచో
భూతేశుండు స్వహాని గుర్తెఱుఁగకే ప్రోచుణ్, రమాకాంతుఁడో
చేత స్తత్వ మెఱింగి దుష్టు లగుచో శిక్షించి ఘోరంబుగాఁ,
బూతాత్మల్ గలరేని వారలను దాఁ బ్రోచుణ్ దయాదృష్టితోణ్.

శేషయ్య అను ఆయన దోమలపై చంపక మడిగెనఁట.

చ. మలినము లేశ ముండిన రమారమి సర్వగృహాంతరాళముల్
కలయఁ జరించి, కణ్తుదలఁ గాఁపుర మేపునఁ జేసి, పండితా
వళులకు మోదముణ్ జెఱచి, వర్తిలు చుండినయట్టి పాడుదో
మలను గణింపఁగా వలసె మాన్యుఁడు శేషయ పృచ్ఛసేయుటణ్

శివునిమీఁద కందపద్యము.

కం. మన ప్రేయసి యని నెత్తిన
నునిచితి గంగాభవాని; నొకటిందువు నేణ్
జినుకవు చెఱువుల; కెటువలె
మనువారమొ వృశ్చికాల మల్లేశ ! శివా !

అది వైశాఖమాసము గనుక అప్పటికిఁ దొలకరివర్షములు కురియనే లేదఁట.

—: సమస్యాపూరణములు :—

రాఘవశాస్త్రిగారి దగ్గఱ నున్న ప్రతిభావిశేషము లలో నొకదానికీ దీసిపోయిన దింకొకటి లేదు. సమస్యా పూరణములోనిచాకచక్యము చూడ నగును. ఒక్కయవధాన సమయములలోనే గాక, అడిగినప్పు డెల్ల ఆయన కాదని చెప్పినది లేదు. అడిగెడివా రుండవలె. అందులోనైనను ఆల స్యము లేకుండ అవలీలగాఁ బూర్తి చేయుటయు, అద్భుత కల్పనలతో నిమిడియుండుటయు వారిదగ్గఱ నున్నగొప్ప విశే షము. వారిజీవితములో జరిగిన పరీక్షలును అట్టివియే. వారు చూపిన చాకచక్యమును—అట్టిదియే.

ఒకప్పుడు శాస్త్రిగారు మాయింటికి వచ్చిరి. వారు వచ్చినా రన్నచో నేదోయొక సారస్వతగోష్ఠి యుండవలసినదే గాని అరనిముసముగూడ వృథాపోవునది యుండదు. చక్కిలి గింతలు గలిగించు సంభాషణము! కనుక అందఱకు ఆనందమే. అప్పుడు మాతమ్ముఁ డంతకు ముందే కూర్చుకొని యున్న సమస్యను తానే పూరణము చేయుద మని ప్రయత్నించి చేతఁ గాక రాఘవశాస్త్రిగారు రాఁగానే ఉన్నసంగతి ఉన్నట్లు గానే 'నే. నీసమస్య కూర్చినాను, నేనే పూర్తి చేయుద మని ప్రయత్నించితిని. కుదురలేదు, తాము చిత్తగింపవలయు' నని చెప్పి యిచ్చెను. వట్టి సమస్య యేమి? కాగితము, కలము తెమ్మని వెంటనే గబగబ వ్రాసివేసిరి. తర్వాత నేను వచ్చు సరి కిట్లని మావాఁడు చెప్పి శాస్త్రిగారు వ్రాసినపద్యము చూపించెను. ఆసమస్య నేవిధముగాఁ బూర్తి చేయవచ్చు?

నని నన్నుఁగూడ లోగడ మావాఁడడిగి యుండెను. శాస్త్రిగా రవలీలగాఁ జేసిన పూరణపద్యమును జూచినతర్వాత బ్రహ్మా నందమైపోయెను. వారు పూరణ చేసిన పద్యము ధారణకు లేదు గాని భావము జ్ఞాపక మున్నది. సమస్య యిది:—, 'జందెము లేని బ్రాహ్మణుఁడు జన్నముఁ జేసె నిదేమి చిత్రమో!' అని. శాస్త్రిగారు వ్రాసిన పద్యభావము, 'సన్న్యాసి జ్ఞానయజ్ఞము చేసె' నని. శాస్త్రిగారి ధోరణి యెప్పుడును నిరాఘాటముగా, నిరుపమానముగా నిట్లే యుండఁగల్గును.

—: వికిరాన్నం బిడి పార్వతిన్ శివుఁడు దాఁ బెండ్లాడిన సమస్య :—

ఒకప్పుడు గద్వాలలో

'వికిరాన్నం బిడి పార్వతిన్ శివుఁడు దాఁ బెండ్లాడె మోహాంధుఁడై'

అని సమస్య యిచ్చి పూరింపు మనిరఁట. వెంటనే రాఘవ శాస్త్రిగారు పరీక్షకుఁగా ఎత్తిన కలము దించకుండ నిట్లు పూరించిరి.

మ. వికటభ్రూకుటి బూదియై పడిన పూవిల్కానిపై నల్కమై
మకరాంకాయ రతిప్రియాయ భవతే మద్దత్త మేతత్తిలో
దక మంచున్ శశిరూపపిండ మిడి, తత్తారాళిరూపంబుగా
వికిరాన్నం బిడి పార్వతిన్ శివుఁడు దాఁ బెండ్లాడె మోహాంధుఁడై.

ఈ పూరణలో నెంత మెలఁకువ, ఎంత నేర్పు కనఁబడు చున్నదో చిత్తగింపనగును. ఈసమస్యలో పార్వతిని శివుఁడు పెండ్లాడె నని యుండెఁ గాని అట్లు గాక లక్ష్మిని శివుఁడో, పార్వతిని హరియో పెండ్లాడె నని యున్నప్పటికిని ఏదో

సమర్థించి వ్రాసియుండెడివారు! అప్పుడె ట్లుండునో చూచి యానందించుటకు సమస్య యవకాశము గల్గించినది గాదు.

—: విడిచి రెల్లరు బ్రాహ్మ్యమా! వెళ్లిపొమ్మన్న సమస్య :—

గంగుపల్లె సప్తాహములో (మార్కాపురము తాలూకా) శాస్త్రిగారిచే అష్టావధానము చేయించుచు అందులో నిచ్చిన సమస్య 'విడిచి రెల్లరు బ్రాహ్మ్యమా! వెళ్లిపొమ్మ' అని. శాస్త్రిగా రవధాన కాలములోనే దీని నెంత యౌచిత్య పోషకముగాఁ బూరించిరో చిత్తగింపనగును.

సీ. ఉరిత్రాడవై యేల యున్న ప్రాణము లాగ?
జందెమా! నీ వింక సాగిపొమ్మ
తీఱనిమచ్చవై తిను కూడడఁచె దేల?
తిలకమా! నీ వింకఁ దొలఁగు మమ్మ
పిఱికిపందతనాన వెనుక కేఁగెద వేల?
జుట్టు! ముందఱత్రోవఁ బట్టు మమ్మ
వెలవెలఁ బాఱించి విసిగించె దిటు లేల?
యుత్తవిభూతి! పర్వెత్తు మమ్మ
తే. సమయ మిది గాదు స్నానమా! జరుగు మమ్మ
జంపు సాగింప కోసంధ్య! సమయు మమ్మ
పోయె నీదశ శీలమా! పోఁగదమ్మ
విడిచి రెల్లరు బ్రాహ్మ్యమా! వెళ్లిపొమ్మ.

—: భీష్ముని పెండ్లి కేఁగిన సమస్య :—

శ్రీముఖ ఫాల్గున పూర్ణిమకు శాస్త్రిగారు వనపర్తి సంస్థాన విద్వత్సభల కేఁగిరి. అప్పుడు రాణిగా రగు శ్రీమతి

సరళా దేవిగారిపైఁ గొన్ని పద్యములు వ్రాసి శిష్యుఁడగు కాసలనాటి సుబ్బరాయునిచేతి కిచ్చి చదువుమనిరఁట. ఆచిరం జీవుఁడు సభాకంపముతో ఎత్తుకొనుటతోనే

కం. పురుష స్వభావ మెఱుఁగని
సరళాంతఃకరణసీమ జనియించి ... ...

అని చదివెనఁట. వెంటనే పొరపాటు చదువుచున్నాఁ డని శాస్త్రిగారు తహతహపడుచు చూచి చదువు మని హెచ్చరింపఁగా తప్పు సవరించుకొని 'పరుషస్వభావ మెఱుఁగని...' అని చదివెనఁట. భ్రమ ప్రమాదము లీవిధముగా జరిగియుండ రాణిగారుమాత్ర మిది పొరపాటుక్రింద భావింపక అన్యథా భావించి (అట్లు భావించుటకుఁ దగిన కారణము హైకోర్టు వఱకు నడిచిన దున్నదఁట.) దానికిఁ దగిన పరాభవముగా గట్టిపరీక్ష చేయవలె నని, చక్కఁగాఁ జదువుకొన్న విదుషి గాన కఠినసమస్యగా

'భీష్మునిపెండ్లి కేఁగిరఁట పిన్నలు పెద్దలు బంధు లందఱున్'

అని స్వయముగా నొక సమస్య కల్పించి యప్పటి కప్పుడే పూర్తి చేయవలె నని కఠినపరీక్షగా నడిగిరఁట. సమాన స్కంధులు సమయము దొరకినపుడు జాఱవిడువరుగదా! వారి యాస్థానకవీశ్వరులగు నెమలూరి వేంకటశాస్త్రిగారును ఈ సమస్యను పూరించిరఁట. వారు 'దృఢవ్రతైకతాభీష్ముని పెండ్లి...' కని పూర్తిచేసిరఁట. మన రాఘవశాస్త్రిగా రడిగినవా రబ్బురపడునట్లుగా

ఉ. గ్రీష్మములోన లగ్న మరిగెన్—;సమకూర్చెద నన్న భార్గవా
ర్భిష్మ దనూన కోప మతి శీతల మయ్యె—;బ్రతిజ్ఞ చూడఁగా
భీష్మను గాఁగ మాఱెఁ; దల పెట్టని వన్నియయు దాపురించె నా
భీష్ముని పెండ్లికి; ఏఁగి రఁట పిన్నలు పెద్దలు బంధు లందఱున్.

అని పూర్తిచేసిరి.

—: నోటికి మీాస మడ్డపడిన సమస్య :—

ఒకప్పుడు రాఘవశాస్త్రిగారు గుంటూరులో నొక మిత్రుని యింట భోజనము చేయుచుండఁగా ఆమిత్రుఁడు భోజనసమయములో అప్పటి తనపరిస్థితిని జూచుకొని

'నోటికి మాటిమాటికి వినోదముగా నరికట్టె మీాసముల్'

అని యొక సమస్య చేసి శాస్త్రిగారి కిచ్చెనఁట. వెంటనే శాస్త్రిగారు సరేంగితావగాహనము చేసి

ఉ. గాటపుఁగూర్మిఁ గంకణము గట్టిన దాదిగ మూఁడుమాసముల్
పాటిలుదాఁక క్షౌర మది భావ్యము గా దని యూరకుండఁగా
వాటముగాఁ బెరుంగుటను వారక భోజన వేళలందునన్
నోటికి మాటిమాటికి వినోదముగా నరికట్టె మీాసముల్.

అని చెప్పిరి. అన్నట్టు లామిత్రుఁడు వివాహదీక్షలో నుండెనఁట.

ఇట్టివే యవధానములలోను, ఇతర కాలములలోను బూరించిన సమస్యలు నూటికిఁ బైఁబడియున్నవి. తక్కిన సమస్యలు ప్రకరణాంతరమునఁ బ్రస్తావింతము.

—: అభయదానము :—

క్రోధన మార్గశిరము (1925) గుంటూరులో పిశుపాటి చిదంబరశాస్త్రిగారును, గౌరావఝ్ఝుల రామకృష్ణశాస్త్రి గారును అవధానము చేయవలె నని సభ చేసి (చూ. ౨౬ వ పుట) కార్యార్థులై యున్నవారు గాన ఆగ్రామపరిస్థితులను బట్టి నియోగి వైదిక కక్షులతో కొప్పరపువారివలన నేమైన (ఆనాఁడు వారిలో నొకఁడు రాఁగూరికి వచ్చియుండిరి గనుక.) సభ రసాభాసము పట్టునా ? యని శంకించుచు రాఘవశాస్త్రి గారితో హెచ్చరించిరఁట. అప్పుడు రాఘవశాస్త్రిగారు

కం. గుండియలు పగుల నేటికి ?
గాండీవోద్గత శర ప్రకాండముగతి ను
ద్దండవచః పాండితితో
దండింపమె యెట్టి కుకవితండము నైనన్ ?

అని యభయదానము చేసి మఱియు

శా. ఆ కల్లాడదు కొప్పరంపుఁగవి కీయగ్రంబునం ; దుగ్రవా
చా కల్లోలవతీ తరంగ రచనా చంచద్యశోవల్లరీ
వ్యాకీర్ణాఖిల దిక్తటుండ, నొకపద్యంబేని నా ముందటన్
వాకోఁ జాలక మారికాపురములోఁ బర్వెత్తి పోలే దొకో !

అని చెప్పిరి. దీనిని బట్టి మారాకాపురములో నొకప్పు డేదో యొక సంఘటనము కూడిన దని తెలియుచున్నది. ఆవిషయము:—

—: కొప్పరపు వారిపైఁ దాఁటిసిల్లుట. :—

అక్షయ సం. ర వైశాఖమాసములో కొప్పరపుఁ

గవులు కంబము, బే_స్తవారపుపేట లోనగు గ్రామములకు వచ్చి అవధా నాశుకవనాది ప్రదర్శనములు చేసి మార్కా పురమునకు వచ్చిరఁట. అక్కడ వారు తమ ప్రతిభావిశేష ములను బ్రాచుర్యముగాఁ జెప్పుకొని కోర్టుమునసఫ్‌గారివలన క్లబ్బులో నొక యాశుకవితాప్రదర్శనసభ యేర్పాటుచేయించు కొనిరి. ఈసభకుఁ బూర్వము వీరు విశేషముగాఁ దమప్రతిభ నుగ్గడించుకొనుటతోపాటు ప్రతికక్షులుగా నున్న తిరుపతి వేంకట కవులను, తత్పక్షమువారిని కొంచెము తూలనాడుచు వచ్చుటచేతను, ఆదినములు తిరుపతి వేంకట కవులపై నపరి మితాభిమానము గల దినము లగుటచేతను, వినువారిలోఁ జాలనుందికిఁ గొంత యేవగింతగాఁ దోఁచుచుండెను. దీనికిఁ దోడుగా మఱియొక సంఘటన గూడ నేర్పడెను. ఏమన ? భారతుల నృసింహశాస్త్రిలుగారును, రాళ్లభండి నృసింహ శాస్త్రిలుగారును మార్కాపురము వచ్చియుండి, కొప్పరపుఁ గవులు వచ్చియున్నా రని విని సంప్రదాయానుసారముగా వా రున్న బసకు వెళ్లి చూచిరి. వీ రాప్రాంతములో సుప్రసిద్ధ పండితులును, శిష్యవర్గము కలవారును గనుక వీరివెంటఁ గొంతమంది శిష్యవర్గముకూడ వెళ్లిరి. అప్పుడు వారికి, వీరికి నడిచిన సంభాషణలో మీ కేమి వచ్చు ? నన్న భావము కొప్పరపువారి ధోరణిలోఁ గాన్పించెనఁట. ఆవల విన్నవారి కుద్రేక ముదయించి వారిపాండిత్య మేపాటిదో పట్టి చూడ వలయు ననియు, ఈతరుణమున రాఘవశాస్త్రిగా రుండిన బా గుండు ననియు సంకల్పము గల్గెను. వెంటనే తడికమళ్ల

వెంకటప్పయ్యశెట్టి అనువర్తకుఁడు రహస్యముగా మనుష్యునిఁ బంపి రాఘవశాస్త్రిగారిని బిలిపించెను. అప్పుడు రాఘవ శాస్త్రిగారు శేస్తవారపుపేటలో నుండిరి. రాఘవశాస్త్రి గారును కంబము, శేస్తవారపు పేటలలో నున్నారు గాన నంతకు ముందే కొప్పరపువా రక్కడికి వచ్చి పోవుటయు, వారిని వీరిని దూలనాడుటయు, ఆతూలనాటలోఁ దాము గూడఁ బడియుండుటయు వినియున్నవారు గాన వర్తమానము రాఁగానే మార్కాపురము వచ్చిరి. వెంకటప్పయ్యశెట్టిగారు రాఘవశాస్త్రిగారిని బిలిపించిన విషయము బయటఁబడనీయ కుండ వారిని సత్రములో బసచేయించి, సరిగా సభాప్రారంభ సమయమునకుఁ బిలుచుకొనివచ్చిరి. సాయంకాలము 7 గంట లకు సభాప్రారంభము. ఆసభలో భారతుల నృసింహశాస్త్రిలు గారును, రాళ్లభండీ నృసింహశాస్త్రిలుగారును ఉండిరి. అవ ధానులు స్వవిషయము నుద్ఘాటించుచు సభ నావర్జనము చేసికొనుచుండిరి. ఇంతలో పెద్దసేల్వా వేసికొని ప్రభవలె రాఘవశాస్త్రిగారు ప్రవేశించుసరికి వారి నెఱిఁగినవా రంద ఱును రండి, రండి అని ఆహ్వానించిరి. వచ్చినరాకతోనే నలు ప్రక్కలఁ గలయఁ జూచి తన్నాహ్వానింపలే దని రాఘవ శాస్త్రిగా రాశువుగా

మ. నట దీశాన జటాటవీ పరిలుఠ న్నాగాపగా వీచికో
త్కట సంక్షుబ్ధ మృగాంక నిర్గళిత పాదవ్రాత మాధుర్య సం
ఘటనానేక సుపద్య గద్య రచనా కావ్య ప్రణీర్మాత న
న్నిట సత్కారము చేసి పిల్వరఁట కంశే? తల్లి! కాత్యాయనీ!

అని గాండ్రించి నిల్వఁబడిరఁట. అప్పుడు మునసఫ్‌గారు భారతుల నృసింహశాస్త్రిలవారిని జూచి 'వీ రెవరండి?' అని యడిగిరఁట. అడిగిన ప్రశ్నకు వా రేల? సమాధానము చెప్పవలె నని వెంటనే ఆశువుగా రాఘవశాస్త్రిగారే

చ. క్షితిప! భవత్సఖుండయి ప్రసిద్ధి వహించినవాఁడు, సర్వభూ
పతి మకుటీ మణి ద్యుతి విభాసిత పాదపయోజుఁ, డద్రిజా
సతి చరణార్చనాపరుఁడు, శాస్త్రవివేకుఁడు నై చెలంగు భా
రతుల నృసింహాపండితుఁడు రమ్యగుణోత్తర! మద్గురుండు సూ!

శా. పేరా? రాఘవశాస్త్రి, గాడెపలి యన్ పేరింటిపే, రింక మా
యూరా? రక్తనగాఖ్యపట్టణము, మాయుద్యోగమా? రాట్సభా
స్తారుల్ మెచ్చ శతావధాన కవితాసందర్భముల్ చూపి స
త్కారం బందుట, గద్దువాల్ నృపతియాస్థానంపు విద్వత్కవిన్.

(రక్తనగాఖ్య పట్టణము= ఎఱ్ఱగొండపాలెము.)

అని చెప్పిన మీఁదట వెంటనే మునసఫ్‌గారు ఈసభకు తా మగ్రాసనాధిపత్యము వహింపవలె నని సభాముఖమునఁ బ్రార్థించి శాస్త్రిగారి కగ్రాసనాధిపత్య మొసఁగిరి. సభలో నొకప్రక్క ఉత్సాహము పెచ్చుపెరుఁగ సాగెను. ఎట్లయినను శాస్త్రిగారిరాకతో కొప్పరపువారికి కొంత వాకట్టై అంతకు ముందటి ధోరణి తగ్గెను. అది చూచి కొందఱు మఱీ చెలరేఁగ సాగిరి. ఏదైనఁ గథ యిచ్చిన ఆశువులోఁ జెప్పుదు మని కవు లడిగిరి. చెన్నకేశవునిపైఁ జెప్పవలసిన దని సభ్యులు కోరిరి. (ఆయూరిలో సుప్రసిద్ధముగా చెన్నకేశవస్వామి వెలసియున్నాఁడు గనుక.) ఏవో నూఱు పద్యము లాశువులోఁ

జెప్పివేసిరి. ఆవల సత్కారమునకు పట్టి ప్రారంభింపఁగా అది యనుకొన్నంత కాక తేలిపోయెను. సభ రసాభాసము పట్టెను. సభ అట్లయినందులకు నియోగి వైదిక కక్షలు బయలుదేఱెను. ఆ కక్షాస్పర్ధలు బయలుదేఱిన తర్వాత అధ్యక్షోపన్యాస మొకటి మిగిలి యున్నది గనుక రాఘవ శాస్త్రిగారు తత్సమావేశమునకు సందర్భించి తాము చెప్ప వలసినది చెప్పి, మంచి యవకాశము దొరకినది కాఁబట్టి తత్పూర్వదినము తమ గురువులగు నృసింహశాస్త్రిద్వయమును దిరస్కృతిగా మాట్లాడినదియు, కంబము లోనగు చోట్లఁ దమ్ముఁ దూలనాడినదియు మనసులోఁ బెట్టుకొని యట్టె విదలించి పాఱవేసిరి. ఆ ఘట్టములోఁ జెప్పిన పద్యములే యీ దిగువ వ్రాయునవి.

చ. ఘటికకు నూర్లు వే లనుచుఁ గంబగు లోనగు పల్లెటూళ్ల కో
మటుల గృహాంగణంబుల రమారమి గంతులు వైచినంత దు
ర్ఘటమగు మారికాపురి జగజ్జనసేవ్యుని రాఘవేంద్రునా
కృతిమకు లోఁగ కేఁగఁగలవా ? కలవాస్తవముగ్ వచింపుమా !

శా. ఝాంకారించుట బొబ్బరించుటన విశ్వస్తుత్య కావ్యేశ్వరా
లంకారీకృత రాజరాడ్భవన లీలాఖేల దస్మన్మన
స్సంకోచంబు ఘటించునే ? తమదువేషాల్ మాని యీమీఁద ని
శ్శంకన్ శాంతము దాల్చి మీదయిన వాస్తవ్యంబు వాక్రుచ్చుఁడా !

ఉ. నేరఁడు సత్కవిత్వ మని నింద యొనర్చితి రంట ! మీ కదా
చారము గాఁగ నోపును విచారణ సేయక వ్యర్థవాక్కులీ
తీరునఁ బల్క; నేరయినఁ దేలికగా నిటు ముచ్చటింతురే ?
ధీరత గల్గెనేని తమధీబల మిప్పుడ వెల్లడించుఁడా !

(ఈ తర్వాత నింకొక పద్య మున్నది, జ్ఞప్తి వచ్చినపుడు చెప్పెదు మనిరి.)

ఉ. సత్కులమందుఁ బుట్టి, బుధసంఘము లెల్లెడ 'జోడు లేరు, వి
ద్వత్కవి సార్వభౌముఁ' డను పల్కులు పెక్కులు పల్కుచుండ న.
స్మత్కవితత్త్వ మేమయిన మాన్యుల గేలి యొనర్చనే? యి టీ
షత్కవనంబు మీయెడ విషంబుగఁ దోఁచెను బండితాళికిన్.

ఉ. వాద మ టందుకోఁ దలఁచి వచ్చినవారల? రండు; ఆ
మోదమె మాకు; మీ కది ప్రమోదమ కాదె? బుధేంద్రు లేది దు
ర్వాదమొ నిర్ణయింపరె? సువర్ణము కాఁకకు వెక్క దీయునే?
కా దని యూరకుండు టది గాదె? మృగాక్షిప్రసంగ మన్నిటన్!

ఉ. రాదఁట సంస్కృతంబు, కనరాదఁట వ్యాకరణప్రసక్తి, తా
మేదియొ చాటు చాటు వని యిట్టులె నాలుగొ మూఁడొ పద్దెముల్
పోఁదుడువంగఁ జిక్కినవి పొల్పుగ వ్రాయఁగలారఁ, దైన నీ
వే దయఁ జూతు వంట గదవే పదవే పదివేలు భారతీ!

ఉ. లేరటె సత్కవుల్? సుమ శిలీముఖ బాణపరంపరాహత
స్ఫార వియోగినీహృదయ పంకజ కుట్మల పాటన క్రియా
పార సమర్థనీయ రస బంధుర కావ్య ప్రబంధజాల వి
స్తార వినిర్మితుల్ సుకవితావనితా! పరితాప మేటికే?

సీ. ఎఱుఁగవే మే? నభస్సరిదంబు నిర్ఝరీ
కల్లోల సమత మత్కవితఘనత!
ఎఱుఁగవే మే? శరదిందు కలాశీర్య
దమృతప్రసార మా యాశుధార!
ఎఱుఁగవే మే ... ...
ఎఱుఁగవే మే ... ...

తే. ఎఱిఁగి యెఱిఁగియు యిటివంటి హేయమైన
వాదములపట్లఁ దగిలింప వచ్చునటవె ?
దుష్టవాదులతోడ సమష్టిఁ జేయ
వేత్తృత యడంగదేమె ? కవిత్వకాంత !

ఉ. నీమహనీయమౌ కరుణనే గణనీయత గాంచినట్టి యీ
మామక సత్కవిత్వ మను మంటను దూఁకినయంత దుష్కవి
గ్రామణులైన యీ శలభరాసుల మీసము లంటఁ గాల కే
లా ? మఱి పెచ్చు రేఁగు నబలా ! ప్రబలేశముఖామరార్చితా !

అని యిట్టిపద్యములే గాక మఱికొన్ని పద్యములుగూడ ఆశుధారలో గుప్పింపఁగా నియోగి కవులవారు గుంటూరిలోని వైదిక కవులను మనసులోఁ బెట్టుకొని యిట్లు చెప్పుచున్నట్లుగా నధిక్షేపింప నారంభించిరఁట. అప్పుడు కవులలోఁ బని యేమని చెప్పిన పద్యము లీక్రిందివి.

ఉ. అన్వయ వృత్తు లేవియొ, రసారస రీతు ల వెట్టివో, కవీ
శు న్వలపించు పద్ధతులసొం పది యెట్టిదొ చూడకే వివా
ద న్విపులం బొనర్చెడు బుధప్రకరంబులు మేర మీఱి; రిం
క న్వన లేల ? నీ దయయ కావలె నిక్కము తల్లి శాంకరీ !.

సీ. నిరపాయకరుల సంధించి ప్రక్కను జేరు
వీరు లేరేమె యార్వేలవారు ?

* * * * *

సీ. కంకంటి పాపరాట్కవి యన నిటువంటి
కొంటెకైతల నల్లుకొనునటమ్మ ?
శ్రీనాథ కవిరాజ శేఖరుం డిటువంటి
తుంటరివాదమ్ము లంటునమ్మ ?

తిక్కన కవిరాజ ధీరుఁ డీమాత్రంపు
ధోరణులందుఁ గాల్ ద్రొక్కెనమ్మ?

* * * * *

సీ. బట్టుమూర్తి వచించు పద్యార్థపూర్తిలోఁ
దల వంచఁజేయు పెదన్న కన్న
కృష్ణరాయ సభాగరిష్ఠుఁడై కీర్తిని
గన్నట్టి రామలింగన్న కన్న
సౌకర్యపదవిలాసన్యాస కౌశలి
యౌ కూచిమంచి తిమ్మన్న కన్న

* * * * *

సీ. చించి వేయంగ శేషించిన పద్యంబు
నల్లువాఁడేఁటవె శతావధాని?
అవధాన శబ్దమం దర్ధ మెఱుంగని (అర్థము=సగము)
యతఁడఁటే మేటియష్టావధాని?
ప్రాస యతి చ్యుతుల్ భావం బెఱుంగని
కవి యగునే శతఘంట సుకవి?

* * * * *

చ. దొరకెఁ గవిత్వకాంత, పడద్రొబ్బుఁడు, గిచ్చుఁడు గిల్లుఁ డంచు నా
గరకతఁ జూపఁగాఁ దగిన కావ్యవిదగ్రణులకౕ వరింప సం
బర మని యెంచినావఁటవె? భాగ్యము దక్కెను పొమ్ము, కల్గె హె
చ్చరిక తొలంగినందులకుఁ జక్కని శాస్త్రి కవిత్వకన్యకా!

అని యీప్రకారముగా నాఁటి సభాంగణమునఁ దత్ప్రకరణ
మును ముగించిరి. ఇందులో ఆయాయిపద్యము లసంపూర్ణ

ముగా నుండి జ్ఞాపకము చేసికొని చెప్పుదు మనిరి. కాని యవి యట్లే నిలిచిపోయినవి.

—: రాఘవశాస్త్రులోరు ... ఫెబంతమాసి ! :—

సాధారణముగా కవీశ్వరులయొక్క స్వరూపస్వభావములలో స్వభావముతోపాటు స్వరూపముగూడ నిట్లని నిర్ణయించి చెప్పఁగల యాధారములు దొరకుట కష్టము. స్వభావము, వారి రచనలనుండి తెల్పుకొనవచ్చును. స్వరూప విషయములో వారు కావలె నని చెప్పికొనరు. అట్టియవకాశములు గూడఁ గల్గకపోవచ్చును. అందుచేత స్వరూప నిరూపణములో నేల విడిచి సాము చేయవలసి వచ్చును. రాఘవశాస్త్రిగారి విషయములో నట్లుగాక తన్నిరూపణమునకుఁ దగిన యవకాశములు కొన్ని గలవు. వీరరాఘవశాస్త్రిగా రాజానుబాహువులు. పేరునకుఁ దగినట్లు వీరత్వము, ఆజానుబాహుత్వము చక్కఁగా సరిపోయినది. వీ రొక్కరే గాక వీరికుటుంబములోనివా రందఱు గూడ సన్నగోలున ఎత్తరి మనుష్యులు. వీరరాఘవశాస్త్రిగా రాజానుబాహు విగ్రహు లన్నందులకు నిదర్శనముగా నితరులు వ్రాసిన వ్రాఁతలే గాక వారు గూడ నొకప్పుడు స్వయముగా ఆ విషయము వ్రాసికొని యున్నారు.

అక్షయ సంవత్సర (1926) శ్రావణములో శాస్త్రిగారు తమకు ద్వితీయ వివాహమునకుఁగా చిత్తూరుజిల్లాలో నేదో యొకగ్రామమునకు కన్యాన్వేషణార్థము వెళ్లఁగా

ఆకన్యక వీరిని జూచి 'చాలపొడవుగా నున్నాఁడే' యని యన్నదఁట. ఆమాట వీరిచెవిని బడఁగానే ఒకకాగితము దీసికొని

కం. పొడ వనిన నిజమె, విద్యకుఁ
బొడవే, కీర్తికిని బొడవె, బుద్ధికిఁ బొడవే,
పొడవే విత్తమునకు, నిఁకఁ
దొడవులకును బొడవె మానుదువో! పూనుదువో!

అని వ్రాసి ఆపిల్లకుఁ బంపిరఁట. (మఱికొన్ని పద్యములుకూడ వ్రాసిరి.) ఇట్లు వారు స్వయముగఁ దమస్వరూపమును జిత్రించు కొనుట కీయవకాశ మేర్పడినది. ఇఁక నితరులమాట :—

నెల్లూరు జిల్లా పొదిలె తాలూకా పోలేపల్లి అగ్రహారము మేడవరము సుబ్బరాయుఁడు అను యువకవి రాఘవశాస్త్రిగారియెడఁ దనకుఁ గల యున్నత భావముతో చంద్రశేఖరశతకములోవలె గ్రామ్యజను లనుకొనుచున్నట్లుగా ఆభాషలోనే

ఉ. రాగవ శాస్తులో రడుగొరా! అద నూడి! పెబంతమాసి, బా
లాగవ మంట కైతలొ, సెలాకు పరీచ్చఁట! బుద్ధిమేద యే
మో గడె కొక్క పొచ్చకము వున్నటె వుండి రసిస్తడంట! అ
ఛ్ఛె! గదవాలకాడ పెదపెద్ద పెసంగము సేస్తఁ డంటరా!

అని తమాషాగా పద్యము వ్రాసెను. అకృత్రిమభావములతో అనాగరకులైన జానపదుల సంభాషణ మిట్లే యుండఁబోవును గదా! ఇట్టి భావములతో బయలుదేఱినదే చంద్రశేఖర శతకము. మచ్చున కందునుండి యొక పద్యము.

ఉ. 'జోసుఁడు మొన్న గేబలను నూటిగ నూసె; మనింటిదాంది మా
నూసె; బలైన మూత్రమట! సోతెట నచ్చుతరం; మ దందులో
మేసమటా; యిరిద్దట! వు మేసరబొట్లది వంగడం; సరే
మా సదినా' రటందురు ప్రమత్తులు మూర్ఖులు చంద్రశేఖరా!

అని యీప్రకారముగా శతక మంతయు వ్రాయఁబడినది. రాఘవశాస్త్రిగారిని గుఱించి జీవితకాలములోనే తమాషగానే కానిండు, యువకవి అట్లు పద్యము వ్రాయుట గొప్పతనమే గదా!

ఇఁక నేను—సమయము దొరకినచో నెవ్వరైన అవసరమును జాఱవిడువరుగదా! బలవంతముగాఁ గాకుండ అవసరప్రాప్తముగ అవకాశము దొరకినచో నిఁకఁ జెప్పవలసిన దేమి? రాఘవశాస్త్రిగా రెప్పుడైన మాయింటికి వచ్చినపుడు వారు తమాషాగా మాట్లాడువారు గాన వారితో మాట్లాడునపుడు మనకును తమాషాగానే యుండును గాఁబట్టి వారు మడుఁగుగట్టుకొని వంటయింటిలోనికి వచ్చుచుండఁగా 'శాస్త్రిగారూ! మీరు మాయింటికి వచ్చినచో మీకు తలవంపులు తప్పవు గదా!' అని యనుచుండెడి వాఁడను. వారిది మా మేనమామల భారద్వాజసగోత్రము గావున వరుసాడినట్టు గూడ నయ్యెడిది. మే మున్నయింటి వంట యింటివాకిలి అంత యెత్తుగా లేకుండెను. రాఘవశాస్త్రిగారి బుజాల దగ్గఱికి వచ్చునంత యెత్తులో నుండెను. అందుచేత నే నామాట అనఁగానే నవ్వుచు 'నిజమే శాస్త్రీ' అని వంగి

వచ్చుచు తనపాడవును గురించిన గాథ యేదో యొకటి చెప్పి నవ్వించెడివారు.

ఒకప్పుడు రాఘవశాస్త్రిగారు చెప్పులు కుట్టించుకొనవలె నని యొకమాదిగవానిని బిలిచి చెప్పులు కుట్టు మని ఆది యిచ్చిరి. వాఁడును ఉరామరికలు చూచుకొనియే బేరము కుదుర్చుకొని వెళ్లి పోవుచుండెను. అప్పుడు నే నుండి "ఒరే నీవు చెప్పులు కుట్టుకొని వచ్చిన తర్వాత అయ్యగారు తీసికొన్నచో సరిపోయెఁగాని లేకపోయినచో తిరుపతికి పోవలసి వచ్చును. 'రైల్చార్జీ దయచేయ' మని అడుగురా' యని యంటిని. అందఱు పక పక నవ్విరి. రాఘవశాస్త్రిగారును 'తమాషా మనిషి' గనుక రోషపడక ఉబ్బి ఉబ్బి నవ్వసాగిరి. నిజమున కాచెప్పులు వేంకటేశ్వరస్వామికిఁ దప్ప మఱెవ్వరికిఁ బనికి వచ్చును?

రాఘవశాస్త్రిగా రెంత వెడల్పు దోవతు లని కొని కట్టుకొన్నను కాల్నిండ బట్ట ఉన్నపాపానఁ బోవుట లేదు. ఏది గూడ మోఁకాళ్ల క్రిందికే. అది చూచి నేను ఆయనను నవ్వింపవలె నని బ్రహ్మదేవునిదే తప్పుగా

మ. చతురాస్యుం డెటువంటి నేరుపరియై సాగించినన్ గూడ నం
దతుకుల్ తప్పవు చూడు! రాఘవకవి ప్రాగ్దేసరాకార దీ
ర్ఘతకున్ దగ్గ కవిత్వమున్, బ్రతిభయున్ గల్పించి, కాల్నిండ నూ
ర్జితమౌ వస్త్రము సేయు మగ్గమును సృష్టింపంగ లేఁడాయెఁగా!

అని యీపద్యము వ్రాసి వినిపించితిని. అది విని రాఘవశాస్త్రి

గారు వినోదపురుషులు గనుక 'మాగొప్పతన మట్లున్నది శాస్త్రీ!' అని చెప్పుచు నానందించెడివారు.

తారణ సం. రాపాఢ బహుళము (1944 జూన్) లో నేను గద్వాల వెళ్లినప్పుడు వారి వాఙ్మయమునంత ఒక ముఖమునకుఁ దేవచ్చునేమో చూతమని 4, 5 దినములు ప్రయత్నించి, అంతమాత్రముతో అది తెమలునట్లు తోఁపక పోఁగా అప్పటికి సెలవు దీసికొని వెళ్లవలె నని ఆ నాల్గయిదు దినములలోఁ బరిశీలించిన వారికవితా విశేషములను జూచి కల్గిన యానందముతో వ్రాసిన ప్రశంసా పద్యములలో నొక పద్యము వారి కవితాస్వరూపముతోపాటు నిజ స్వరూపమును గూడ నిరూపించునదిగాఁ బడినది. ఆపద్య మిది :—

చ. నిలిచినఁ గూరుచుండిన న సేసలలోపల రెండుమూఁడు జే
నలకును జైపయిన్ మిగు లనన్ దగు మూర్తి నొసంగినట్టి యా
పలుకువెలంది పెన్మిటి యపప్రథపా ల్పడకుండ నీకు కై
తలకును నట్టి కీర్తి నిడి ధన్యత గాంచెను జూవె సత్కవీ!

—: పొగబండి ఆలస్యముగ నడిచినదఁట :—

1927 అక్షయసంవత్సరములో శాస్త్రిగారు నంద్యాలలో సంస్కృతపాఠశాల చెప్పుచు ఒక సంవత్సరకాల ముండిరి. అప్పుడు వారికి గొప్పజాడ్యము వచ్చి రక్తక్షీణమై శరీరమంతయు పండఁబాఱి, నీరు మాఱినఁగాని నయము గా దని, స్వగ్రామమునకుఁ బోవుచు రైల్పుయాణము చేసిరి. అప్పుడీచిన్నబండి (మీటర్ గేజి) గంటకు 10, 15 మైళ్ల వేగమున

నడుచుట గొప్పగా నుండెను. అందుచేతనే యీ బండి లంకణాలబోటని, లంకణాల కుక్క అని, కుంటికుక్క అని, కుంటి గుఱ్ఱ మని యీ మొదలుగాఁ గొన్ని బిరుదావళులను సంపాదించి యుండెను. చిత్రము!! ప్రకృతము (1944) గుంతకంట్రినుండి బెజవాడకు 11 గంటలలో జరుగు ప్రయాణ మా దినములలో రెండు దినములు (48 గంటలు) గడచినను గడచిన దే! అదేమో అప్పు డట్లుండెను. చిన్న యింజన్లు! చిన్నపట్టాలు!! శాస్త్రిగా రుదయము నంద్యాలలో ఎక్కి సాయంకాలమునకుఁ గాని మార్కాపురము చేరలేకపోయిరి. ఇంతకు రమారమి 80, 84 మైళ్లే! ఆదినములలో అంతంతసే పొక్కొక్క స్టేషనులో ఎందు కాఁగుచున్నదో దైవమున కెఱుక! అంతసేపు కూలఁబడి కూలఁబడి ప్రాణాలు విసిగి శాస్త్రిగా రంత జబ్బులోఁగూడ ఆ లంకణాలబోటుపై నొక సీసపద్యము చెప్పిరి.

సీ. కనుపడు రాతితోఁ గదలాడు చెట్టుతోఁ
జేసిన ముచ్చటల్ చేసి చేసి
వచ్చిన గుంటకై పోచ్చిన మిట్టకై
యాఁగుచు సందియ మంది యంది
యెగుమతి దిగుమతియే లేనిచోటుల
నథముల పనులకై యాఁగి యాఁగి
యెదురైన ప్రతిగూడ్సు కొదిఁగినచోటుల
వచ్చువారికి సలా మిచ్చి యిచ్చి

తే. ఇంక మ మ్మెంతకాల మీహింసలోనఁ
గూలఁ ద్రోయుదు ? తీవ్రత కొంచె మూని

కూరుచున్నట్టి మమ్ముసు గొంపఁ జేర్చి
కుదుట పడనీవె నంద్యాల కుంటికుక్క !

ఆలస్యముగాఁ బోవుటకుఁ గారణా లవియఁట! విసుగు పుట్టవచ్చు, పద్యము వ్రాయ వచ్చుఁ గాని అందిపుచ్చు కొన్నట్టుగా అతికిపోయెడిభావము లంతలోనే అల్లఁగల్గుట అందఱకు అందుబాటులోనిది గాదు. ఇట్లే ఒకమాఱు ఇంజక్షన్ సూదిపై రెండు సీసపద్యములు చమత్కారముగాఁ జెప్పిరి.

—: ఇంజక్షన్ సూది. :—

ఇంజక్షన్ సూదిపై రెండు సీసపద్యములు చెప్పినా రన్నచో ఇంజక్షన్ సూదినిగుఱించి యేమి చెప్పవచ్చునో! అందులో రెండు సీసపద్యములు!! సద్యస్కల్పన!!! ముందుగా విచారించినను భావములు స్ఫురించుట అరిది. పద్యరచనలోనే ఆభావముల నప్పటికప్పు డిమిడించుటకు లోకోత్తరప్రతిభ యుండక తప్పదుగదా! ఇతరుల కెట్లున్నను శాస్త్రిగారి కిట్టివి మంచినీళ్లప్రాయమే!

బహుధాన్య సం॥ర కృష్ణాష్టమికి (1938.) గద్వాలలో కలరావ్యాపకమై యందఱు సూదిమందు వేయించు కొనవలె నని చాటించి కృష్ణారెడ్డిగారి బంగళాలో సూది మందు వేయుట కేర్పాటు చేసిరఁట. డాక్టరుగారు వచ్చులోపల పిన్నలు, పెద్దలు, ముసలి, ముతక— అందఱు వచ్చి బంగళానిండ క్రిక్కిఱిసి యుండిరఁట. అట్టిసమయమున రాఘవశాస్త్రిగారుగూడ వెళ్లిరఁట. ఇంతలో డాక్టరుగారు వచ్చి

రఁట. వచ్చి సూది దీసికొనఁగానే సూదితోఁ గ్రుచ్చుదు రని భయస్థులుగా నున్న పిల్లలు, పెద్దలు ఒక్కమాఱు కెవ్వునఁ గేకలుపెట్ట నారంభించిరఁట. ఆదృశ్యము కంటఁబడిన తర్వాత మన రాఘవశాస్త్రిగా రూరకొందు రన్నమాట యేమి మాట ? వెంటనే కాగితము, కలము దీసికొని ఆసూదియొక్క ప్రభావము నిట్లని వర్ణించి తగినవారికి వినిపించి నవ్వించిరి.

సీ. ఆట లాడెడి బిడ్డ లదిరి యే మెఱుఁగక
గగ్గోలుపడుచు దుఃఖమున మునుఁగ
ఇచ్ఛావిహారాల కెనయు బాలిక లంత
భయకంపములకుఁ దావలము గాఁగ
సంతోషపడుచు దిసంతులు గొట్టెడు
చిన్ని కుఱ్ఱలకును వన్నె దఱుగ
లాలనఁ దిరుగాడు పాలిదాసీజన
మూరడింపఁగలేక యుస్సు రనఁగ

తే. బంగళా క్రింద, మీఁద నీపగిది గంట
గోలఁ జేసిరి నిన్నుఁ గన్గొనినయంత
నవ్య మారీ ప్రబాధావినాశ కరణ
సాధనీభూత! సౌఖ్యప్రసాది! సూది!.

సీ. తను డాఁగి చెప్పవ ద్దనుచు దాసులతోడ (దాసీలు)
బతిమాలు బాలికోవితతు లొకట
చిక్కించుకొన నొక్క గ్రుక్క ద్రిప్పక కేక
వేయుచు వెఱఁగందు బిడ్డ లొకట
తప్పించుఁ డని తల్లిఁ, దండ్రి, నన్యుల వేఁడి
గోలఁ గావించెడు కొమిరె లొకట

విధి దప్పి యిం కెటు వెళ్లలే మని లోనఁ
గంపించుచుండిన కన్య లోకట

తే. తాలుమా ఝైరి, నీయవతార మింత
భయము గలిగించె నీప్రభావం బయారె!
నవ్యమారీ ప్రబాధావినాశకరణ
సాధనీభూత! సౌఖ్యప్రసాది! నూది!.

—: పాండిత్యహీనాః కవయో భవంతి ? :—

లోకములో తిన్నయిల్లు గ్రుద్దలించు మహానుభావులు కొంద ఱుందురుగదా! అట్టి గణములోఁ జేరినవ్యక్తియే యొకఁడు తనయశక్తతకు వగవవలసి యుండియు వగవక, తా నొరుల నాక్షేపించినది తనకే బెడిసి కొట్టుననియైనఁ దలఁపక, తాను దేనిని తూలనాడుచున్నాఁడో దానినే (కవిత్వమునే) తా నవలంబించి, తన కడుపుమంట నీ క్రింది శ్లోకముగా వ్రాసెను.

శ్లో. పాండిత్యహీనాః కవయో భవంతి,
కవిత్వహీనా శ్చ పురాణభట్టాః,
పురాణహీనాః కృషి మాశ్రయంతి,
భగ్నాః కృషే ర్భాగవతా భవంతి.

అని. కవిత్వము చెప్పలేని పండితుఁడు 'కంచుకం నిందతి శుష్కస్తనీ నారీ' అన్నట్టు కవీశ్వరునిఁ జూచి సహింపలేక పోవుటయు, కడుపులోనిమంట యెట్లో వెళ్లఁగ్రక్కుటయు నిది సహజమే గదా! గురిగింజ తన క్రింది నలు పెఱుఁగదన్నట్టు వారిని వీరు, వీరని వారు పేర్లు పెట్టుకొనుచుండుటయుఁ

గ్రొత్త గాదు. పాండిత్యము లేనివారు కవు లగుదు రని, అటు కవిత్వము చెప్పలేనివారు పురాణము చెప్పుకొనువా రగుదు రని, అది చేతఁ గానివారు కృషి (సేద్యము) చేసి కొందు రని, దానిలోను బనికి మాలినవారు భక్తు లగుదు రని పై శ్లోకాభిప్రాయము. ఆశ్లోకమును మాత్రము వ్రాయఁగల ఆకవి అంత మాత్రముతోఁ దనపాండిత్యము బైట వేసికొన్నాఁడు, అయిపోయినది.

ఈ శ్లోకమును జూచిన తర్వాత 'ఇంతకంటె అవివేక మున్నదా? కవీశ్వరు లంత పాండిత్యహీనులే యైనచోఁ దన కీ మాత్రమేని జ్ఞానభిక్ష పెట్టినవా రెవరు? ఆ కవీశ్వరు లేగదా! ఈమాట అన్నవాఁ డెవఁడో వట్టియవివేకి' యని నాల్గు చీవాట్లు పెట్టుచు ఒకసభ్యుఁడు

శ్లో. పాండిత్యహీనాః కవయో భవం తీ
త్యేత న్మృషావాక్య మనార్యసృష్టమ్,
య ద్యేతదే వార్యపదోదితం భవే
త్పురాణ కావ్యార్థ కృతః కి మీదృశః ?

అని వ్యాస వాల్మీకి కాళిదా సాది మహాకవులకుఁ గూడ అప్రతిష్ఠను దెచ్చిపెట్టు నీయవ్యక్త ప్రసంగమును ఖండించి ఈ శ్లోకమును అసభ్యరచనక్రిందఁ గట్టివేసినాఁడు. ఈ శ్లోకమును నేర్చుకొని కొంద ఱశక్త దుర్బలులు ప్రస్తావము వచ్చిన చోట్ల నెల్లఁ దమకడుపు లోని మంట వెళ్లఁగక్కుచుందురు. ఇది పూర్వగాథ.

ఇఁక ఉత్తర గాథ :— ఈ ప్రకరణములో వీరరాఘవ శాస్త్రిగారు వీర విక్రమ మొనరించుట కవకాశము గల్పించిన వాఁడను నేనే యైనాను. నేను గ్రంథకర్త ననిపించు కొనవలె నన్న ఆదినములలో 'కవితారచన' అను చిట్టి పొత్తము నచ్చువేయించి దాని కొక యావిష్కరణోత్సవ మని ప్రభవ సం. ర కార్తిక బ. ౧ర మంగళవారము (8-11-1927) నంద్యాల విక్టోరియా రీడింగు రూములో ఒక సభ యేర్పాటు చేసితిమి. ఆసభకు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగా రధ్యక్షత వహించిరి. గ్రామములో నున్న నల్వురు పండితులు బ్రహ్మశ్రీ గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు, బ్రహ్మశ్రీ బండ్యాత్మకూరు రామాశాస్త్రి గారు, వారి కుమారులు శివశాస్త్రిగారు, అనుముల వేంకట శేషకవిగారు, గౌరావఝ్ఝల సీతారామశాస్త్రిగారు సభ నలంకరించిరి. వీరరాఘవశాస్త్రిగా రప్పుడు చాల జబ్బులో నుండి సభకు రాఁజాలినస్థితిలో లేకున్నను బలవంతము చేసి పిలుచుకొని పోయితిమి. సభలో మాట్లాడవలసిన నల్వురు మాట్లాడిరి. రామాశాస్త్రులుగారు లేచి మాట్లాడుచు ఉప క్రమించిన యుపక్రమణములోనే 'పాండిత్యహీనాః కవయో భవంతి' అని యవతలిగీ యెత్తుకొన్నచోఁ దమకే తగిలి వచ్చు ననియేమో అంతదాఁకఁ బోక మొదటిపాదములోనే ప్రకరణ మారంభించి మొత్తముమీఁద స్తోల్లుంఠనము గానే యుప న్యాసము సాగించిరి. ఆశ్లోక మసమర్థులైన కవులను గుఱించి వ్రాసినదే యయినను ప్రస్తుత రంగములో నడిచిన ధోరణి

అట్లు గాక అన్యథా నడిచినది! సభలో ఆమాటను విన్న తర్వాత అంత జబ్బులో నుండి కూడ వీరరాఘవశాస్త్రిగారు కవికులమున కంతటికిని తలవంపులు ఘటిల్లెనే యని అప్పటి కప్పుడు వ్రాసిన పద్యములతోఁ దగిన సమాధానము చెప్పి ఆయా వేళ మఱఁగినంతవఱకు నెట్టి వీర విహార మొనరించిరో చూడుఁడు! నిజమైన యభిమాన మున్నవాఁడు పౌరుషవంతుఁ డేమి చేయఁడు? ఆ సభనాఁడు వ్రాసినవియు, ఆవల ఆయా వేళ మఱఁగునంతవఱకును రచించినవియుఁ బద్యము లన్నియు నొకమాఱు చదువుదము.

మ. పాండిత్యంబున హీనులే కవులుగా భాషించి విద్వత్సభా
ఖండప్రాభవ సన్నిధానమునఁ బ్రేంఖత్కీర్తి నాసించి ని
ల్చుండన్ గోరితిరేమొకో? జగతి నేయోగ్యతరుండైన నీ
గండాగొండినుడిన్ వినన్ దలఁచునే? కాసంత సైరించునే? ౧

మ. హృదయంబం 'దిఁక నొక్కమా' అనుదునా? యీమాట నే'యంచు గా
ఢ దయావిష్కృతిఁ బాఱఁ జూచి యను; మెట్లా? పాండితీహీనులే
గద కవ్యగ్రణు! లుగ్రలోచన సమీక్షాదక్ష దాక్షాయణీ
పద సేవాత్త కవిప్రపంచ మిఁకఁ జెంపల్ వేయ నుంకింపదే? ౨

కం. అతిలోక సకల వాక్య, శ్రుతి శాస్త్ర షడంగ ధర్మ సూక్ష్మ రహస్య
స్థితి దెల్పు కృతులు కవివా, క్ప్రతతులె; పాండిత్యహీనులా వారల్? ౩

శా. పాండిత్యం బొకయింత లేక కవియై భాసిల్లు నన్నన్ లస
త్కాండానల్ప కలా విలాస మెఱుఁగంగా లేక యుద్ధంబునన్
జండాటోపముఁ జూపు యోధునివలెన్ జానొప్పునే కాని యా
జెండాగుడ్డను నిల్వరించు నెటు శాస్త్రీ! యట్టిరా సత్కవుల్? ౪

మ. సరసంబై చతురార్థ శబ్దయుతమై శయ్యాన్వితంబై యలం
కరణావిష్కృతమై ధ్వనిప్రథితమై గంభీరవాగ్గుంఫనా
కరమై పొల్చు కవిత్వ మల్లునతఁ డొక్కండే కవీంద్రుండు నాఁ
బరగున్; గ్రామ్యపదంబు లల్లుకొను యంబ్రహ్మల్ కవిబ్రహ్మలే? ౫

ఉ. అందఱ నొక్కగాటఁ బరిహాసముగా సభ కెక్కి మీరువా
గిందరతోడఁ జేర్చితి; రి టీవచనం బిపు డున్న సత్కవీ
డ్బృందము నెల్లఁ దాఁకెఁగద! యెల్లకవుల్ పరిహాస పాత్రులై
యుందురె? పాండితిం గఱప నొజ్జలు మీ కెవరయ్య? ధీమణీ! ౬

మ. కవు లన్నన్ మతి శాస్త్రపున్ రచయితల్, కావ్యార్థవన్నాటక
ప్రవిధా నైక రసాధిదేవతలు; చెప్పన్ జూప నానాజగ
ద్వ్యవహారప్రవిజృంభమాణ పదవీ వ్యాహార ధీ బోధనా
నివహోపాయ పరాయణుల్! కవులు పాండిత్యంబునన్ హీనులో? ౭

ఉ. ఏకవిచంద్రులన్ జగతి నీ వవలోకనఁ జేసి యుంటివో
లోకము లెల్లఁ బొ ల్లనుటలో సభ కెక్కితి; వయ్యయో! కళా
నోకహ నాకుజన్మ ముఖ నూతన నైగమ శాస్త్ర భాష్య సం
ధా కుశల ప్రతాన గమనం బయినన్ బరికింపవైతివో! ౮

కం. కల రెవరో కుకవీంద్రులు,
చలి విడిచి రటన్న నెంత సంతోషం బీ
పలువురకుఁ గలుగు? కవు లన
నిలలోఁ బాండిత్యహీనులే యని యనెదే? ౯

శా. పాండిత్యం బన నంతు లేని దగు; నాభోగంబునం దెంత వా
క్ప్రౌఢుం డైనను హీనుఁడే; తమరు నాచందంబువారే గదా!
రం డాహీనత మీకు నబ్బుఁ; గవి సామ్రాజ్యంబు వీక్షింపుఁ; డొ
క్కండున్ మీనుడి కప్ప మా అనఁడు; సంఘం బెల్ల శ్లాఘింపదే? ౧౦

ఉ. 'కొంద' అటన్న యట్టి పలుకుల్ వెలిఁ బుచ్చుమి కంప మాటచే
నందుర ? లేక కావలయు నంచునె మానితిరా ? ప్రమాదమై
చిందిన దన్న సమ్మతమె; చిత్తవిధానమె యైన నీసభా
మందిరమందుఁ బాండితిని మాని కవిత్వ మెట్లో వచింపుమా ! ౧౧

ఉ కల్లరిమూఁకలం గలిసి కాలము పుచ్చెడివారు గాన నే
పిల్లలొ కించి దీర్ష్యఁ గొని పెద్దతికంబును వీడి; రీరలో
యెల్ల సుకావ్యముల్ చదివి, యిందనుకన్ మని, రచ్చ కెక్కి రా
ద్వల్లభ మస్తకస్థగిత పాద కవీశుల నీసడింతురో ? ౧౨

ఉ. ఉన్న కళాప్రపంచమున నొప్పని తప్పని పీఁకులాడి యే
చిన్నియ గుర్తెఱుంగకయ చేసితి శాస్త్రిపరిశ్రమం బటం
చు న్నటనంబు పండితుఁడు సొంపుగఁ జేయును; సత్కవీశుఁ డే
చిన్నియ కైన నాద్యుఁ డని చిత్తమునన్ గమనింపు మో బుధా ! ౧౩

శా. ఆతారార్కము నిల్వఁగాఁదగిన శయ్యాలంక్రియా పాక భా
వాతీతాచ్ఛ రసానుషంగ కవితాహంభావ సంభావనా
ధీత ప్రస్ఫుట కీర్తి శాస్త్రి రచనా దేదీప్యమానుం డెవం
డాతం డే కవి! హీనుఁడో! ఘనుఁడొ! లోకాతీతుఁడో! ఖ్యాతుఁడో!

మ. ప్రతివీరాఖిల పండిత ద్విప శిరః ప్రత్యగ్ర ముక్తాఫలా
ప్రతిమాన ప్రతిభావిలాసి నఖర ప్రాలంబి దోర్విక్రమో
న్నత పంచాననుఁడై చెలంగిన జగన్నాథుం డజాండస్థభూ
పతియై పండితరాయ లయ్యెఁ; నతఁడున్ బాండిత్యహీనుండొకో ? ౧౫

మ. ఉదయాస్తాచల మధ్యభాగ గత సర్వోర్వీశ విద్వత్సభా
స దశేషస్తుత వాగ్విచిత్రరచనా సామ్రాజ్యపారంపరీ
విదితాజాండ కరండ మండన రసావిర్భూత నిర్భీత సం
ప దుపన్యాసుఁడు కాళిదాసుఁ, డతఁడున్ బాండిత్యహీనుం డొకో ?

మ. జగదాహ్లాదక రాత్మశోధన చిరస్థాయిప్రసంగస్ఫుర
న్నిగమాధిష్ఠిత తత్త్వమార్గగత నిర్ణిద్ర ప్రభావోదయ
త్సుగమాద్వైతము దేశదేశములలో శోధించి వెల్గించు శ్రీ
భగవత్పాదుఁడు శంకరార్యుఁ, డతఁడున్ బాండిత్యహీనుం డొకో ?

శార్దూల మాలిక:— ౫౨ గీట్లు.

వ్యాసుం డన్నఁ బురాణవక్త, అతఁడా ? పాండిత్యహీనుం ! డిఁకా
భాసుం డన్న మహాకవీంద్రు, డతఁడా ? పాండిత్యహీనుండు ? వా
గ్వ్యాసంగుండగు భట్టబాణుఁ, డతఁడా ? పాండిత్యహీనుండు ! దే
వీ సంపూర్ణ దయానులబ్ధ కవితా విద్యోతి తోద్యద్యశ
శ్శ్రీ సంప త్పరిపూరి తాఖిల దిశా సీమంతినీ ధాతరు
డ్వాసుండై నవ నాటకోదిత కవిత్వామూల్య సౌశీల్య శో
భా సంభూతుఁడు కాళిదాసుఁ, డతఁడా ? పాండిత్యహీనుం ! డటుల్
ధీ సంశోధిత ధారణాద్యమల వృత్తిప్రోద్యమానైక సం
ధా సంగ్రాహ సమగ్ర శాస్త్రి కవితాంతర్వేగ వాగీశుఁడై
శ్రీ సమ్రాట్పదభాక్తురుష్క నృపపుత్రీరత్న పాణిగ్రహో
ల్లాసం బందుచు సేతు శీతనగ మధ్య ప్రోద్యమా నాఖిలో
ర్వీ సంసద్గత శత్రుపండిత గజగ్రీవాగ్ర జాగ్ర న్మద
గ్రాసంగ్రాహ విలంఘ్యమాన విచల త్కంఠీరవుండై కృతి
న్యాసం బద్భుతరీతిఁ జేసిన జగన్నాథుండు నానాకళా
భ్యాసం బుండిన శౌండుఁ, డా కవియొకో పాండిత్యహీనుండు ? కై
లాసాంతర్గత వాసమున్ వదలి లీలా బ్రహ్మచర్యాశ్రమ
శ్రీసంతర్పిత ధారణీవలయుఁడై శ్రీ షణ్మత స్థాపనన్
దా సంపూర్ణ గురుత్వ మంది ఘన విద్వ ద్వైదికాద్వైతియై

వాసిం గాంచిన యాదిశంకరుఁడొకో పాండిత్యహీనుండు? వా
ణీ సందేశ నటాయమాన రచనా నిర్నిద్ర భద్రాసనుం
డై సప్తాశ్వ మహాకులాభరణ రామానంద కావ్యామృతం
బే సంధించిన వామలూరుభవ కావ్యేశాను విద్వద్వచో
భ్యాసం బాదిమకీర్తిఁ గాంచె, నతఁడా పాండిత్యహీనుం? డిఁకే
వో సందర్భము లేల? త్వాదృశుల కీ సోల్లుంఠన ప్రక్రియా
భ్యాసోదగ్ర సమగ్ర వాగ్రచన నేర్పం జాలి రెవ్వారయా?
రోసం బొక్క మొగిన్ నిగుడ్చి కినుకన్ రోదస్యశేషాష్టకా
ష్టా సంభృన్మద కుంభి శ్రోత్ర కుహరోచ్చైర్నాద మర్యాద వా
చా సందేశ మొసంగి యద్వయ యశశ్ఛన్నావనీవ్యోములై
త్రాసం బెట్టిరియో యెఱుంగని మహాధన్యాత్ములిం కెందఱో
వాసిం గాంచరె? క్రిందు మీఁదెఱుఁగ కీవక్రోక్తులన్ గ్రొత్తగాఁ
గాసుం గాని యెవండొ కాకవి యనన్ గన్పట్టునే లోటు? లే
దోసం బున్నఁ గవీశ సత్కృతులలో ద్యోవాహినీ నీర ధా
రా సంపర్కము గన్న పంకము క్రియన్, రాజీవ బంధు ప్రభా
శ్రీ సంలగ్నము గన్న మేదిని క్రియన్, క్షేమంకరోద్యన్మరు
ద్వ్యాసంగంబునఁ బూతమై యొసఁగు నావస్తూత్కరం బట్లు వా
ణీ సంబద్ధ పదానువర్తనమునన్ నిత్యంబు నిర్దోషమై
వీసం బేని కొలంత రాని పదవిన్ వే చెందు; నిం కీరసా
భ్యాసం బిందలివారికే యెఱుక; మీ పాండిత్య శౌండీర్యవి
శ్వాసం బెంతటిదో!, కవీంద్రుఁ డెవఁడో! పాండిత్య మేపాటిదో!
శాసింపంగల ప్రాజ్ఞలోకములఁ 'గచ్ఛాపక్క'గా నైన నే
మీ సంరంభ మిదా? యటం చడుగ, గంభీరాశుధారానటీ
వ్యాసంగం బిది యంచుఁ దేటపడునయ్యా విద్వదగ్రేసరా!

ప్రాసం బన్నను బ్రాసమై, యతి యనన్ భార్యాసుతాప్తాది సౌ
ఖ్యాసంభావ్య మహాప్రయాస మయి, పద్యం బన్న దుర్భేద్యమై
గాసిం జెందెడివారి నట్లునిచి, సంకల్పాగ్రపుం గల్పనల్
వాసంతద్రుమ పల్లవోపచిత దివ్య గాత్ర మాద్య త్పికీ
భూసంక్షిప్త కళా ప్రబోధిత పికామోఘానురాగార్ద్రి లీ
లా సంసృష్టికి మేళకర్త యయి పల్కన్ జూచు వాగీశు మే
ధా సంసారమె శశ్వదున్నత రసోత్తంస ప్రశంసోదయ
ప్రాసంగ్యం బగు శబ్దశిల్పము మహా బ్రహ్మాండ పారంపరీ
ధీ సంసర్గకు మార్గదర్శకము; కుస్త్రీ కీవు డీకొందువా ?
నీ సంసారముగుట్టు లోఁ దలఁచి 'వందే' యంచు వాకొందువా ?

అని యిట్లు కాలు దువ్వి కడపట నిలిచినాఁడు కవివీరుఁడు. అసలు, వారి వారి కెట్లున్నను 'ద్వయో ర్వివాద స్తృతీయస్య లాభః' అన్నట్లు పాఠకునకు మాత్ర మానందింపఁదగిన యవకాశము దక్కినది! మూఁడవవానికిఁ గావలసిన దిదియే గదా! అభిమాన సర్వస్వము, అవమా నాసహిష్ణుత, అవసర పతితమైన వాగ్వైఖరి అచ్చు గ్రుద్దిన ట్లెట్లు పొసఁగినదో చూడుఁడు!

ఈవీర విక్రమవిలాస మంతయు అభినవసరస్వతీ పత్రిక ధాతృమాఘమాసపు ౨౮వ సంపుటము ౧౧ సంచిక ౧౭వ పుటనుండి ప్రకటింపఁబడియున్నది.

—: గద్వాల సీతారామభూపాలుఁడు గతించిన తర్వాత :—

రాఘవశాస్త్రిగారు ప్రమాదీచ మాఘమాస ప్రథమ

ప్రవేశమునుండియుఁ బ్రతిసంవత్సరము మాఘమాససభలకు గద్వాల సంస్థానమునకు వెళ్లుచుండిరి. అక్కడ ఆస్థానకవి గాను, పరీక్షాధికారిగానుగూడ నుండిరి. ఇట్లుండఁగా రక్తాక్షి వైశాఖ బ ౮ లు (నవమీఘటికలలో) (1924 మే 26) గద్వాల మహారాజు సీతారామ భూపాలుఁడు గతించిపోఁగా, సంస్థానపరిస్థితులు తారుమారుగా నుండుటచేతను, శాస్త్రిగారికి రాజాగా రంతరించుటకుఁ బూర్వమే యేడుమాసము క్రిందట రుధిరోద్గారి ఆశ్వయుజ బ. ౫ లు. (1923) ప్రథమ కళత్రము వియోగమై మరల వివాహప్రయత్నపు టాందోళనలో నుండుటచేతను రెండు సంవత్సరములు గద్వాలకు వెళ్లకుండిరి. మూఁడవసంవత్సర మక్షయసంవత్సర మాఘ మాస సభకు వెళ్లఁగా అప్పటి పరిస్థితులను బట్టి పలుకరించు వారుగూడ లేకుండిరి. నాయకుఁడు లేకుండుటయు, రాజ్య మరాజక మగుటయు, సంస్థానమర్యాదలు నిలుప వీలు లేకుండుటయు నిన్ని యొనఁగూడఁగా రాజాగా రున్ననాఁటి పోకడలు మట్టుమ్యెను. జాబితా లున్నవారి కేదో ముట్టఁ జెప్పి తక్కినవారిని బల్కరింపకుండిరి. రాఘవశాస్త్రిగారి విషయములో రాజాగారు బ్రతికియుండఁగా నే మిచ్చు చుండిరో, ఏ రేమి తీసికొనిపోవుచుండిరో గాని జాబితా అని లేకుండెను .కనుక నీమాఱు వచ్చినపుడు 'జాబితా యున్నదా ?' యనఁగా శాస్త్రిగారు లే దని చెప్పిరి. తర్వాతఁ జెప్పికొన వలసిన అభిజ్ఞానము నంతయుఁ జెప్పికొనిరి. కాని పరిస్థితులు మాఱిపోయినవి! ఎఱిఁగిన పండితు లున్నను జెప్పలేకుండిరి.

అప్పుడు రాణిగారికై నను దనసంగతి నెఱింగించువా రుందు రేమో యనిన నట్టివారును గనఁబడక పోయిరి. అప్పుడు శాస్త్రిగారు పద్యములు వ్రాసి తనవిషయము రాణిగారి కెఱుకపఱచుకొందు మని కొన్ని పద్యములు వ్రాసి సభలోఁ జదువవలె నని చూచిరి. కాని అట్టిపద్యములను జదువుట కేని యవకాశము దొరకక పోయెను. అప్పుడు తిమ్మారెడ్డిగా రొకరు ధర్మప్రభువులుగా నుండ వారి నుద్దేశించి

కం. తా వీయ రైరి పద్యము
లే వేనియు నిచటఁ జదువ; నీ సంగతి నీ
భూవర సంఘములోపల
దేవేరికిఁ జెప్పవయ్య తిమ్మారెడ్డీ!

అని వ్రాసి పంపి వారివలన రాణిగారికిఁ దన సంగతిని గుఱించిన పద్యములను బంపుకొనిరి. ఆపద్యములు:—

(స్వర్గస్థులై యున్న రాజాగారి నుద్దేశించి)

చ. అమరపురంబు నీ వరిగి యర్ధశరీరము నుంచినా విటన్;
బ్రమద మె కాని యిం దెసఁగు భావము నీ వెనువెంట వచ్చె; జీ
వము లిట లేని నీయనుఁగు భార్య మహీభర మోర్చి యోర్చి వా
ర్ధ్రకమము నిఁ కేమిగా వినదొ! సత్కృతు లెట్టులో! రాజచంద్రమా!

(రాణిగారి నుద్దేశించి.)

సీ. దైవముదిన్నెయాస్థానంబుకవి నైతి
రామరాయల కవిరత్న మైతి
గద్వాలఁ దమ సభావిద్వత్సుకవి నైతిఁ
దక్షు లెన్ను శతావధాని నైతి

అహరహఃకృతి కల్ప నాశుసత్కవి నైతి
ఘటికా శతశ్లోక కర్త నైతి
ఉభయభాషా కావ్య విభవోన్నతుఁడ నైతి
విదిత యజుర్వేద వేత్త నైతి

తే. సరస మత్కావ్య రచనా రస ప్రవాహ
మే కరుడుగట్టి చాటిక లెసఁగు నిచట (చాటికలు=రేఖలు.)
దూరదృష్టికి నేఁటికిఁ దోఁచుచుండుఁ
గనుఁగొనుగ దమ్మ రాఘవకవిని నేను.

శా. తాంబూలంబొ, సుమంబొ, చందనమొ సీతారామభూపాలుఁ డి
చ్చెం బ్రేమాస్పద మంచు మత్కవిత నే చేపట్టి; నేఁ డాదిల
క్ష్మ్యంబా! మీదగు కొల్వుకూటమున నేమైపోయెనో చూచితే?
యిం జేఁదంగ ననామకుం డయితిఁ దల్లీ! యెంత దౌర్భాగ్యమో!

(అప్పుడు రాజ్యమేలుచున్న రాజాగారి యల్లుఁడు

సోమేశ్వరరావుగారి నుద్దేశించి)

తే. చెప్పఁ దగియు మీ పండితుల్ చెప్పరైరి,
వారినోళుల తాళముల్ వదలఁ జేసి
కనుఁగొనఁగదయ్య నాప్రోడ కైత జాడ
రక్షితకవీంద్ర! సోమేశ్వరక్షితీంద్ర!

మ. తమకున్ మామ, మదీయనేత యగు సీతారామభూజాని స్వ
ర్గముఁ జేరన్ జవి లేక యిందనుక నే రానైతి; మీ మేటివం
శమునం దాతఁడె రామకృష్ణుఁ డిపుడై జన్మించినాఁ డంచు వ
చ్చి ముదం బందితి; నిచ్చితిన్ గొను శుభాశీర్వాద మో భూమిపా!.

తే. ఆయు రారోగ్య భాగ్యంబు లలవరించి
ప్రేమ దళుకొత్తఁ దమ బాహుపీఠమందు
రాణఁ దులకించు గద్వాల రాజ్యలక్ష్మి
యధివసించుత సోమేశ్వరావనీంద్ర !

(పట్టాభిషిక్తుఁ డైన రాజాగారిపెద్దకొమార్తె నుద్దేశించి)

ఉ. చింత లడంగఁ జేసితివి, చేతికి రాజ్యము నిచ్చినావు, చే
తోంతర మందు సంతసము నందితి, మట్టులె పుత్త్రి పుత్త్రికా
సంతతి చాలుఁ జాలు నిఁకఁ జాలు నటంచు వచించుదాఁక శ్రీ
కాంత ! దయారసం బెసఁగఁగా నృపపుత్రి ననుగ్రహింపుమా !

(రాజ్యము నేలు బీజాంకురముగా రాజాగారిపెద్దకొమార్తెకుఁ గలిగిన చిన్నికుఱ్ఱని నుద్దేశించి.)

కం. సీతారాముఁ డమాయకుఁ
డా తీరున నేలఁ గలిఁ బ్రయాస మనుచునో
భూతలిని రామకృష్ణ
ఖ్యాతిని జన్మించినాఁడవయ్యా ? కుఱ్ఱా !.

కం. నటకుఁడు తెరలోఁ జొరఁబడి
తటుకున వేఱొక్క రూపు దాల్చినకరణిన్
బటుశక్తి రామకృష్ణో
త్కట నామము దాల్చినావొ గద్వాలనృపా !.

(కేశవస్వామి నుద్దేశించి.)

కం. సర్వసంసేవ్య ! కేశవ సార్వభౌమ !
నీ కృపారస మహిమ జన్మించియున్న

శ్రీ కరాకార గద్వాల రాకుమార
నాయు రారోగ్యము లొసంగి యరయవయ్య!

చ. సరస గుణాభిరాముఁ డయి సర్వవిధంబుల వన్నె గన్న మా
దొరను దొలంగఁ జేసి పరితోషము రూపఱఁజేసి; తిప్పుడో
దొర నిడినావు, వైభవముతోఁ దులఁ దూఁగఁగఁ జేసినావు; నీ
కరుణకుఁ బార మేమి? శ్రితకల్పమహీరుహ! చెన్నకేశవా!

అని యీపద్యములే గాక యింకను బూర్వాపర సందర్భ సహితముగాఁ బెక్కుపద్యములు వ్రాసి పంపఁగా రాణిగారు చూచుకొని శాస్త్రిగారిని సమక్షమునకుఁ బిలిపించుకొని సంభాషించి యథాప్రకారము సత్కరించి పంపిరఁట. అది మొదలల్లే జరుగుచు వచ్చినది.

—: చాఁకలిపై సీసము :—

ప్రమాదీచ సం. ర వైశాఖమాసములో కర్నూలులో జరిగిన ప్రథమ శతావధానములో (రెండవమాఱు బహుధాన్య వైశాఖ బ ౨ లు శతావధానము జరిగినది.) చాఁకలివానికి సీసము పోయవలసిన దని పృచ్ఛకుఁ డిచ్చిన ప్రశ్నకు సమాధానముగా రాఘవశాస్త్రిగారు చెప్పినది.

సీ. చాఁకలితో వేఁగలేక మున్ను శివుండు
సర్వకాలము గజచర్మ మంచె
రజకుల పోఁడుతో రాపిడి పడలేక
శ్రీరాముఁ డటు నారచీర లూనె
బలరాముఁ డీయమబాధలు పడలేక
కాల మంచును నీలచేలుఁ డయ్యె

ఎల్ల యోగీశ్వరు వీ పీడఁ బడలేక
కాషాయ వస్త్రముల్ గట్టిరైరి

తే. తీసికొని పోరు, పోయినఁ దెచ్చి యీరు,
ఇచ్చినను దెల్లఁజేయలే; రే మనందుఁ ?
దమరు పీతాంబరంబును దాల్చుకతన
జరుగుచున్నది నీబారు సరసిజాక్ష !

—: మద్రాసు సముద్రవిహారము :—

ఆంగీరస (1932) మార్గశిరములో రాఘవశాస్త్రి గారు మద్రాసు వెళ్లిరఁట. అక్కడ కస్టమ్సు ఆఫీసరుగానున్న శ్రీయింద్రగంటి వేంకటసుబ్బయ్యగారు ప్రియమిత్రులై శాస్త్రి గారిని సముద్రవిహారమునకుఁ దీసికొనిపోయిరఁట. బీచినుండి రంగూనుస్టీమరులో నెక్కిపోవుచుండఁగా వేంకటసుబ్బయ్య గారు శాస్త్రిగారి యాశుకవితాధోరణి విన్నవారు గాన ప్రకృత సముద్రవిహారమును గుఱించి ఆశువుగాఁ జెప్పవలసిన దని కోరిరఁట. అడిగినదే తడవుగా అల్లిన పద్యములు:—

శా. దాఁటన్ గార్యము లేదు; లక్ష్మణుఁడు నీతం డేమియున్ గాఁడు; నీ
నీటిన్ బాణముతోడఁ బీల్చుటకునై నే రాను; యుష్మత్తరం
గాటోపంబును జూచి మిత్రమణితో నానందమున్ బొంద ని
చ్చోటన్ జేరితి; రాఘవేంద్రుఁడ, నిదే జోహారు రత్నాకరా!

ఉ. వేగమునందు మించిన కవిత్వపు ధాటిని జూచి యెప్పుడున్
భోగ బిడౌజులైన నృపపుంగవు లా నన జాతిరత్నమై
సాగిలి మ్రొక్కవచ్చు కవిచంద్రుని రాఘవుఁ జూచి యింతగా
స్వాగత మిచ్చెదో తరఁగ లన్ కయిమోడ్పులతో మహార్ణవా !

కం. నీరత్నంబుల మించిన
దీ రత్నం బనుచుఁ బద్య మే నుడివినచోఁ
బార మగుపట్టు దని కవి
సార మెఱిఁగి సింధురాజ! స్వాగత మిడెదో!

కం. పక్షక్షైణ్య మెఱుఁగని
దక్షుఁడు కవిచంద్రుఁ డమృత ధారాధరుఁ డా
త్ర్యక్షపద నిష్కళంకత
దీక్షితుఁ డని కవిని సన్నుతించెద కడలీ!

సీ. కోడెబ్రమ్ముల ముద్దుగొని రివ్వనను వచ్చు
త్వద్వీచికల కిదే స్వాగతంబు
చుక్కల కెదు రెక్కి యెక్కసెక్కెము లాడు
త్వచ్ఛీకరాళి కీ స్వాగతంబు
జలకణంబులఁ గూడి సన్న సన్నల సోఁకు
త్వన్మారుతముల కీ స్వాగతంబు
ఆవిరియంత్రసాహాయ్యాన నిట సాగు
త్వన్నౌకల కిదే స్వాగతంబు

తే. మకర కర్కట మీనముల్ మకర కటక
మీనములఁ జేర నాకాశయాన పథము
బా గొనర్చిన త్వజ్జల ప్రబలశక్తి
సౌష్ఠవమున కిదో యబ్ధి! స్వాగతంబు,

సీ. గర్భశుక్తుల పోలికల వెళ్లఁగ్రక్కు, నీ
తాఁకులతోఁ బుట్టు శీకరములు
అభయ హస్త ప్రదానారంభములఁ జూపుఁ,
గడకట్ల నొరయు భంగముల గములు

హృదయ మార్దవమును హేలఁ బ్రదర్శించు,
దరులలో సైకతస్థలులగుంపు
లోని గాంభీర్యంబు నూని చెప్పక చెప్పు,
నెం దపారమటన్న హేలరూపు

తే. వహ్వారే! సింధురాజ! నీ వంటివాని
దర్శనం బైనఁ జాలదే? తగినలోక
మునకు గుణపాఠ మెంతగాఁ బొసఁగఁబోదు?
గొప్పవారల చెలిమిలోఁ గొదవ గలదె?

—: కుక్కల మొఱపై సీసము :—

మునిసిపాలిటి గ్రామములలో కుక్కలు విషజంతువు లని వానిని జంపించుచుండఁగా ఆ ఘోరమును జూడఁ జాలక 1935 డిసెంబర్ 12లో నేను 'కుక్కల మొఱ' అని చిట్టి పొత్త మొకటి వ్రాసి ప్రకటించి వీరరాఘవశాస్త్రిగారి కొక పుస్తక మిచ్చితిని. వా రెక్కడికో రైలులోఁ బోవుచు దైవికముఁగా నంద్యాల రైలుస్టేషనులోఁ గాన్పించిరి. ఆ యింత యవకాశములోనే నా యిచ్చిన పుస్తకమును బాఱఁ జూచి అప్పటి కప్పుడు కుక్కల పూర్వగాథలను ద్రవ్వుచు నీక్రింది పద్యములను వ్రాసి యిచ్చిరి.

సీ. వ్యాసునితోఁ బదన్యాసంబు గావించు
చున్న వేదము లని కొన్నినాళ్లు
కాశికా క్షేత్రాధికారి భైరవుఁ డగ్ర
సన్నుతుఁ డను సేవ కొన్నినాళ్లు

కుక్కల కెంగిలి కొటికి యెల్ల రోసంగు
కోటల పున్నమ కొన్నినాళ్లు
ఇంటిదేవర కంటెఁ గుంటికుక్కయె మేల
టన్న లోకస్తుతి కొన్నినాళ్లు

తే. కాఁగ బ్రతుకు కుక్కల జాతకంబు నేఁడు
ఘోరమౌ నురిశిక్షకు దారిఁ జూపె;
నరులకుఁ బుద్ధి రా వ్రాసినావు సుమ్ము
సాధుచర్య ! సుబ్రహ్మణ్య శాస్త్రివర్య !

కం. కమ్మని కవన మ్మది నీ
సొమ్ము సుమీ ! కవివరేణ్య ! సుబ్రహ్మణ్యా !
బమ్మెర పోతనకవియే
యిమ్మహి నీ వయి జనించెనేమొ గదయ్యా ?

—: అన్ని ఉత్పలములలో నడుమ నొక చంపకము పడినదఁట :—

ఆనందసంవత్సరము (1914) లో కంబము తాలూకా చెన్నవారపుపేటలో వైశ్యసంఘమువారు రాఘవశాస్త్రిగారి చేత శతావధానము చేయించి సత్కరించి మరల వెంటనే శ్రీరామోత్సవములలో పట్టాభిరాములపై శతకమునుగూడఁ జెప్పింపఁదలఁచి కొన్ని నిబంధన లేర్పఱచిరఁట. ఆశువులో అప్పటి కప్పుడు సద్యస్కల్పనతోఁ జెప్పవలయు ననియు, చెప్పిన పద్యములు వ్రాసికొనవలసి యుండును గనుక మూఁడు గంటల కాలములో ముగింపవలయు ననియు, చెప్పినవి చెప్పి నట్లుగానే దిద్దుబాట్లు లేకుండ అచ్చొత్తింపవలయు ననియు నియామకము చేసిరఁట. శాస్త్రిగారు వ్రాసికొనువారివడి

కొలఁదిని జెప్పివేసిరఁట. ఆచెప్పుటలో చివర సింహావలోకనము చేసికొనఁగా 110 పద్యములలో 'తరఁగల మిన్ను ముట్ట...' అని ఒకపద్యముమాత్రము చంపకము పడిన దనియు, అన్ని ఉత్పలమాలలతోపా టదియు నుత్పలమాలగానే యుండిన బా గుండు ననియు, అందుచే మార్చి చెప్పుదు ననియు శాస్త్రిగా రడుగఁగా నిర్ణాయకులు పట్టుదలతో 'కూడదు, అట్లే యుండవలె' నని యనిరఁట. అందుమీఁదట అదియు బాగుగనే యున్న దని ఆశువుగా నిట్లు పద్యము చెప్పిరఁట.

ఉ. అన్నిటి నుత్పలంబులనె హాయిగఁ గూర్చితిఁ గాని యొక్క టిం
దున్నది చంపకం; బిదియుఁ దొందరచేత వచించుటన్ మహో
ద్యున్నతి మాలికాంతమునఁ బోడిమి గాంచిన పెద్దపూస రీ
తి న్నవమోహనం బగుచుఁ దేజము గాంచుత రామభూపతీ !

అన్నట్లు 110 పద్యములలో ఆచంపకమాల కొలికిపూసవలె మధ్యన 55 వ పద్యముగాఁ బడినదఁట !

అప్పు డాశువుగాఁ జెప్పిన ఘంటాశతములోని యొకటి రెండు పద్యములు:—

ఉ. పాపపుఁగాల; మిందలి నృపాలుర కెల్లఁ గృపారసంబు నే
వైపునఁ బట్టి చూచిన లవ మ్మగపట్టదు; నీవు గూడ మా
యాపద లాఁపఁజూడక దయారసమే విడనాడితేని యే
ప్రాపును జేరియుందుము ? విపన్నుల మైతిమి రామభూపతీ !.

ఉ. 'దాతవు నీవు నీ' వని వృథా ధరణీస్థలి రాజ్యమత్తులౌ
భూతలనాథులన్ గని ఘోషా మతిర మ్మఁదె రేపు మాపటం

చాతత గర్వభాషణము లాడ సహింపఁగఁ జాల, నీపదా
బ్జాతముల న్నుతించితిఁ గృపారస ముంచుము రామభూపతీ !

ఉ. గాలికుమారుఁడా యితఁడు ? గౌతము కామినియా ? జటాయువా ?
వాలిసహోదరుండ ? దశవక్త్రుని కూరిమితమ్ముఁడా ? కృపా
శీలత నెట్లు చూపఁదగు ? ఛీ ! తగ రంద అటందు వేమొ, యో
పాలిత భక్తశేఖర ! కృపారస ముంచుము రామభూపతీ !.

ఈశతక మచ్చుకూడ వేయించిరఁట; కాని బహుకాల మైనది గనుక నిప్పుడు విశేషప్రయత్నము చేసినచో నెక్కడైన దొరకునేమో !

—: కూలివాఁడు దొరకకపోఁగా :—

ఒకమాఱు రాఘవశాస్త్రిగారు పిఠాపురము వెళ్లి వచ్చుచు దొనకొండ రైల్వేస్టేషనులో దిగి మూట మోసి కొనివచ్చుట కెవరి నైన కూలివానిని మాట్లాడి పెట్టుఁ డని అక్కడిహనుమద్భజనకూటమువారికిఁ జెప్పఁగా వారును విచా రించుచు, ఎవరు దొరక లేదే యని తంటాలుపడుచుండిరఁట. ప్రొ ద్దెక్కుచున్నది, అవతల పోవలె నని శాస్త్రిగా రాత్ర పడుచు గుడిలోఁ గూర్చుండి యున్న ఆంజనేయస్వామిని జూచి

ఉ. కూలికిఁ జిక్క లేదఁట యొకొండును మానిసి ! యూరి కేఁగఁగా
వేళ యతిక్రమించె నని వేగిర మందుచు నున్న రాఘవున్
లాలనఁ జేసి, కేలు నిటలంబునఁ జేరిచి మూట మోయ కీ
మూలన నిల్చి కన్ను లరమోడ్చెద వేటికి ? రమ్ము మారుతీ !

చ. 'కలి యిది, యేటి స్వామి ?' యని గర్వము నూనితివో ! యిదేగతిఁ
బలువురు చూచినప్పుడు భవద్గతి యేమగు ? నీపదాబ్జముల్

దలఁచెడువార లుందురె? నిదానముగా గమనించుకొమ్ము, లె
మ్మలయక వీరరాఘవుని నావల సాగఁగ నిమ్ము మారుతీ!

అని తొల్లిటిమర్యాదను హెచ్చరిక చేసిరి!

—: ఎట్లు వేగించుచున్నావు? కృష్ణమూర్తి! :—

ఆంగీరస సంవత్సర చైత్రమాసములో (1932) కూర్మదాసుగారు నెల్లూరుజిల్లా దొనకొండలో జరిపిన సప్తాహమునకు వెళ్లి రాఘవశాస్త్రిగా రాసప్తాహమండపములో వేంచేసి యున్న శ్రీకృష్ణమూర్తిని (దేవునిని) జూచి ఆయన యునికి కాశ్చర్య పడుచు ఎట్లు వేగించు చున్నావు? కృష్ణమూర్తి!' అని యీ క్రింది పద్యము చెప్పిరి.

సీ. అమృతాశనంబు నిత్యనివేదనం బిచ్చు
　　　సిద్ధలోకములఁ జేసేత విడిచి
పాల్ వెన్న పెరుఁగు లెప్పటి కప్పు డిడుచున్న
　　　గోకులావాస మన్కనుట మాని
అధరామృతంబుల నానఁగా ముద మిచ్చు
　　　మధురాపురం బను మాట మఱచి
బహువిధ ఫలములఁ బరితృప్తి గావించు
　　　భూలోకయాత్రల పోక వదలి

తే. కాయ కర్పూర మెటులైనఁ, గడకు నీరుఁ
బెద్ద టెంకాయ లేకున్న, పీఁచునైనఁ
గనులఁ జూపని దొనకొండ కోఁపురంబు
నెట్లు వేగించుచున్నావు? కృష్ణమూర్తి!.

—: పేడా ? కమ్మకస్తూరియా ? :—

ప్రజోత్పత్తి సం. ర వైశాఖ శు౧౦లు (1931మే.12) రాఘవశాస్త్రిగారు మార్కాపురము తాలుకా కొలుకుల అను గ్రామమునకుఁ బోయియుండఁగా ఒక ధనికులయింటి పిల్ల అంత మండు వేసవిలో మిడిమిడి కాలు వేళ కాళ్లకుఁ జెప్పులుగూడ లేకుండ తట్ట నెత్తిని బెట్టుకొని తిరిగి తిరిగి, నీళ్లు తెచ్చుకొను దారువుకడ పేఁడ వేసికొనుచు, అగపడిన చోట్ల నెల్ల వంగి వంగి తీసికొనుచు తంటాలు పడుచుండెనఁట. ఆదృశ్యమును జూచి మనశాస్త్రిగారు (కవితాదారిద్ర్యము లేదుగదా!)తోడవచ్చినవారితో వర్ణించి చెప్పిన పద్యములు:-

శా. కాళుల్ గాలెడి యెండ లేమి ? తనువుల్ గంపించు గాడ్పేమి ? యే
మూలన్ జూచిన దుర్నిరీక్ష్య మగుచున్ మోపెట్టు తీ రేమి ? యో
బాలా ! పాదుక లైన లేక తల గంపన్ దాల్చి శోధించి తం
టాలన్ జెందుచు సేకరింతు వది పేఁడా ? కమ్మకస్తూరియా ?

శా. రాలన్ బెట్లిలఁజేయు వేసవి, వడా ? రా నంచు లోనున్న ప్రా
ణాలన్ లాగుచు నిప్పులన్ జెరుగు; మధ్యాహ్నంబునన్ బాలికా !
నేలన్ వంగుచు లేచుచున్ శిరముపైనిన్ గంపతో నెంతో తం
టాలన్ జెందుచు సేకరింతు వది పేఁడా ? కమ్మకస్తూరియా ?

—: త్రిపురాంతకస్థలపురాణము వ్రాయఁ బోయినప్పుడు. :—

(శ్రీముఖ. శ్రీరామనవమి. 1933 ఏప్రిల్ 4.)

కర్నూలు జిల్లా మార్కాపురము తాలూకాలో శ్రీశైలమునకు తూర్పు ద్వార మని ప్రసిద్ధిఁ జెందిన త్రిపురాంతక క్షేత్రముయొక్క స్థల పురాణము నాంధ్రీకరింపఁ

జేయవలె నని అలవాల కేశవులు రెడ్డిగారు (రాజుపాలెము) ఆహ్వానింపఁగా రాఘవశాస్త్రిగారు వారము దినములలో ఆపని ముగించుకొని రావలయునని సకుటుంబముగా శ్రీముఖ శ్రీరామనవమినాఁడు త్రిపురాంతక క్షేత్రమునకుఁ బోయి, రాత్రి కొంచెము ప్రొద్దుపోవునప్పటికి దేవస్థానములో నున్న సత్రములో దిగిరఁట. దేవస్థానము గ్రామమునకుఁ గొంచెము దూరములో నున్నది గనుకఁ దమరాక ఊరివారి కెఱుకపఱు చుటకుఁగా నెవరినైనఁ బంపుద మని విచారింపఁగా అక్కడ కావలియున్న శంభుఁ డను యానాదివాఁ డొకఁడు, వాని భార్య పార్వతి, సుందరి యను కూఁతురు, వేఱొకపాముల వాఁడు వీరు నల్వురుమాత్రమే యుండిరఁట. తమ రాక ఊరి లోనికిఁ దెలుపుటకై ఆ యానాదివానిని బంపుచు అప్పటి పరిస్థితిని వర్ణించుచు నీ క్రింది పద్యము వ్రాసి పంపిరఁట.

ఉ. శర్వ ! భవత్సమీపమున సంగతు లించుక గాంచినాఁడ; నా
పూర్వదిశాధినాథుఁడయి పొల్పెస లారిన వజ్రి యెడ ? నీ
సర్వసుపర్వు లేడ ? మునిసత్తము, లచ్చర లేడ ? నయ్యయో !
పార్వతి, శంభు సుందరులు, పాములవాఁడొకొ నీకు సేవకుల్ ?

ఆవల సంకల్పించుకొన్న ప్రకార మెనిమిది దినముల లోనే త్రిపురాంతకస్థలమాహాత్మ్యమును 320 పద్యములతో మూఁడాశ్వాసముల గ్రంథముగా వ్రాసి, తొమ్మిదవ దిన మునఁ గృతి సమర్పణము చేసిరి. ఈ గ్రంథమును వ్రాయించి నందులకు అలవాల కేశవులు రెడ్డిగారు త్రిపురాంతకము చెఱువు క్రింద 87 సెంట్లు మాగాని భూదానము చేసిరి.

మఱియు ఒక పుట్టెఁడు వడ్లు ధాన్యదాన మొనరించిరి. శ్రీ పాలుట్ల వేంకటనరసయ్యగారు (రాజుపాలెము) గ్రామములో సమకూర్చి నూటదార్లు బహూకరించిరి. ఈకృతి రచనకు సంధాతలైన వేంకటనరసయ్యగారు మిక్కిలి శ్రద్ధ దీసికొని స్థలపురాణము వ్రాయింపఁ దలఁచుకొని యున్న కేశవులు రెడ్డి గారి సంకల్పమును నెఱవేర్చినవారైరి.

ఈ కృతి సమర్పణ సభలోఁ గొందఱు పారాయణార్హములైన గ్రంథములను దెనుఁగు సేయుటవలన గ్రంథ గౌరవము తగ్గునని ముచ్చటించిరఁట. అప్పుడు సంస్కృతగ్రంథ ముల కాంధ్రీకరణ మేల యవసర మయ్యెనో ఆవిషయమును దెల్పుచు శాస్త్రిగా రీపద్యమును వ్రాసిరఁట.

సీ. కనులు మూసి విరించి కామిని నెల్లరు జ్ఞాననేత్రమున లాగఁగలనాఁడు
భావోదయములతో భారతి నలరించి దివిజలోకేచ్ఛలు దిప్పునాఁడు
కృతికన్యలకుఁ బెండ్లిఁగిల్కాల్పి నింగుల విడనిమర్యాద లిప్పించునాఁడు
సంకల్పముననైన సరస నిల్వ ది దేమిచా యని బ్రహ్మ వాపోవునాఁడు

తే. వ్యాసముని దేవభాషలో గీసికొనియె;
బ్రహ్మరాణిని దాఁటుట పాప మనుచుఁ
దెల్గువా రార్యభాష గుర్తింపకునికి
శివశివా! తెల్గులోన వచింప వలసె.

## కవితా రసాభిషేకము.

(త్రిపురాంతక స్థల మాహాత్మ్యగ్రంథమునుండి.)

ఉ. నెత్తిన స్వర్గగంగ గల నీ కభిషేక మొనర్తు నంచుఁ జే
లెత్తి ధరాస్థలిన్ గలుగు నీయపవిత్ర జలంబు లుంపఁగాఁ

జిత్తము సమ్మతింపక ప్రసిద్ధ కవిత్వరసప్రసక్తిఁ గిం
చిత్తు నొసంగుచుంటి నభిషేక మిదే త్రిపురాంతకేశ్వరా!
(పీఠిక.౨౪౫.)

ఈ త్రిపురాంతక స్థల మాహాత్మ్యము కేశవులు రెడ్డి గారి కుమారులు 1943 లో ముద్రించి ప్రచురించిరి. రెడ్డి గారి కుమారులు తమతండ్రిగా రిచ్చిన మాగాని ఫలసార మును శాస్త్రిగారి కుమారునికైనఁ జెందులాగునఁ జేయు దురుగాక.

—: సుంకేసులలో సుబ్బరాయశాస్త్రిగారి నవరాత్రదీక్ష :—

యువ సం. రములో (1935) బ్రహ్మశ్రీ మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (రాఘవశాస్త్రిగారి కావ్యవిద్యా గురువులు) మార్కాపురము తాలూకా సుంకేసుల గ్రామములో నవరాత్ర దీక్ష జరుపుచుండఁగా రాఘవశాస్త్రిగారు గురుదర్శనార్థమై యక్కడికిఁ బోయి చెప్పిన పద్యములు:—

మ. గిరులన్ దాఁటి, తటాకముల్ గడచి, కోర్కెన్ ద్రాగ నీ శ్లేనిప
ల్లిరివాఁగుల్ గమియించి, త్రాటివనముల్ ని మ్మోన్నత స్థానముల్
సరిగా దాఁటి స్వకీయ దేశిక దిదృక్షా లాలసుండై కవీ
శ్వరుఁడౌ రాఘవుఁ డేఁగుదెంచె నిదె యుత్సాహాన సుంకేసులా! ౧

కం. గురువర్య దర్శనంబును,
బరమేశ్వరి దర్శనంబు, బహువిధ మిత్రో
త్కర దర్శనంబు గల్గెను,
జిరజన్మ తపః ఫలంబు సిద్ధించెను బో! ౨

ఉ. దేశికుఁ జూచుటయ్యె, నిఁకఁ దీర్ఘము స్వార్థ మటంచు, దానధా
రేశులు వైశ్యరత్నము లహీనగుణోన్నతు లున్నవారు; రా

కౌశికి సంప్లవ త్కిరణ క్రమ రసోపమ వాక్ప్రవృత్తి క్రియా
వేశము జూపు మిచ్చట లభించును సత్కృతి కావ్యకన్యకా! 3

(రాత్రి పూజావసానమున పరాకులు చెప్పుచు 'కవిత్వ ప్రియే! కవిత్వ మవధారయ' అన్నప్పుడు దుర్గాదేవి నుద్దేశించి.)

సీ. మూర్తిత్రయాతీత మూర్తివై యేరికిఁ
జన వొసంగని రాజసంబు మాని
చండ ముండాది రక్షః ప్రకాండ విఖండ
సమయానుగత తామసంబు విడిచి
అమల స్వరూప నిత్యాత్మానుసంధాన
కారణంబగు సాత్వికంబు వదలి
అఖిల నియంత్రివై యన్నికాలంబుల
హేలఁ జరించు నీస్వేచ్ఛ వీడి

తే. సుబ్బరాడ్గురుఁ డిచటఁ గూర్చుండు, లెమ్మ,
దయ్యములమీఁదఁ గ్రమ్మ, మోదమ్ము నిమ్మ,
ర మ్మనినఁ జిత్త మనెడి రూపమ్ము దాల్చి
తేమి క్షేమ మ్మటందు? దుర్గామతల్లి!

సీ. వచ్చియున్నాఁడు విద్వచ్చతురానన
స్తవనీయ సుబ్బరాట్ఛాస్త్రివరుఁడు
చేరియున్నారు ప్రసిద్ధిఁ జెందిన మహా
శ్రీమంతు లైనట్టి శ్రేష్ఠికులులు
చనుదెంచినారు విశ్వస్తుత్య జప తప
స్తేజః ప్రపూజ్య ఋత్విగ్గణంబు

అరుదెంచినారు రాజాధిరాజ శిరః కి
రీట రత్నప్రభార్చితులు కవులు

తే. లోప మింకేమి? రక్షఃప్రతాప శమన
ఘోర సంగ్రామ సముచితాత్యుగ్ర రౌద్ర
ముద్ర వెడలించి, కొనుము చిన్ముద్ర నింకఁ
గవితిలకకల్పవల్లి! దుర్గామతల్లి!.

సీ. పంచదశీబీజ పరతత్త్వ నిర్దిష్ట
భరితమై తగు నవావరణపూజ
తతమహాన్యాసాది దశశాంతిసంయుత
శివసహస్రాద్యభిషేకనియతి
రవ్యాది సద్గ్రహారాధన జప హోమ
తర్పణ దాన సమర్పణంబు
ఇష్టమృష్టాన్న సంతుష్టి పూర్వకముగ
సక్రమ పూర్ణాహుతిక్రమంబు

తే. మిత్రమణు లెల్ల రిట నవరాత్రదీక్ష
మించు వేడుక నీకు సాగించినారు
కోరికల నింక నడిగి చేకూర్పుమమ్మ
కవితిలకకల్పవల్లి! దుర్గామతల్లి!

క. అనవరత సహజశీతల
గుణమును రత్నాకరతయుఁ గూడిన వైశ్యా
గ్రణి రాముడుగు శివయ్యను
గని పుట్టి ల్లనుచు నిల్వఁగల్గితె? దుర్గా!

క. కుంకుమ తులసీదళములఁ
బంకేజాతముల బిల్వపత్రంబుల ని

న్నుంకించి పూజ సల్పిరి;
శాంకరి ! నేఁ బద్యపూజ సల్పెదఁ గొనుమా !

(సుబ్బరాయశాస్త్రిగారిని గుఱించి.)

సీ. భాషాంకురంబులఁ బదను గుర్తించి చ
ల్లక మొనరించు కౌలజ్ఞమూర్తి
ప్రతిని మేషమును హృత్పద్మమధ్యంబునఁ
దలఁచుచుండిన భక్తతత్పరుండు
ఎల్లవేళల వచియించు మాటలలోన
స్మరణఁ జేసెడి శిష్యపరవశుండు
అన పదంబున సరసాస్వాదనము చేసి
తన్మయత్వము గాంచు తత్త్వవేత్త
తే. సుబ్బరాయమనీషి యిచ్చోట నుండె;
నేమి పూజ గావించెదో ! యింక నీవు
వీరరాఘవ గననాని వేశమాన
దివ్యపదధాటి ! యోభారతీవధూటి !

—: సమస్యలు. :—

రాఘవశాస్త్రిగారి సమస్యాపూరణ సామర్థ్యమును గుఱించి దిఙ్మాత్రముగా లోగడ గ్రంథభాగమునందు (చూ. 71వ పుట.) పాఠక లోకమునకుఁ బరిచయము చేయఁ బడినది. వివిధ ఘట్టములలో అష్టావధానములందు, శతావధానములయందు ఇతర కాలములలోను వారు పూరించిన సమస్యలన్నియు నిట జేర్పించి యందందలి చమత్కారమును బరికింతము గాక.

౧. వికిరాన్నం బిడి పార్వతిన్ శివుఁడు దాఁ బెండ్లాడె మోహాంధుఁడై.
౨. విడిచి రెల్లరు బ్రాహ్మణ్యమా! వెళ్లిపొమ్మ.
౩. భీష్ముని పెండ్లి కేఁగిరఁట పిన్నలు పెద్దలు బంధు లందఱున్.
౪. నోటికి మాటిమాటికి వినోదముగా నరికట్టె మీసముల్.

(ఈ సమస్యల పూరణములు 72 వ పుట నుండి చూడుఁడు.)

౫. మఠమున సన్న్యాసి యొకఁడు మానినిఁ గూడెన్.
౬. మారెడుగాయలోన నొకమానిని యుయ్యెల లూఁగఁ జొచ్చెడున్.
౭. రంభాఫల మెంత విషమొ రసికుఁడె యెఱుఁగున్.

(ఈ సమస్యాపూరణములు 66 వ పుటనుండి చూడుఁడు.)

౮. ఇంకన్ గస్తురిబొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్
౯. శూకాగ్రంబున భాసిలెన్ శుభజలస్తోమంబు కాసారమున్
౧౦. దారము లేనిహారము నుదారత నీ కెవ రిచ్చి రమ్మరో!

(ఈ సమస్యాపూరణములు 41 వ పుటనుండి చూడుఁడు.)

౧౧. అతిచాతుర్యము వైదికద్విజులకే యజ్ఞానసుం డిచ్చెఁగా!

(చూ. 60 వ పుట.)

నెల్లూరు శతావధానాదులలో నిచ్చినవి (26–6–1918)
౧౨ నుండి ౨౦ వఱకు.)

౧౨. నవనీత ప్రతిమ వహ్ని నడుమ నటించెన్.

కం కవి యేడ? సకల పండిత
నివహాలంకారమైన నెల్లూ రెట? లో
కవిరుద్ధ మిందుఁ దియగుట!
నవనీతప్రతిమ వహ్నినడుమ నటించెన్.

౧౩. దారముచేఁ జిక్కి చచ్చె దైత్యుం డకటా!

క. ఘోరాకార హిరణ్యా, క్షారూఢిన్ వెడలి పుడమి నటు చాఁపఁగ దో
స్సారమునఁ జుట్టుచును భూ, దారముచేఁ జిక్కి చచ్చె దైత్యుం డకటా!

౧౪. ఉత్పలగంధిరో యనినఁ దా నూఁహూఁ యటం చిట్లనెన్.

శా. స్వాహావల్లభు సన్నిధానమున నే సఖ్యంబు, దాంపత్యము
ద్వాహప్రక్రియ దీక్ష, దాల్చితిమి గాదా? దేని కీయల్క ? స
స్నేహాలింగన సౌఖ్య మిచ్చి యిఁక నన్ జేపట్టి కాపాడవే
యోహో యుత్పలగంధిరో! యనినఁ దా నూఁహూఁ యటం చిట్లనెన్.

౧౫. పతితలఁ గోసి వండె నొక పాంథుని నాతి మనోహరంబుగన్.

చ. కుతుకము మీఱ శ్రీగిరి కకుంఠితభక్తిని బోవుచుండి వి
స్తృత నవపల్లవావృత దిదృక్షు ముదావహ తింత్రిణీకుజా
ప్రతిమపు నీడలో విడిసి, ప ప్పుడుకెత్తెడు నంత నాకురు
ట్పతితలఁ గోసి వండె నొక పాంథుని నాతి మనోహరంబుగన్.

౧౬. గాడిద నెక్కి శంకరుఁడు గంగను గైకొని వెళ్ళెఁ గాశికిన్.

ఉ. వేడుక సేతుతీర్థ మని వెళ్ళి గ్రహించి యొకండు శంకరుం
డోడక యుత్తరాయణ మహోదయమం దవి కాశిఁ జేర్ప ను
న్నాఁడు; డటు కొంతకాలము చనన్ దగ సంకురుఁ డేఁగుదెంచెఁ దా
గాడిద నెక్కి; శంకరుఁడు గంగను గైకొని వెళ్ళెఁ గాశికిన్.

౧౭. కరి మకరిన్ బట్టి లాగెఁ గాననమునకున్.

కం. పరిపూర్ణ శాపమోక్షణ
పరుఁడై నరుఁ డల్ల తీర్థవారిన్ దిగ, నో
ర్దొఱచుకొని వచ్చి పడు భీ
కరి మకరిన్ బట్టి లాగెఁ గాననమునకున్.

౧౭. ఆమోదంబుననో యలౌకికులు నిత్యానందు లిం దద్దిరే!

శా. చీమల్ నూకలతోడ, వాయసము లుచ్ఛిష్టంబుతోఁ, గుక్కలున్
గ్రామామూల సుఖ ప్రచారములతో, ఘాసంబుతోడన్ బసుల్,
ప్రేమానందముతో బుధోత్కరము, లేవిజ్ఞేతరాలాపలీ
లామోదంబుననో యలౌకికులు నిత్యానందు లిం దద్దిరే!

౧౮. చనుబా లిచ్చి సుఖింపఁజేసె రతిలోఁ జంద్రాస్య ప్రాణేశ్వరున్.

మ. తను సంజాత నిశాత చూత కిసలాస్త్రజ్వాలలన్ బొంగులా
ర్చిన ఒంగారపు బొంగరా లనఁగ మిర్మిట్లిచ్చు పాలిండ్లఁ గ్రొ
న్ననవిల్కానిదురంబులో నలసి మానన్ లేక కామంబు హె
చ్చను, బా లిచ్చి సుఖింపఁజేసె రతిలోఁ జంద్రాస్య ప్రాణేశ్వరున్.

౨౦. ఉదయించెన్ రవి చంద్రమండలములో నొప్పారు మేఘావృతిన్.

మ. మృదువాక్యంబులఁ గౌఁగిలింతలఁ గళామేయప్రభావంబులన్
బదిలం బొప్పఁగఁ గ్రీడ సల్పితిమిగా ప్రాణేశ! గాఢానురా
గ దశన్ బెంచక, శాంతిఁ జెందుటయె నిక్కం బింకఁ గార్యంబు, చూ
డుదయించెన్ రవి, చంద్రమండలము లో నొప్పారు మేఘావృతిన్.

(దీనినే భంగ్యంతరముగాఁ జెప్పఁ డన)

మ. ముదితారత్నము శారదేందురుచి సంపూర్ణ ప్రభాయుక్తమా
వదనాబ్జంబున బాలసూర్యుఁ డన తేవన్ బొల్చు కాశ్మీరమున్
విదితంబౌ గతిఁ దాల్చె. ముంగురులు గప్పెన్; దీని వర్ణింతు నే,
నుదయించెన్ రవి చంద్రమండలము లో నొప్పారు మేఘావృతిన్

(మరల దీనినే భంగ్యంతరముగాఁ గోర.)

మ. సదయున్ బైకొని, పూరుషక్రియకు లజ్జన్ వీడి, తత్తత్క్రియా
భ్యుదయాంబుల్ పచరించుచున్ ఒవళ గా కొక్కుమ్మడిన్ రోషరు

క్ష్నదపాంగస్థితి దాల్చు చంద్రముఖి నిచ్చట జూచి వర్ణింతు నే
నుదయించెన్ రవి చంద్రమండలము లో నొప్పారు మేఘావృతిన్.

(మరల దీనినే భంగ్యంతరముగాఁ జెప్పఁ డన)

మ. ఎదపై నిల్చిన శర్వరీశవదనా హేలల్ విచిత్రంబుగా
మదిఁ దోఁచన్ హరి సంతసించుచుఁ జలన్మాణిక్యకాంతిచ్ఛటా
స్పదమా కౌస్తుభహారమున్ దనదు సద్వక్షంబునన్ దాల్చె, నం
దుదయించెన్ రవి చంద్రమండలము లో నొప్పారు మేఘావృతిన్.

(మరల దీనినే భంగ్యంతరముగాఁ జెప్పఁ డన.)

మ. మది దుర్వాసుని మంత్రమున్ జపము నేమం బొప్పఁగాఁ జేసి, బా
ల్యదశన్ వర్తిలు కుంతి వేఁడినపు డుద్యత్తీక్ష్ణతన్ మాని, య
మ్మదనోద్దామ సమిత్కళా కుశలియై మంత్రప్రభావమ్మచే
నుదయించెన్ రవి చంద్రమండలము లో నొప్పారు మేఘావృతిన్.

గద్వాలలో దివాను ప్రభాకరరావుగారిచే సీతారామ భూపాలుఁ డిప్పించినది.

౨౧. తురకలు సంధ్య వార్తురఁట తోయము లీయవె తోయజేక్షణా.

చ ఖరుఁ డన నొప్పి, తాపజనకంబగు వర్తనతోడ వారసుం
దరిఁ గవఁగూడి, రాతిరి నితాంతము కాంతివిహీనుఁడై ప్రభా
కరుఁ డరుదెంచె, నింక, జునుఁగన్ బని లేదని బోడిబోడి యీ
తురకలు సంధ్యవార్తురఁట! తోయము లీయవె తోయజేక్షణా!.

ఇది యిచ్చినవారికే యెదురు దగిలిన దని యిక్కడ గమనింపవలె. ఇందలి రహస్యము శబ్దశక్తి మూలకము. నాఁటి పరిస్థితి యట్టిదఁట. అది కనుఁగొని రాజాగారు

(పై దానినే భంగ్యంతరముగాఁ జెప్పఁ డన.)

చ. తిరుగుచు నేఁగుదెంచిరి విదేశ్యులు విప్రులు వేదశాస్త్రముల్
పరిచయ మున్నవారు, మనపంచను జేరిరి; ప్రొద్దు గ్రుంకె; నీ
పురమున నొండు తావునకుఁ బోఁజన; దిచ్చటివార లెల్లరుఙ
దురకలు; సంధ్యవార్తురఁట తోయము లీయవె తోయజేక్షణా !

(మరల భంగ్యంతరముగా నన.)

చ. దొరలయి యుందు మంచుఁ బరితోషముతోఁ బరదేశవిద్య ల
క్కఱగొని నేర్చి, నౌకరులు గానక, బ్రాహ్మణవేష మూడి ము
ష్కరు లయి, పూర్వవృత్తి విడఁజాలక వేఁడెదు బోడిబోడి యీ
తురకలు సంధ్యవార్తురఁట తోయము లీయవె తోయజేక్షణా !

గద్వాలలో శ్రీ పిశుపాటి చిదంబర శాస్త్రిగారి కిచ్చిన పరీక్షాప్రశ్నలలో (౧౫ ప్రశ్నలు. మధ్యాహ్నము 1 గం. నుండి రాత్రి 7 గం. వఱకు కాలనియమము) 'కృష్ణుఁడు సర్వపూజ్యుఁ డని కిన్నరులే వచియించి రెంతయుఙ' అనుసమస్యను విడువకుండఁ బూరింపవలసినదే యని వేదము వేంకటరాయ శాస్త్రిగారు, తత్పక్షమువారును పట్టుపట్టఁగా 7 గంటలైనది, పోనీ లెమ్మనుకొన్న చిదంబర శాస్త్రిగారప్పుడు "శ్రేష్ఠులయందు" అని ప్రారంభింపఁగానే జిగీషాప్రధానముగా నడుచుచున్న పరీక్ష గనుక ఆక్షేపించుటయే ప్రధానముగా వే. వేం. రా. శాస్త్రిగారు "ఇక్కడ (శ్రేష్ఠులయం దనుచోట) సప్తమీవిభక్తి యెందుల ?" కని యాక్షేపించిరఁట. 'కతివిధా సప్తమీ?' అని చిదంబర శాస్త్రి గారు ప్రశ్నించుటయు ఆవివాద మట్లే పెరిఁగి పోఁగా మన రాఘవశాస్త్రిగారు సమయము చూచు

కొని ఆ చిదంబరశాస్త్రిగారి కిచ్చియున్న సమస్యలలోనే 'పండితుఁ డెందులకుఁ బనికివచ్చు నృపాలా' అన్నయొక సమస్యను సమయోచితముగా నున్న దని యిట్లు పూరించిరి.

౨౨. పండితుఁ డెందులకుఁ బనికి వచ్చు? నృపాలా!.

కం. కొండొక సభలో విద్వ
 ద్ఖండనమున సప్తమీవిభక్తి యనిన నె
 ట్లుండునొ యెఱుఁగని యీ మీ
 పండితుఁ డెందులకుఁ బనికి వచ్చు? నృపాలా!

౨౩. వీడ్ధ్వజు నుమ గనియె నని వివేకికిఁ దెలియుఁ౯.

ఇదియు గద్వాలలోఁ జిదంబరశాస్త్రిగారి కిచ్చిన ౧౫ ప్రశ్నలలో నొకటి. ఈక్లిష్ట సమస్యలను సంఘటనము చేసినవారు ఉపద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు. ఈ సమస్యను మాత్రము వదలవలెనా? యని రాఘవశాస్త్రి గారు పూరించిరఁట. (ఈ సమస్య పూరించి దీని క్రింద శాస్త్రిగారు 'ఈ సమస్యను పూర్వులలో నెవరు పూరింపలేదు, నే నొక్కఁడనే పూరించితి' నని వ్రాసికొని యున్నారు.)

కం. వీడ్ధ్వజుఁ డెవ రన నేల? గ
 వీడ్ధ్వజ లలితా సహస్రహేలా నామా
 వృద్ధ్వజ కరాంగుళి౯ గన
 వీడ్ధ్వజు నుమ గనియె నని వివేకికిఁ దెలియుఁ౯.

(ఇందులో లలితాసహస్రనామావళిలోని 'కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః' అన్న నామార్థ మిమిడింపఁబడినది.)

ఆత్మకూరు సభలో నిచ్చిన వీరెండు. (౨౪–౨౫)
అనంతశాస్త్రిగారి నస్యపు బుడ్డిలో నశ్యమయిపోయిన దఁట. అది వేసికొనవలె నని బుడ్డి గొట్టి చూడఁగా వట్టి బుడ్డి ఆయె నఁట. అప్పు డావిషయమే సమస్యగా ఇచ్చిరఁట. కవితా వినోదము!

౨౪. బంగరుడబ్బి బుస్సనుచు బ్రహ్మపదంబును జేరి భాసిలెన్.

ఉ. రంగు హొరంగు గల్గి మధురంబయి మెప్పెడు నస్యచూర్ణమా
సంగను నెల్లవారల కొసంగుచు నుండుటఁజేసి దీని నిం
డం గదియించి పెట్టినఁ, దటాలున నంతము నొంది యిప్పు డీ
బంగరుడబ్బి బుస్సనుచు బ్రహ్మపదంబును జేరి భాసిలెన్.

౨౫. శారద కొక్కపార్శ్వమున సౌఖ్యము ముఖ్యమ? కుర్మతిప్రభూ!

(1938 ఫాల్గున పూర్ణిమ.)

ఉ. సారెకు గాన మానుటయొ, శారద రెండవ చన్ననంగ సీ
త్కారము గల్గెఁ; గావ్యకళ దగ్గఱఁ జేర్చుట హ్రస్వమై సభా
గారము లుల్లసిల్లుటను గావ్యకృదీశ్వరు లూరకుండ్రి; రీ
శారద కొక్కపార్శ్వమున సౌఖ్యము ముఖ్యము? కుర్మతిప్రభూ!

ఆత్మకూరు సభలో సంగీతగోష్ఠియే మిక్కుటమై సాహిత్యగోష్ఠి తక్కువగా నుండ ఈసమస్య బయలు దేఱెనఁట.

నల (1917) సంవత్సరాదినాఁటి దొనకొండ శతావధానములో నిచ్చిన వీక్రింది మూఁడు సమస్యలు. ౨౬–౨౮.

౨౬. దరితోఁ గూడి సుఖింప న్యాయమటరా? దర్వీకరధ్వంసకా!

(సుభద్రాప్రాణనాథాయ అన్న భావము దీసికొని జగన్నాథములో)

మ. గురుఁడున్ దైవము బంధు లాప్తు లను సంకోచంబు వోనాడి, ము
ష్కరకృత్యంబుల కిట్లు పాల్పడుట బాగా? కామినీ రత్నమై
చిరకీర్తిన్ గను నా సుభద్ర యన నీచెల్లెల్ గదా! యిట్టిసో
దరితోఁ గూడి సుఖింప న్యాయమటరా? దర్వీకరధ్వంసకా!

(దీనినే భంగ్యంతరముగాఁ బూరింపవలెనన)

(కృష్ణుని భార్యలలో నొకతె(రుక్మిణి)కృష్ణునిగుఱించి అన్నట్టు)

మ. కరపంకేజము నంటునాఁడె శచిసాక్షాత్కారమం దన్యసుం
దరులన్ గూడ నటంచు బాస నిడి, తద్ధర్మంబు వోనాడి, ని
ష్ఠురకృత్యంబుల కిట్లు కేల్మొగిచి, సుశ్లోకంబు మాయించి యిం
దఱితోఁ గూడి సుఖింప న్యాయమటరా? దర్వీకరధ్వంసకా!

(మరల దీనినే భారతార్థమునఁ జెప్పఁ డన.)

మ. ధరణీనాథ శిరః కిరీట విలసద్రత్నాంశు సంకీర్ణ భా
సుర పాదాబ్జులు ద్రోణ భీష్మ కృపు లత్యుగ్రుల్ సమిద్రంగ భీ
కర మూర్తుల్ గద! వారలన్ విడిచి వేడ్కన్ బాండుసంజాతు జా
దరితోఁ గూడి సుఖింప న్యాయమటరా? దర్వీకరధ్వంసకా!

౨౭. ఆకులు పోఁకలున్ గలుగ నంతియ చాలును సున్న మేటికిన్?

ఉ. ఓకమలాయతాక్షి! విడె మొయ్యన నీయఁ దలంచితేమొ, వే
వే కరుణించి యిమ్ము, సుధ వేఱుగఁ దేఁ బనిలేదు; చూడు, నే
నూఁకొన, నీవు వాకొనఁగ నూరును దత్సుధ, రాగ మబ్బు, నీ
యాకులు పోఁకలున్ గలుగ నంతియ చాలును సున్న మేటికిన్?

౨౮. శవముతో (?) రతి సేయ నొక్కచాన జనించెన్.

కం. అవివేకి పిల్లవానికి, నవయౌవన నొసఁగఁ బిన్ననాఁటనె సురత
ప్రవణత దెలియకతేఁడు శై, శవముతో రతిసేయ నొక్కచాన జనించెన్

(దీనినే భంగ్యంతరముగాఁ జెప్పఁ గోర.)

క. చవు లాలుకు పలుకు లెఱుఁగక,
వివిధ కళాశాస్త్రజాతి విధు లెఱుఁగక, రేఁ
బవలు నిదురించు జీవ
చ్ఛవముతో రతిసేయ నొక్కచాన జనించెన్.

(నెల్లూరుజిల్లా) వేంకటాపురాగ్రహారము శతావధానము లో నిచ్చిన వీ క్రింది సమస్య లెనిమిది. ౨౯ నుండి ౩౬ వఱకు.

౨౯. మార్తాండుం డుదయించె నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్.

శా. మూర్తీభూత పురత్రయాహరణ శంభుప్రౌఢ దోర్విక్రమ
స్ఫూర్తుల్ గల్గిన ద్రోణ కర్ణముఖులన్ జూడంగరా కెంతయో
యార్తిన్ జెందిన క్రీడికై హరి సముద్యచ్చక్రముల్ గైకొనన్
మార్తాండుం డుదయించె నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్.

౩౦. చక్కని కాంతవక్షమునఁ జన్గవ గన్పడ దేమి చిత్రమో!

ఉ. అక్కట! పెక్కునాళ్లటు ప్రయాసల కోర్చి గడించినట్టి యా
రొక్కము దారవోసి, కడు రూపసి యంచు వరించితిన్ గదా!
యెక్కడి రోగమో మిగుల నేఁచెఁ, గృశింపఁగఁ జేసె, నంత మేల్
చక్కని కాంతవక్షమునఁ జన్గవ గన్పడ దేమి చిత్రమో!

౩౧. పార్వతి దశరథునిఁ దనదుపతిఁగాఁ గోరెన్.

(ఈశ్వరుఁడు పార్వతిని సంబోధించి చెప్పినట్లుగా)

క. పూర్వాచార పరాయణ
ధూర్వహ కౌసల్య నెంతదూర మడిగినన్
గర్వగ్రంథులఁ బోవిడి
పార్వతి! దశరథునిఁ దనదుపన్లిఁగాఁ గోరెన్.

౩౨. అరయఁగ సూర్యబింబ మిట నద్దమరేయిని జూచితిన్ దగన్.

చ. ఖరకరదీప్తిమూర్తుల ప్రకారములన్ గల రీతి వర్ణనా
భిరుచుల నేర్పరింపఁ గవివీరుని నన్నిశిఁ బ్రశ్న సేయఁ, ద
ద్విరచన వేదనా భరిత ధీ పరిదర్శిత వర్ణ్యవస్తువై
యరయఁగ, సూర్యబింబ మిట నద్దమరేయిని జూచితిన్ దగన్.

౩౩. వచ్చీరాని పయోధరద్వయముతో ... ...

శా. వచ్చీరాని పయోధర ద్వయముతో వాలారు లేఁజూపుతో
హెచ్చీ హెచ్చని మందహాసములతో నింపైన కెమ్మోవితో
విచ్చీవిచ్చని మల్లెపూసరులతో వెన్నంటు కీల్గంటుతో
వచ్చెం జెంగటి కంగనామణి రతాభ్యాసైకచిత్తంబునన్.

౩౪. రత్నము లెన్నేఁగ వార్ధి రత్నాకరుఁడే !

క. రత్నంబు లెవరి కెన్ని య
యత్నంబుగ దొరకుచున్న నయిపో, వింకన్
నూత్నములు పెచ్చు పెరుఁగును;
రత్నము లెన్నేఁగ వార్ధి రత్నాకరుఁడే !

౩౫. మఱిపైయుండిన కోరికల్ పయికి రా ... ...

మ. మఱిపైయుండిన కోరికల్ పయికి రా, మాటాడ నోరూరఁగా
ముఱిపెంబుల్ తల కెక్కఁగా, మరుఁడు సంపూర్ణప్రతాపంబుతో
శరసంధాన మొనర్పఁగా, నిజకటాక్షప్రౌఢవీక్షారుచుల్
ద్వర పెట్టన్ గను పట్టినా వఁటవె ? కాంతా! నాఁటికిన్ నేఁటికిన్.

౩౬. కాంతుఁడు లేని వేళఁ గలకంఠి కిలక్కున నవ్వెఁ గిన్కతోన్.

ఉ. చింతిత మెప్పు? డెట్టు? లని చిత్తము నుత్తలపెట్టి పెట్టి, త
త్స్వాంతమునన్ బ్రతిక్షణ మహాయుగముల్ దివ మెల్లఁ బుచ్చి, యా

శాంతములన్ స్వతేజమును నల్లన నల్లన లాగి పద్మినీ
కాంతుఁడు లేనివేళఁ, గలకంఠి కిలక్కున నవ్వెఁ గిన్కతోన్.

పొదిలె శతావధానములో నీయఁబడిన
సమస్యలు రెండు ౩౭, ౩౮.

౩౭. పీడెఁ బతివ్రత నదేమొ విచికిలగంధీ!

క ఊడిగ మొనర్ప ఋణపడి,
నాఁడు హరిశ్చంద్రనృపతి నాతి నసుప మో
మోడకయ సుతునితోడన్
పీడెఁ బతివ్రత నదేమొ విచికిలగంధీ!

౩౮. విధవను జూచి భర్త యురి వేసుక చచ్చెను జూడఁగా జనుల్.

చ. అధములు చచ్చెఁ జచ్చె నను నాఱడికూఁత నిజానిజంబు లే
విధములొ నిర్ణయింపక వివేకవిహీనులు వానికోమలిన్
విధవ నొనర్చి యుంచి రిట; వేడుకఁ గొన్ని దినాలనాఁటి కా
విధవను జూచి భర్త యురి వేసుక చచ్చెను జూడఁగా జనుల్.

వినుకొండ దగ్గఱి నాలుగువరము అష్టావధానములో

౩౯. భీష్ముం డంతట నంబవెంటఁ దిరిగెన్ బృందారకుల్ నవ్వఁగన్.

శా. గ్రీష్మాదిత్యునిఁ బోలు శాంతనవుఁ గూర్మిన్ వేఁడి భాషింప రో
షోష్మంబున్ గని యంబ నంపె; మఱి మోహోద్రేకమున్ జూప, న
ర్చిష్మంతుండయి యెంత వేఁడుకొనినన్ జేరంగ నీఁడయ్యె నా
భీష్ముండు; అంతట నంబ వెంటఁ దిరిగెన్ బృందారకుల్ నవ్వఁగన్.

పొకతమూరు (పొదిలెతాలూకా) శతావధానములో

౪౦. రయమున నెంద్రకాయ కుహరంబునఁ జీరె గజేంద్రుఁ డాహరిన్

చ. జయ యని దంతిసంతతుల సారసకేళులఁ దేల్చుచుండి ని
ర్భయముగ సంచరించెడు ద్విపప్రభుఁడుండటి పాదయుగ్మమున్

భయద మహోగ్రదంష్ట్రికలఁ బట్టిన యామకరీంద్రుఁ ద్రుంపఁగా
రయమున నైంద్రకాయ కుహరంబునఁ జీరె గజేంద్రుఁ డాహరిన్.

౪౧. ధవళకాకజుండు దశరథుండు. (లద్దగిరిలో)

ఆ. ధవళకాక మనఁగఁ దగు వేదహంసిక,
దశరథుం డనంగఁ దగును విష్ణు,
వధ్వరముల శ్రుతుల నతఁ డుదయించుట
ధవళకాకజుండు దశరథుండు.

(దశ – అనఁగా పక్షి. పక్షి రథముగాఁ గలవాఁడు విష్ణువు. అధ్వరములయందు మంత్ర క్రియలచే అతఁడు శ్రీరామాద్యవతారములతోఁ బుట్టె నని భావము.)

మార్కాపురము శతావధానములో రెండు. ౪౨–౪౩

౪౨. పతి సోఁకక చూలు గను యువతి మతి నెంతున్.

క. పతియే దైవం బనియెడు
వ్రత మెల్లప్పుడును దాల్చి పలుసుఖములతో
సతియై కలయందే నుప
పతి సోఁకక చూలు గను యువతి మతి నెంతున్.

౪౩. ఉష్ణీషంబునఁ గట్టవచ్చునె ? మదవ్యాఘోగ్ర శుండాలమున్.

శా. ఉష్ణాంశుప్రతిమాన తేజ ! ధృతరాష్ట్రోర్వీశ ! నీ నూనుఁ డీ
కృష్ణున్ సర్వజగత్ప్రభూష్ణుఁ డని యొక్కింతైన లోనెంచకే
తృష్ణాపాశవినిగ్రహాత్ముఁడయి బంధింపంగఁ దా నెంచె హా !
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె ? మదవ్యాఘోగ్ర శుండాలమున్.

పై దానినే రామాయణార్థమునఁ జెప్పఁడన

శా. విష్ణుం డంచును రాము గుర్తెఱుఁగకే వేవేగ దైత్యేశుఁ డ
త్యుష్ణంబైన మదీయ తేజ మిదె యోహో చూడు మం చాసతిన్

ముష్ణత్వంబునఁ బట్టునప్పు డనె నా భూపుత్రి యో రావణా!
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె? మదవ్యాఘ్రోగ్ర శుండాలమున్?.

మార్కాపురము కోర్టు మునసఫ్‌గా రడిగినవి ౪౪-౪౫. వీరు తిరుపతిశాస్త్రిగారి శిష్యులు, కవులు నఁట.

౪౪. కమలం బుదయించె వింత గాదా? మిత్రా!

వారి పెద్ద బిడ్డపే రమృతమఁట, చిన్నబిడ్డపేరు కమలమఁట. ఈరహస్యము గమనించి రాఘవశాస్త్రిగారు

క. కమలము గల్గినమీఁదట
నమృతం బుదయించు లోకమంతటఁ; దమయీ
సముఖమున నమృత మేర్పడి
కమలం బుదయించె! వింత గాదా? మిత్రా!

౪౫. పంద్రెండేండ్లకుఁ బెండ్లి చేయవలదా? పద్మాక్షి కీకన్యకన్.

శా. గుంద్రా ళ్లట్లు కుచంబు లేర్పడియెఁ గన్గొ మ్మింకనుౙ బాల్యమా?
తండ్రిన్ నే నని విజ్ఞుఁ గాదవు! నీ తాత్పర్య మిం దేమి? పై
నుంద్రాముల్ ఘటియిల్లుఁ, బ్రేమ చెడు, నన్యోన్యంబు నాదారు; నీ
పంద్రెండేండ్లకుఁ బెండ్లి చేయవలదా? పద్మాక్షి కీకన్యకన్.

మునసఫ్‌గా రప్పటిలో నొక బాల్యవివాహపు కేసు విచారించుచుండుటయే గాకుండ, తమ పెద్ద కొమార్తెకు పెండ్లియీడు వచ్చె నని కూడ మనసులోఁ బెట్టుకొని యడిగిన దిది. శాస్త్రిగారు చేసిన సమస్యా పూరణక రసికులు గనుక చాల సంతోషించి తఱచుగా తమవారందఱు చదువుకొనుటకు వీలగునట్లు మొదటిపాదము మార్చి చెప్పు డనఁగా

పుంద్రేక్షుప్రదరాహవక్రియకు సేర్పుల్ గల్గుచో బాల్యమా?

అని మార్చి చెప్పిరఁట.

మార్కాపురము తాలూకా గొలుకులలో ఎక్కడికో పోవుచుండఁగా ధ్వజస్తంభముపై గ్రద్ద వాలి కూర్చుండి యుండుటఁ జూచి యెవరో యొకరు కూర్చి యిచ్చినది.

౪౮. స్తంభాగ్రంబునఁ గూరుచుండుటకు గ్రద్దా! పెద్దవైనావఁటే?

శా. అంభోజాసన భామినీ చరణ సేవాయాత దీవ్యద్దయా
రంభ ప్రాభవ విద్య దాశుకవితా గ్రంథాను సంధాన వా
క్సంభూతోత్తమ కీర్తులాకవుల లెక్కింజేయు కీ ధ్వజ
స్తంభాగ్రంబునఁ గూరుచుండుటకు గ్రద్దా! పెద్ద వైనావఁటే?

దీనినే భంగ్యంతరముగా

శా. శంభు ప్రేయసి దివ్యమంగళ కృపా సంభూత గంభీర వా
గంభోజాసన భాసమాన రచనా న్యస్త ప్రభావ త్కవీ
ద్రంభాజారులు వీథులన్ దిరుగుచుండన్ జూచి యౌరా! ధ్వజ
స్తంభాగ్రంబునఁ గూరుచుండుటకు గ్రద్దా! పెద్దవైనావఁటే?

మార్కాపురములో స్త్రీవిద్యను గుఱించి తా ముపన్యసించుచున్న యుపన్యాస మధ్యములో నొక సమస్య కూర్చి పూరించి చెప్పుఁ డని యిచ్చినది

౪౯. సతుల విజ్ఞాన మే ప్రజాసర్వశక్తి.

సీ. తల్లిదండ్రులయందుఁ బిల్లచేష్టలు చూపి
ప్రమదంబు చేకూర్చు బాల్యమందు
ప్రాణేశుచెలిమి నిర్భరముగా గడియించి
గణ్యత గాంచుఁ దారుణ్యమందు
శిశుపోషణము, భర్తృసేవ, ప్రజాధృతి
పాలనఁ గొనుఁ బ్రౌఢకాలమందు

ఆత్మవిజ్ఞానంబు నైహికాముష్మిక
పథము నిరూపించు భాగ్య మవల

తే. జనన మాదియు నీరీతి సకలలోక
సాధువర్తన గల యీడుజాతి విద్య
యెఱుఁగ కుండిన దౌర్భాగ్య మేమి చెప్ప?
సతుల విజ్ఞాన మే ప్రజాసర్వశక్తి.

దైవముదిన్నెలో శ్రీరామనవరాత్రసభలలో అప్పుడప్పుడియ్యఁబడినవి ౪౮ నుండి ౫౪ వఱకు ౭.

౪౮. పద్మమె శిక్షకాస్పదము పాపినిశాచర! నాదురాకచేఁ.

రాత్రి చంద్రుని దూషించినట్లుగాఁ దీసికొని

ఉ. పద్మజు జన్మభూమి యయి, భాస్కరమూర్తికిఁ జుట్టమై, మహా
పద్మ ముకుందురాణి యగు భార్గవి లక్ష్మికి దివ్యకేళికా
సద్మము నై ప్రపంచమున సన్నుతిఁ గాంచుచు నున్న మవ్వపుం
బద్మమె శిక్షకాస్పదము? పాపినిశాచర! నాదురాకచేఁ.

దీనినే భంగ్యంతరముగా ఒకయభిసారిక ప్రియునితో నన్నట్లు

ఉ. సద్మమునుండి వచ్చి, యభిసారికనై, తమరాకఁ జూచి, భీ
ఛద్మము దాల్చి, పల్లవుని సన్నిధిఁ దత్సుఖ మేవగించి, నేఁ
బద్మిని నైతి; దోషమును బట్టిగదా విధి? దాన మన్మనః
పద్మము శిక్షకాస్పదము? పాపినిశాచర! నాదురాకచేఁ.

దీనినే భంగ్యంతరముగా సీత రావణునితో నన్నట్లు

ఉ. సద్మముఁ జేర్చి నన్ను, సుర సద్మముఁ జేరిన పుత్ర మిత్ర సం
పద్మహనీయ భోగములఁ బాసి, మనంబున ఖేద మంది, యే
ఛద్మము లెందు కెంచవలెఁ? జావుము; జావకయున్న నీమనః
పద్మము శిక్షకాస్పదము, పాపినిశాచర! నాదురాకచేఁ.

౪౯. దొంగసురతమ! నీ కిదుఁదును జోహారు.

తే. క్షణము వృథ లేదు, కొంచు టొక్కటియె తడవు,
శుష్కహాస్యాపలాలనల్ సున్న సున్న,
ప్రణయకోపంబు, నుహుఁహూఁలు ప్రబలఁ బోవు
దొంగ సురతమ! నీ కిదుఁదును జోహారు.

౫౦. త్రాడు భుజంగమై కఱచె, దాహము గల్గెను మోవి నీయవే!

ఉ. చూడక మా ర్గమం బిడుటఁ, జుట్టము పీ వని పల్కరింప మా
టాడక యూరకుంపుటఁ, బ్రియంబుగ వేఁడుచుఁ జెంతఁ జేరఁగాఁ
గూడక యొత్తిగిల్లుటను, గోపముఁ జూపుటఁ బ్రేమబంధ మన్
త్రాడు భుజంగమై కఱచె, దాహము గల్గెను మోవి నీయవే!

౫౧. క్రిందికి వంచి రెం డనక క్రీడలతోఁ గొనె మందహాసమున్.

ఉ. కెందలిరాకుసెజ్జపయిఁ గ్రీడకుఁ దార్చిన ముద్దరాలిపై
గందముఁ జిల్కరించి నునుఁగొఁగిటఁ జేరిచి ముద్దు గోరు నా
థుం దిలకించి లజ్జిలుచుఁ దోయజనేత్ర నిజాననం బెటో
క్రిందికి వంచి రెండనక క్రీడలతోఁ గొనె మందహాసమున్.

విభవ శ్రీరామోత్సవసభలో (1928.)

౫౨. దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండెఁ జీఁకటుల్.

ఉ. అవ్విభుఁ డున్నయట్టి హృదయాంతరకర్ణిక కెల్లదిక్కులన్
దవ్వుల దవ్వులన్ బ్రకృతితత్త్వము, లింద్రియముల్ స్వశక్తిమైఁ
గ్రొవ్విఁ చరించుకాలమునఁ గూడిన జీవకథావిధిన్ గనన్
దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండెఁ జీఁకటుల్

దీనినే భంగ్యంతరముగా

ఉ. జవ్వని నీవిఁ బట్టుకొను సాహసమున్ బ్రియుఁ డడ్డు సేయలే
కవ్వసనంబు జార్చు సమయంబున లజ్జిలి కమ్మపుప్వొడిన్

తివ్వనఁ జల్ల మంగళవినిర్మితదీపము శాంతమయ్యె, నా
దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండెఁ జీఁకటుల్.

మరల భంగ్యంతరముగా

ఉ. ఎవ్వరు గందురో యని యొకించుక సిగ్గిలి యుండె దేమె! యో
జవ్వని! కాంచికాస్థగిత సచ్ఛితమన్యమణీభవప్రభల్
దవ్వుల నాక్రమించెఁ, గనుఁదమ్ములు విచ్చి కవుంగిలించు మీ
దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండెఁ జీఁకటుల్.

మరల భంగ్యంతరముగా.

ఉ. నవ్వను మందగించితివి, నాచును మించిన కేశపాశముక్
తివ్వన జార్చియుంచితివి, రేఁపితి మోమునఁ గమ్మకస్తురిన్,
మవ్వపుఁ జూపులన్ జొనిపి మంచియుపాయముఁ జేసితే చెలీ!
దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండెఁ జీఁకటుల్.

౫౩. అతిసుకుమారలీల! కమలా! విమలా! నవచూతకోమలా!

చ. మతులకు మోద మీఁదగిన మార్గము లిప్పుడ గాన నయ్యె, నీ
కుతుకమె చాలు; నైన, రసికుల్ కమనీయమనోజశాస్త్రిపాం
డితి గమనింపకుండిన గణింపరు; తీరు మొకింత దానిలో
నతిసుకుమారలీల! కమలా! విమలా! నవచూతకోమలా!.

ఈసమస్యను గుఱించిన చరిత్ర యించుక గలదు. ఇది రామారెడ్డిగారి కొమార్తె కూర్చి యిచ్చినది. ఆమె కవయిత్రి. కమల అను దాసి అప్పుడు ప్రథమ రజస్వల అయియున్నదఁట. ఈసంగతి పండితుల కెవరికిని దెలియదు. అప్పుడు రాఘవ శాస్త్రిగారితోఁ గూడ అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మఱొకరు పూర్తిచేసిరఁట. రెడ్డిగారు రాఘవశాస్త్రిగారి

యీపద్యము మూఁడింటిలో బా గున్నదని మెచ్చుకొనిరఁట. వారి యల్లుఁడు తిరుమలరావుగారు (గద్వాల రాజాగారి తమ్ముఁడు) రాఘవశాస్త్రిగారిపైఁ గల యభిమానముతో అట్లు చెప్పుచున్నా రని ఆక్షేపణ చేసిరఁట. అప్పుడు రెడ్డిగారు తమయల్లునకు యథార్థము తెలియఁబఱపవలె నని, అది ఆఁడువారివలనఁ దేల్చుకొంద మని మూఁడుపద్యములను వ్రాసి మార్కులు వేయించుకొని రావలసిన దని యింటిలోనికిఁ బంపఁగా వారును ఈపద్యమునకే మార్కు లిచ్చిరఁట. రాఘవశాస్త్రిగారిపద్య మనుకొని మార్కు లిచ్చినారేమో తార్మాఱు చేసి చూతమని తిరుమలరావుగారు పేర్లు మార్చి, మరలఁ జూచి మార్కు లీయవలసిన దని పంపిరఁట. రాఘవశాస్త్రిగారిపద్యము గాక పోయినను దీనికే మేము మార్కు లిచ్చుచున్నా మని రెడ్డిగారికొమార్తె, తిరుమలరావుగారి భార్య గజలక్ష్మమ్మగారు వ్రాసిపంపిరఁట. అప్పటికిఁ దిరుమల రావుగారు తమమామగారి కుటుంబమువారి కబ్బిన యుచి తజ్ఞతకు మెచ్చుకొని తమయభిప్రాయమును మార్చుకొనిరఁట. ఈజరిగిన విషయ మంతయు ఆచర్చలోఁ గొందఱు విదుషీ మణు లుండి విని తర్వాతఁ జెప్పఁగాఁ దెలిసినదఁట.

౫౮. దివి యిదా ? కాదు దైవము దిన్నె కాంత !.

ఒకప్పు డుత్సవములలో రథోత్సవానంతరము మేడ మీఁద రామారెడ్డిగారు కవులు, గాయకులు చేరియున్న సభలో అపూర్వ గాన నాట్య కళా వినోదములు చూపుచున్న యొకవారకాంతను గుఱించి రెడ్డిగా రిచ్చిన సమస్య యిది.

సీ. పురుహూతు మఱపించి భువి కరుదెంచిన
యూర్వశి వీవటే? యువిదమిన్న!
నలకూబరునకుఁ గన్నులు మూసి ధరణికి
వచ్చిన రంభవా? మచ్చెకంటి!
గాధేయు నట వియోగమునఁ గ్రుక్కనిపించి
యేతెంచు మేనకవేమొ భామ!
రుక్మాంగదుని తపోరూఢి నీఱుగఁ జేసి
వెనుకకు వచ్చు మోహినివ? తరుణి!

తే. వేంకటేశోత్సవములను వేడ్కఁ జూచి
నాకమున కేఁగఁగా విమానము గదలక
భూమి నిలిచిన యచ్చరవా? మృగాక్షి!
దివి యిదా? కాదు దైవమదిన్నె కాంత!

కోయిలకుంట్ల అష్టావధానములో

౨౨౪. భరతఖండమ! నీ తపఃఫలమ కాదె?

తే. క్షామ మొకచోట, పన్నుల కష్ట మొకటఁ
బెద్దజాడ్యాలతోఁ బ్రజాపీడ లొకట
నరరె! యీరీతి ముచ్చిచ్చు దరికొను టన
భరతఖండమ! నీ తపఃఫలమ కాదె?

దీనినే సీసపద్యములో భంగ్యంతరముగా

సీ. విత్త మున్నది చాలు, విద్య వచ్చినయంత
చాలు లెండను బుద్ధిశాలు లుండి
అధికార మున్నది యావిద్య యెట్లున్న
నేమి లెమ్మనుచున్న స్వాము లుండి

చదివినవా రేమి సమకూర్చె? రౌను బో
బాధింపఁ దగ దను సాధు లుండి
రా దనుమా టనరాదు, మిక్కిలి యేల?
యని మద మందు భూజనము లుండి
తే. తల్లిదండ్రుల విద్యలు తగ్గెఁ దొలుత;
దత్ఫల మె వారిబిడ్డలఁ దగ వరించె;
బాల బాలిక లిటువంటి బాట గొనుట
భరతఖండమ! నీతపఃఫలమ కాదె?

అన్నసముద్రము శతావధానములో

౫౬. ఖాడ్వ్రితాధిపుఁడు శేషుకౌఁగిటఁ జొచ్చెన్.
కం. విడ్వ్రితనిష్ఠాపరుఁడై
రాడ్వ్రితముఁ ద్రుంచు పాండురాజామనుమఁడే
ద్విడ్వ్రితముచేఁ బడెనటె!
ఖాడ్వ్రితాధిపుఁడు శేషుకౌఁగిటఁ జొచ్చెన్.

కర్నూలు దగ్గఱి వెల్దుర్తి అష్టావధానములో

౫౭. నారీభగమందు నిల్చె నవరత్నంబుల్.
కం. మార కళాలాలసుఁడై
ధారణి పతి సతిని గదిసి తతరత్నకళాం
కూరాంగుళిఁ గళ లంటిన
నారీభగమందు నిల్చె నవరత్నంబుల్.

కర్నూ లష్టావధానములో

౫౮. ఆతతాయి కెవ్వఁ డాఁగఁగలఁడు?
ఆ. ఆతతాయి కొంప లంటించు, విష మిచ్చుఁ,
గత్తి నెత్తి నఱుకుఁ, గాంత నొందు,

ధనము భూమి లాగుఁ; గనుక నీభువిలోన
నాతతాయి కెవ్వఁ డాఁగఁగలఁడు ?

గుంటూరులో ప్రసంగవశమున స్నేహితు లడిగినది.

౫౯. పడువాటైనవి పుణ్యకార్యము లొనర్పన్ లేవు సర్వేశ్వరా !

మ. ఇడినావా ? పెనులోభివై నిగుడుఁ దా, నీ పీనిచో గర్భరి
క్తుఁడుగా వర్తిలు; రెండుపద్ధతులలో గోరంతయున్ భేద మే
ర్పడ లేః దింతకు మించి నీ వెది యొనర్పన్ జాలుదో చూడుమా !
పడువాటైనవి పుణ్యకార్యము లొనర్పన్ లేవు సర్వేశ్వరా !.

తెనాలిలో మిత్రులు ప్రసంగవశమున నిచ్చినది.

౬౦. ... ... తరుశీర్షము లెక్కె దీపముల్.

ఉ. కమ్మని కౌఁగిలించీఁకటులు గ్రమ్మెను, ముమ్మరమైన మోహముల్
గ్రమ్మఁగఁ బాంథలోకము సుఖస్థితివాసవిలోకనక్రియన్
సమ్మతి రాఁ దొడంగె, వికసత్సుమ సౌరభ ధూప గంధముల్
గ్రమ్మె, విలాసినీగృహశిఖాతరు శీర్షము లెక్కె దీపముల్.

౬౧. నెలబాలునిఁ జూచి బాల నెలపా లాయెన్. (ఎక్కడిచ్చినదో!)

కం. తొలుకాడు యౌవనంబును
దొలకరి క్రొమ్మించుఁదళుకుతోఁ దనుకాంతుల్,
మొలక నగు గలుగు మేల్వె
న్నెల బాలునిఁ జూచి బాల నెలపా లాయెన్.

దీనినే భంగ్యంతరముగా

కం. లలితాకృతి లావణ్యము
మిలమిల క్రొమ్మొలక నూఁగుమీసము, వయ స
గ్గల మగుచు నిగ్గు గను వ
న్నెలబాలునిఁ జూచి బాల నెలపా లాయెన్.

౬౨. మంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా! బిందియం దేఁగదే.

శా. సంచారంబులు మాని గూళ్లకుఁ జనెన్ సార్వత్రిక ప్రౌఢ ప
క్షాంచత్పక్షికులంబు, దుస్తమసు ఛాయం జొచ్చె, వత్సంబులో!
చుంచాఘట్టిత పత్రిపోతము లనన్ జుట్టాడఁగా సాగ నే?
మంచు, ఆలన్ బిగియించె గుంజలకు నమ్మా! బిందియం దేఁగదే!

కొల్లాపురములో నొకరసికుఁ డిచ్చినదఁట.

౬౩. యువగర్వవిదారణోఽస్తు హా తరళదృశా!

క. భవదీయతరళదృష్టికి
వివిధాశీర్వచన మస్తు, విజయోఽస్తు; భవ
న్నవయౌవనప్రసక్తికి
యువగర్వవిదారణోఽస్తు హా తరళదృశా!

రాఘవశాస్త్రిగారు పూరించిన సమస్యలు. అక్షరక్రమమున.

| క్రమసంఖ్య | సమస్యాశ్లో. | సమస్యలు. |
|---|---|---|
| ౧ | ౧౧ | అతి చాతుర్యము వైదిక ద్విజులకే యభ్యాసనుం డిచ్చెఁగా. |
| ౨ | ౫౩ | అతి సుకుమార లీల కమలా! విమలా! నవచూతకోమలా! |
| ౩ | ౩౨ | అరయఁగ సూర్య బింబ మిట నద్దమరేయని జూచితిన్ దగన్ |
| ౪ | ౨౭ | ఆకులు పోఁకలున్ గలుగ నంతియ చాలును సున్న మేటికిన్. |
| ౫ | ౫౮ | ఆతతాయి కెవ్వఁ డాఁగఁగలఁడు? |
| ౬ | ౧౮ | ఆమోదంబుననో యలౌకికులు నిత్యానందు లిం దద్దిరే! |
| ౭ | ౮ | ఇంకం గస్తురిబొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్. |
| ౮ | ౧౪ | ఉత్పలగంధిరో యనినఁ దా నూఁహూఁ యటం చిట్లనెన్. |
| ౯ | ౨౦ | ఉదయించెన్ రవి చంద్రమండలములో నొప్పారు మేఘావృతిన్. |
| ౧౦ | ౪౩ | ఉష్ణీషంబునఁ గట్టవచ్చునె? మదవ్యాఘోగ్ర శుండాలమున్. |

| క్రమసంఖ్య | పత్రసం. | సమస్యలు. |
| --- | --- | --- |
| ౧౧ | ౪౪ | కమలం బుదయించె వింత గాదా? మిత్రా! |
| ౧౨ | ౧౭ | కరి మకరిన్ బట్టి లాగఁ గాననమునకున్. |
| ౧౩ | ౩౬ | కొంతుఁడు లేనివేళఁ గలకంఠి కిలక్కున నవ్వెఁ గిన్కతోన్. |
| ౧౪ | ౫౧ | క్రిందికి వంచి రెండనక క్రీడలతోఁ గొనె మందహాసమున్ |
| ౧౫ | ౫౬ | ఖాండ్వ్రితాధిపుఁడు శేషుకౌఁగిటఁ జిక్కెన్. |
| ౧౬ | ౧౬ | గాడిద నెక్కి శంకరుఁడు గంగను గైకొని వెళ్ళెఁ గాశికిన్. |
| ౧౭ | ౩౦ | చక్కని కొంత వక్షమునఁ జన్గవ గన్పడ దేమి చిత్రమో! |
| ౧౮ | ౧౯ | చనుబా లిచ్చి సుఖింపఁజేసె రతిలోఁ జంద్రాస్య ప్రాణేశ్వరున్ |
| ౧౯ | ౬౦ | తరుశీర్షము లెక్కె దీపముల్. |
| ౨౦ | ౨౧ | తురకలు సంధ్య వార్తురఁట తోయము లీయవె తోయజేక్షణా! |
| ౨౧ | ౫౦ | త్రాడు భుజంగమై కఱచె దాహము గల్గెను మోవి నీయవే. |
| ౨౨ | ౨౬ | దతితోఁ గూడి సుఖింప న్యాయమటరా దర్వీకరధ్వంసకా! |
| ౨౩ | ౧౩ | దారముచేః జిక్కి చచ్చె దైత్యుం డకటా! |
| ౨౪ | ౪౯ | దారము లేనిహారము సుదారత నీ కెవ రిచ్చి రమ్మరో! |
| ౨౫ | ౫౪ | దివి యిదా కాదు? దైవముది న్నె కొంత! |
| ౨౬ | ౫౨ | దివ్వె వెలుంగుచుండిన గదిన్ నలువంకల నిండెఁ జీఁకటుల్ |
| ౨౭ | ౪౯ | దొంగ సురతమ! నీ కిదుదును జోహారు. |
| ౨౮ | ౪౧ | ధవళకాకజుండు దశరథుండు. |
| ౨౯ | ౧౨ | నవనీతప్రతిమ వహ్నినడుమ నటించెన్. |
| ౩౦ | ౫౭ | నారీభగమందు నిల్చె నవరత్నంబుల్. |
| ౩౧ | ౬౧ | నెలబాలునిఁ జూచి బాల నెలపా లాయెన్. |
| ౩౨ | ౪ | నోటికి మాటి మాటికి వినోదముగా నరికట్టె మీసముల్. |
| ౩౩ | ౨౨ | పండితుఁ డెందులకుఁ బనికి వచ్చు నృపాలా! |
| ౩౪ | ౪౫ | పంద్రెం డేండ్లకుఁ బెడ్లి సేయవలదా? పద్మాక్షి కీకన్యకున్. |
| ౩౬ | ౫౯ | పడువాడైనవి పుణ్యకార్యము లొనర్పన్ లేవు సర్వేశ్వరా! |
| ౩౫ | ౧౫ | పతితల గోసి వండె నొకపాంథుని నాతి మనోహరంబుగన్. |

| క్రమసంఖ్య | పత్రసం. | సమస్యలు. |
|---|---|---|
| ౩౭ | ౪౨ | పతి సోఁకక మూలు గను యువతి మతి నెంతుణ్. |
| ౩౮ | ౪౮ | పద్మము శిఖ కొప్పదము పాపినిశాచర! నాదురాకచేణ్ |
| ౩౯ | ౩౧ | పార్వతి దశరథునిఁ దనదు పతిగాఁ గోరెణ్. |
| ౪౦ | ౨౪ | బంగరు డబ్బి బు స్సనుచు బ్రహ్మపదంబును జేరి భాసిలెణ్. |
| ౪౧ | ౫౫ | భరతఖండమ! నీతపఃఫలమ కాదె? |
| ౪౨ | ౩౯ | భీష్ముం డంతట నంబవెంటఁ దిరిగెణ్ బృందారకుల్ నవ్వఁగన్. |
| ౪౩ | ౩ | భీష్ముని పెండ్లి కేఁగిరఁట పిన్నలు పెద్దలు బంధు లందఱుణ్. |
| ౪౪ | ౬౨ | మంచాలణ్ బిగియించె గుంజలకు నమ్మా! బింధియణ్ దేఁగదే. |
| ౪౫ | ౫ | మఠమున సన్న్యాసి యొకఁడు మానినిఁ గూడెణ్. |
| ౪౬ | ౩౫ | మఱపై యుండిన కోరికల్ పయికి రా ... ... |
| ౪౭ | ౬ | మారెడు గాయలోన నొకమానిని యుయ్యెల లూఁగఁజొచ్చెడిణ్ |
| ౪౮ | ౨౯ | మార్తాండుం డుదయించె నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్. |
| ౪౯ | ౬౩ | యువగర్వవిదారణో స్తహో తరళదృశా! |
| ౫౦ | ౭ | రంభ ఫల మెంత రుచియొ రసికుఁడె యెఱుఁగున్. |
| ౫౧ | ౩౪ | రత్నము లెన్నఁగ వార్ధి రత్నాకరుఁడే |
| ౫౨ | ౪౦ | రయమున నెంద్రకాయగుహరంబునఁ జీరె గజేంద్రుఁ డాహరిన్. |
| ౫౩ | ౩౩ | వచ్చీరాని పయోధరద్వయముతో ... ... |
| ౫౪ | ౧ | వికిరాన్నంబిడిపార్వతిణ్ శివుఁడుదాఁ బెండ్లాడె మోహాంధుఁడై. |
| ౫౫ | ౨ | విడిచి రెల్లరు బ్రాహ్మణ్యమా! వెళ్లిపొమ్మ. |
| ౫౬ | ౩౮ | విధవను జూచి భర్త యురివేసుక చచ్చెను జూడఁగా జనుల్. |
| ౫౭ | ౩౭ | వీడెఁ బతివ్రత నదేమొ విచికిలగంధీ! |
| ౫౮ | ౨౩ | వీర్యధ్వజు నుమ గనియె నని వివేకికిఁ దెలియుణ్. |
| ౫౯ | ౨౮ | శవముతో రతి సేయ నొక్కచాన జనించెణ్. |
| ౬౦ | ౨౫ | శారద కొక్కపార్శ్వమున సౌఖ్యము ముఖ్యమ? కుర్మతిప్రభూ! |
| ౬౧ | ౯ | శూర్పాగ్రంబున భాసిలెణ్ శుభజలస్తోమంబు కాసారముణ్. |
| ౬౨ | ౪౭ | సతులవిజ్ఞాన మే ప్రజాసర్వశక్తి. |
| ౬౩ | ౪౬ | స్తంభాగ్రంబునఁ గూరుచుండుటకు గ్రద్దా! పెద్ద వైనావటే? |

అవధానాములలో, పూర్వకవుల భావములు గాకుండ తాము పూరించిన సమస్య లని శాస్త్రిగారు పట్టిక వ్రాసి పెట్టుకొన్నవానిలో పూరణములు దొరకని వివి, (అక్షర క్రమమున.)

౧. అశ్వభుజా విజృంభణ మహా యనిపించె మృగేంద్రకోటికిన్.
౨. అశ్వముకొమ్ము త మ్మొరయ నార్చె నిశాచరనాథయూథముల్.
౩. కజ్జల జలములకు మిగులు కజ్జల మున్నే ?
౪. కలికికిఁ గనుబొమలు పదునొకండై తోఁచెన్.
౫. కాంతామణికుచముమీఁదఁ గాకర మొలిచెన్
౬. కాంతా! రమ్మనియెన్ యతీంద్రుఁడు వివేకప్రౌఢి దీపింపఁగన్.
౭. కాకర పువు పూచు నిమ్మకాయలు గాచున్
౮. కుటిలాలక యెడమకన్ను కుడికన్నాయెన్
౯. కొడవటిపిడి యర్ధరాత్రి కోడై కూసెన్
౧౦. కొడుకా! రతిసేయు మనుచుఁ గూఁతురు పిలిచెన్.
౧౧. క్రోడముఖంబు చిక్కెఁ దరుకోటరమందునఁ గోఁతిపిల్లకున్
౧౨. కోడలిరోజు లత్త కెటు కుంచిపంగ యత్నింతురో!
౧౩. చందవరంబులోన నొక చంపనగంధికి ... లేదు నూ!
౧౪. చెలియమొగంబుమీఁదమగచిన్నెలు గాంచెఁ బ్రియుండుః నవ్వుచున్.
౧౫. చెలువుగ రామలక్ష్మణులు సీతకుఁ దమ్ములు శంభుఁ డన్నయున్.
౧౬. జందెము లేని బ్రాహ్మణుఁడు జన్నము చేసె విచిత్రరీతిగన్.
౧౭ తండ్రీ! రమ్మని కౌఁగిలించె మగనిన్ దవ్వంగి మోహాంధయై.
౧౮. దీమంబుల్ పదివేలు చేరినను దీనిన్ బట్టఁగా శక్యమే ?
౧౯. నస్యం బించుక దెచ్చి నామదికి నానందంబు చేకూర్పవే.
౨౦. నాలుగు నాలుగున్ గలిసినన్ ధర నెన్మిది యైన చొప్పునన్.

౨౧. నీకంటెన్ మాత లెవరు నిజ మెఱుఁగ గిరా!

౨౨. పంకజము ప్రఫుల్లమయ్యె బాబూ! నిశిలోన్.

౨౩. పగదాయెరొ మనకు శీతభానుం డింకన్.

౨౪. పరహృదయవిదారణంబు పాపం బగునే?

౨౫. పర్వ తమః కామి పుష్పవతుల రమించెన్.

౨౬. పుంశ్చలి మీ కొసఁగుఁగాక పుత్రప్రాప్తిన్.

౨౭. పుంశ్చలి రమియించువారిపాలుపు దొలంగున్.

౨౮. ప్రస్ఫుటకీర్తిఁ దోఁచె నిశి భానుఁడు శీతమయూఖమాలియై

౨౯. భాష మెఱుఁగలేని నరుని బ్రతు కొక బ్రతుకే?

౩౦. భాష నశించు కారణము పండితులే గద యిజ్జగంబునన్.

౩౧. మగ్గులకట్టలోన నొకమానిని యున్నది మన్మథార్తయై

౩౨. మన్నించు టసంభవంబు మనసిజుఁ డబలా!

౩౩. ముల కర్మక్షితిఁ బుట్టి యెవ్వఁడు తపంబున్ జేయఁ డప్రాజ్ఞతన్?

౩౪. రంధ్రాగ్రంబున సోమయాజి నిలిచెన్ రాజీవపత్రాక్షితోన్.

౩౫. రమణికుచంబుమీఁద నొక ఱంపము కత్తియు రాజహంసమున్.

౩౬. రసికాగ్రేసరచక్రవర్తి కకటా! రాజ్యంబు లే దాయెఁగా!

౩౭. రాజమరాళకుంతలకు రాజితమధ్యగజేంద్రమధ్యకున్.

౩౮. రాముఁడు ధర్మమున్ జెఱచె రాజులు యోగులు సంతసింపఁగన్.

౩౯. వృషణంబుల్ తల కెక్కెఁ బండితులకున్ వృద్ధాప్యకాలంబునన్.

౪౦. శంఖంబుల్ దివినుండి క్రిందఁబడియెన్ జంభూఫలప్రక్రియన్.

౪౧. శునకం బయ్యెను జక్రి సంతసమునన్ సూర్యాదు లగ్గింపఁగన్.

౪౨. శ్రీమత్కుందనవోలుసీమ వెలయున్ శీతాంశుఁ డుష్ణాంశుఁడై.

౪౩. సంసారమె యోగివరుల సర్వస్వము సూ!

౪౪. సతి సతి గలియంగఁ బుత్త్రిసంతతి గలిగెన్.

౪౫. సీతకుఁ గృష్ణమూర్తిపయిఁ జెందిన ప్రేమయె తెచ్చె దుఃఖముల్.

# అవధానములు

## గా. వీరరాఘవశాస్త్రిగారు చేసిన అష్టావధాన శతావధానముల పట్టిక.

(దొరకినమట్టునకు దేశకాలములతో)

| కాలము | క్రమ సంఖ్య | గ్రామము | | అష్ట | శత |
|---|---|---|---|---|---|
| | | కర్నూలుజిల్లాలో | | | |
| 1913 | ౧ | ఎఱ్ఱగొండపాలెము. | | ౩ | |
| | ౨ | కర్నూలు ... | ... | ౧ | ౧ |
| | ౩ | సోమేపల్లి | మార్కాపురము తా. | ౨ | |
| 1914 | ౪ | కొలుకుల | ,, | ౩ | |
| | ౫ | బేస్తవారపుపేట | కంబము తా. | | ౧ |
| 1916 | ౬ | అన్నసముద్రము | మార్కాపురము తా. | | ౧ |
| | ౭ | ఎఱ్ఱగొండపాలెము. | ,, | ౧ | |
| | ౮ | మార్కాపురము. ... | | | ౧ |
| | ౯ | దోరణాల. | ,, | ౧ | ౧ |
| | ౧౦ | గంగుపల్లె | ,, | ౧ | |
| | ౧౧ | ఎగువ చెర్లోపల్లె | ,, | ౧ | ౧ |
| | ౧౨ | కంబము. | | | ౧ |
| | ౧౩ | రావిపాడు | కంబము తా. | | ౧ |
| | ౧౪ | తురిమెళ్ల | ,, | ౧ | |
| | ౧౫ | కాకర్ల | ,, | ౧ | |
| | ౧౬ | అర్ధవీడు | ,, | ౧ | |
| | ౧౭ | ద్వైవము దిన్నె | పత్తికొంత తా | ౧ | |
| | ౧౮ | గోవిందపల్లె. | ఆళ్లగడ్డ తా. | ౧ | |
| | ౧౯ | చండ్లూరు | ,, | ౧ | |

| కాలము | క్రమ సంఖ్య | గ్రామము | | అష్ట | శత |
|---|---|---|---|---|---|
| | ౨౦ | నంద్యాల. | | ౧ | |
| | ౨౧ | రేవణూరు | నంద్యాల తా. | ౧ | |
| 1917 | ౨౨ | మద్దూరు | ,, | ౧ | |
| | ౨౩ | రుద్రవరము | ఆళ్లగడ్డ తా. | ౧ | |
| | ౨౪ | పార్లపల్లె. | పత్తికొండ తా. | ౧ | |
| | ౨౫ | మట్టీడు | ,, | ౧ | |
| | ౨౬ | వెలంపల్లె | మార్కాపురము తా. | ౪ | |
| | ౨౭ | దూపాడు | ప్రత్తికొండ తా. | ౧ | |
| | ౨౮ | గూడూరు. | ,, | | ౧ |
| 1919 | ౨౯ | గుండు పాపాల. | కోయిలకూట్ల తా. | ౧ | |
| | ౩౦ | ఔకు. | ,, | ౧ | ౧ |
| | ౩౧ | కోయిలకుంట్ల. | ... | ౧ | ౧ |
| 1937 | ౩౨ | వెల్దుర్తి. | డోన్ తా. | ౧ | |
| 1938 | ౩౩ | కర్నూలు. | ... ... | | ౧ |
| | | నెల్లూరుజిల్లాలో | | | |
| 1915 | ౩౪ | వేంకటాపురము | పొదిలె తా. | | ౧ |
| | ౩౫ | తర్లుపాడు | ,, | ౧ | |
| | ౩౬ | పొతకమూరు | ,, | ౧ | ౧ |
| | ౩౭ | పొదిలె | ... ... | ౧ | |
| | ౩౮ | కావలి. | ... ... | ౧ | |
| 1916 | ౩౯ | పంటలల్లూరు. | ... ... | | ౧ |
| | ౪౦ | దొనకొండ | ... ... | | ౧ |
| | ౪౧ | నెల్లూరు. | ... ... | ౧ | ౧ |
| | ౪౨ | తర్లుపాడు | పొదిలె తా. | ౧ | |
| | ౪౩ | చందలూరు | ,, | ౧ | |
| | ౪౪ | కురిచేడు | ,, | ౧ | |
| | ౪౫ | నాగేళ్లమడుగు | ,, | ౧ | |

| కాలము | క్రమ సంఖ్య | గ్రామము | | అష్ట | శత |
|---|---|---|---|---|---|
| | ౪౬ | అనంతవరము | పొదిలె తా. | ౧ | |
| | | గుంటూరుజిల్లాలో | | | |
| 1915 | ౪౭ | గుంటూరు. | ... ... | ౧ | |
| | ౪౮ | తెనాలి. | ... ... | ౧ | |
| | ౪౯ | బాపట్ల | ... ... | ౧ | |
| | ౫౦ | పేరుకలపూడి. | తెనాలి తా. | ౧ | |
| | ౫౧ | కరవది | ఒంగోలు తా. | ౧ | |
| | ౫౨ | అద్దంకి | ,, | ౧ | |
| | ౫౩ | అనమనమూరు | ,, | ౧ | |
| | ౫౪ | నాగులవరము | వినుకొండ తా. | ౧ | |
| | | అనంతపురముజిల్లాలో | | | |
| 1917 | ౫౫ | ధర్మవరము. | | ౧ | ౧ |
| | | బళ్లారిజిల్లాలో | | | |
| 1917 | ౫౬ | ఆదవాని. | | ౧ | ౧ |
| | | చిత్తూరుజిల్లాలో | | | |
| (?) | ౫౭ | తిరుపతి | ... ... | | ౧ |
| | | నైజాం లో | | | |
| | ౫౮ | క్రొత్తకోట | మదనపల్లి తా. | | ౧ |
| 1916 | ౫౯ | గద్వాల | ... ... | ౧ | |
| | ౬౦ | సికందరాబాద్. | ... ... | ౨ | |
| | ౬౧ | దోంతి (సంస్థానము.) | ... ... | ౧ | |
| | ౬౨ | నిజాంబాద్ (ఇందూరు) | ... ... | | ౧ |
| | ౬౩ | లద్దగిరి. | ... ... | | ౧ |
| | ౬౪ | వరంగల్లు | ... ... | ౧ | |
| | ౬౫ | మనికొండ | ... ... | | ౧ |

| కాలము | క్రమ సంఖ్య | గ్రామము | అష్ట | శత |
|---|---|---|---|---|
| | ౬౬ | భువనగిరి. ... ... | ౧ | |
| | ౬౭ | ఇందిరాల ... ... | ౧ | |
| | ౬౮ | అలంపూరు ... ... | ౧ | |
| | ౬౯ | కొల్లాపురము. ... ... | | ౧ |
| | | మైసూర్ ఇలాకా. | | |
| 1927 | ౭౦ | కవునిపల్లె. ... ... | ౧ | |
| | ౭౧ | బండపల్లి. ... ... | ౧ | |

—: శాస్త్రిగారిరచనలు. :—

గా. వీరరాఘవశాస్త్రిగారు గద్య పద్య గ్రంథము లెన్ని వ్రాసిరో సరిగా లెక్క దేల్చి చెప్పుట కింకను గొంత పరిశోధింపవలసి యున్నది. ప్రకృతము తెలిసినమట్టునకు రచించిన యాశుప్రబంధములును, చెప్పిన ఘంటాశతములును, వ్రాసిన యితర గ్రంథములును కొన్ని. వీనిలో కొన్ని ముద్రితములైనవి, కొన్ని అముద్రితములుగానే యున్నవి. ముద్రితములలోను గొన్ని ప్రకృత ముపలబ్ధములు గాకున్నవి.

* ఈగుర్తు పెట్టినవి ముద్రితములు.

—: ఆశుప్రబంధములు. :—

౧ *అహోబలమాహాత్మ్యము. ౫ ఆ. 1919 గుండుపాపాలలో కర్నూల్ జిల్లా

౨ సత్యనారాయణస్థలపురాణము. (?) రుద్రవరములో ,,

3 *త్రిపురాంతక స్థలమాహాత్మ్యము. 3 ఆ 1933 త్రిపురాంతకములో ,,

౪ *మార్కండేయచరిత్రము(హరికథ.) ,, పేరాయపల్లెలో ,,

—: ఘంటాశతములు. :—

౫ * రామభూపతి శతకము. 1914 జేస్తవారపు పేటలో కర్నూల్ జిల్లా
౬ * దీనకల్ప ద్రుమశతకము. 1916 కొలుకులలో ,,
౭ * విశ్వేశ్వరశతకము. 1917 దూపాటిలో ,,
౮ సోమేశ్వరశతకము 1919 గుండుపాపాలలో ,,
౯ చెన్నకేశవశతకము (?) మార్కాపురములో ,,

—: ఇతరములు. :—

౧౦ సాంబలక్షణ. 3. ఆ. శృంగారకావ్యము
౧౧ * ఆర్యద్యాప్రబోధిని.
౧౨ * భగవద్గీత, ద్విపద.
౧౩ * ముకుందమాల. (ఆంధ్రీకరణము)
౧౪ * పింగళ హరికథ.
౧౫ హైమవతీ పరిణయము
౧౬ భూ గంగాస్తుతి.
౧౭ *సత్య వరలక్ష్మీ ధ్రువచరిత్ర. (విద్వాన్ బి. ఓ. యల్ కోర్సు 1947, 48, 49).
౧౮ మార్కండేయ నాటకము.
౧౯ సీతాకళ్యాణము, ద్విపద
౨౦ సీతారామ కల్పద్రుమశతకము.
౨౧ వేంకటేశ్వరశతకము.
౨౨ కుమార సుబ్రహ్మణ్యచరిత్ర.
౨౩ మెదకు సంస్థానాధీశుల చరిత్ర (వచనము.)
౨౪ హరివంశము. (వచనము. కొంత.)
౨౫ ఐరావత వ్రతకథ. (వచనము.)

గ్రంథరూపములుగా నున్న వివియేగాక, వివిధ సందర్భములలో వ్రాసిన పద్యములు వేల కున్నవి.

బుచ్చిరెడ్డిపాలెము, ఔకు, దైవముదిన్నె, అనంతవరము మున్నగుచోట్ల ఆశురచనలు చేసినట్లు వ్రాసికొని యున్నారు. అక్కడ చెప్పిన వేవియో! లేకున్న, పై గ్రంథములలో నేవియైన అయియుండవచ్చునో!

అహోబలమాహాత్మ్యము, మార్కండేయ చరిత్రము (హరికథ) ఈగ్రంథములు (వీరరాఘవ సుబ్బరామకవులని) ఉభయకర్తృకములుగా నున్నవి. రాఘవశాస్త్రిగారి వెంట గోపాలుని సుబ్బరామకవి అనుయాయిగా నుండెడివాఁడు. సుబ్బరామకవికి మీసాలకవి యని దైవముదిన్నె మున్నగుచోట్ల ప్రసిద్ధి. ఈయన యువ సం. కార్తిక బ౧౧ స్థిర వారము (16-11-1935) గతించెను.

రాఘవశాస్త్రిగారు వ్రాసినవి యీగ్రంథములే గాక త్రిలింగ, అభినవసరస్వతి, దివ్యవాణి, కల్పవల్లి, గోల్కొండ మున్నగు పత్రికలలో అనేక విషయములనుగుఱించి వ్రాసిన వ్యాసములు విషయప్రధానము లైన వెన్నియో గలవు. ఏవిషయ మెత్తుకొని వ్రాసినను కూలంకష విమర్శనములతో నిండియుండు నని పాఠకులు గమనింపఁ గల్గుదురు.

1940 ఆగష్టులో రాఘవశాస్త్రిగారు బ్రహ్మశ్రీ చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రిగారికి (గుంటూరు) పద్యలేఖ వ్రాయుచు అందులోఁ దమరచనలను, వాని పరిస్థితులను గుఱించి

సీ. మసిపాతకన్నను పసి దప్పి ముద్రణ
కుద్రేక మడిగిన వొక్క కొన్ని
జీర్ణపత్రములలో జీర్ణించి క్రిములచే
ఒష్టంబులైన పాత్రములు కొన్ని
ఆశవు లందంద హ్రాస్వమయ్యును జిక్కి
యున్నవి వేనవే లొక్క కొన్ని
పత్రికాంగనలలోఁ బ్రచురణ కని యేఁగి
చెరసగ మాచు నిల్చినవి కొన్ని

తే. హరిహరీ! వీరరాఘవవరకవీంద్రు
సరసరచనానితంబినుల్ సభలఁ బ్రభుల
నయన హస్తావలగ్నలై నాట్యమాడు
సమయ మేనాఁటికో యనుజా! యెఱుంగ.

చ. గత మటు లుంచు; నేఁడయినఁ గా దన నేల? ద్వినైకగ్రంథవి
స్తృతి కిసుమంతయేఁ వెనుకఁదీయదు లేఖిని; యాశుధారయున్
గొతుకదు, క్రుంగిపోవదు; వినూత్నవికాసవిశేషవైఖరీ
గతులను మించు; నిట్టి కృతికన్యల ధన్యత కేమి మార్గమో!

అని వ్రాసియున్నారు. ఈ వ్రాఁతనుబట్టి శాస్త్రిగారి రచనా విశేషములును, వానికిఁ బట్టిన దశలును, తదుద్ధరణావేదనయును దెల్ల మయ్యెడిని. ఉచితజ్ఞులగు భాషోద్ధారకు లుండక పోరు. కాని శాస్త్రిగా రావేదనపడినట్లు లాసమయ మేనాఁటికో! కాల మున్నది! ఘటకు లున్నారు! జీవన్ భద్రాణి పశ్యతి!

—: పండిత ప్రకాండ ప్రశంసలు. :—

వస్తుగుణము ప్రశస్తమై యున్నపుడు వలదనుకొన్నను ప్రశంసలు వచ్చి పడకతప్పవు. అట్టిప్రశంసాసందర్భమున వశ్య

వచస్కులగు పండితకవులు హృదయంగమాభిప్రాయమును పట్టిమాటలతోఁ గాక ఛందః ప్రభావముతో శాశ్వతప్రతిష్ఠితము చేయఁగల్గుదురు. అనుగ్రహేచ్ఛ గలిగెనేని నిర్జీవ ప్రతిమలకే లేనిచైతన్యమును జేకూర్పఁగల కవిబ్రహ్మలకు సజీవచిత్రములను చక్కదిద్దుట యెంతపని ?

రసమును పుక్కిలించు రాఘవశాస్త్రిగారి కవితా వైదుష్యము లీర్ష్యాళువుల కీసడింత పుట్టించునేమోగాని రస లుబ్ధులచేఁ బ్రశంస లందుకొనుటలో సందేహము లేదు. అవధానములు, ఆశుకవితాప్రదర్శనములు, గ్రంథరచనలు మున్నగు సందర్భములలో పండితకవు లనేకులు ప్రశంసించి చెప్పిన ప్రశంసాపద్యములే పెక్కులు గలవు. అంతు చిక్కని వెన్ని యున్నవోగాని యుపలబ్ధము లైనమట్టున కవసరోచితము లైనవి కొన్నిటిలో కొన్ని.

బ్రహ్మశ్రీ. రాళ్లభండి నృసింహశాస్త్రిగారు.
(శాస్త్రిగారి వేదవిద్యాగురువులు)

(ఎఱ్ఱగొండపాలెము, మార్కాపురము తాలూకా.)

ప్రమాదీచ వైశాఖములో (1913) తమయధ్యక్షత క్రింద జరిగిన ప్రథమాష్టావధానాంతమున ప్రశంసించి విజయ యాత్రార్థ మాశీర్వదించిన పద్యము.

చ. నవరస భావవైఖరి, మనఃప్రియ శయ్య, యలంక్రియార్థ గౌ
రవములు గల్గి, దుష్కవుల రాపిడి కోర్చి, తృణీకరించి, స
త్కవు లలరన్ రసజ్ఞసుఖదాయిని యయ్యెను గాడెపల్లి రా
ఘవుని కవిత్వకాంత కసుగందదువో యెవ రెంత లాగినన్. ౧

## బ్రహ్మశ్రీ మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
### (శాస్త్రిగారి కావ్యగురువులు.)

(ప్రకృతము ఆళ్లగడ్డ. కర్నూలుజిల్లా.)

నల సంవత్సరాదినాఁడు (1916) దొనకొండ (నెల్లూరు జిల్లా) లోఁ దమ యధ్యక్షతక్రింద జరిగిన శతావధాన సందర్భములో

శ్లో. జన్మాంతరాదృష్టవశానుయాత విద్యావశే ర్హృద్యకవిత్వభాజః,
నిమిత్తమాత్రం తవ శిష్యరత్న ! వయం గురుత్వస్య పదే నిషణ్ణాః ౧

శ్లో. దృష్ట్వాఽవధాన మనవద్యవిధానహృద్య
మానంద మేతి హృదయం వచసా మతీతమ్,
ఏత త్సుధారస మనోహర వాగ్ఝరీభి
ర్గ్రంథాన్ కురు ద్రుత మనల్పకథావిచిత్రాన్. ౨

శ్లో. విద్వత్కర్ణ గుళుచ్ఛికాయిత వచో ధారాళ ధారాంచితైః
రాజద్రాజ సభా నిరంకుశ యశః ప్రాప్తి ప్రమోదాన్వితః,
ఛాత్ర జ్ఞాన కృతాదర స్స్వయశసా సంక్షాళితాశావ్రజో
వత్స ! త్వం శతవత్సరా న్నయ మనోహృద్యై స్సుపుత్రై ర్యుతః. 3

శా. ప్రారంభించిరి నాదుసన్నిధిని గావ్యం బెందఱో; వారిలో
నీరీతిన్ కవివై మఱిన్ శతవధానేచ్ఛన్ సభన్ జేసి, యీ
ధీరోత్తంసులు మెచ్చ, ధారణయు సందీపింపఁ, బద్యంబు లిం
పారన్ జెప్పుచుఁ గీర్తిఁ గొంటి; ఇది మా కానందమున్ గూర్చెడిన్.

ఉ. ఎన్నఁడు వచ్చు రాఘవుఁ, డిఁకెన్నఁడు నీయవధానకార్య మ
భ్యున్నతి గల్గఁ, బండితు లహో యనఁ, జేసి ముదంబుఁ గూర్చు, నిం

కెన్నఁ డిఁకెన్నఁ డంచు మది నెంచుచు నుండఁగ నీసభాస్థలిన్
సన్నుతరీతి సల్పితివి; చాల ముదంబు జనించె రాఘవా !. ౫

ఉ. ధారణ దప్పకుండ నవధాన మొనర్చుట కష్ట మంచు నీ
ధీరులు పల్కుచుండ నిదె ధీబల మొప్ప నొనర్తు నంచు నీ
భారముఁ బూనినాఁడు, కన, బాలుఁడు; చేయఁగలాఁడె ? యంచుఁజే
కూరిన శంకలన్ వెడలఁ గొట్టితి విచ్చట శిష్యరత్నమా ! ౬

చ. అమరధునీతరంగ వికచాంబుజ కుంద ద్రవ న్మఘాళికా
సమ సుకవిత్వ సంపదఁ బ్రశస్తిని గాంచిన శిష్యు లీవిధిన్
సుమహితరీతిఁ గట్టెదుట సల్పఁగఁ జూడఁగలట్టి భాగధే
యము గలదయ్య ? దేశికుల కందఱకున్ బరికించి చూడఁగన్. ౭

చంపకమాల :— ౨౮ గీట్లు.

తిరుపతి వేంకటేశ్వర సుధీవరు లొక్కవిధానఁ గైత క
త్యురుతర నూత్నదోహద మహోత్సవముల్ జరిపించి మించి యి
త్తరుణమునందుఁ బెల్లుగ వధానము లెల్లెడఁ జేఁయుచుండ, సం
బరపడి యెంతవారలును బ్రస్తుత కాలమునందు నెల్లెడన్

బురములఁ బల్లెలందుఁ గడుఁ బూనికతోడ శతావధాన మ
త్యురుతరశక్తిఁ జేయుదు, మహో యనఁ జేయుదు మంచుఁ జాటి యా
బ్బురపడఁ జేయుచుండ, నిట పోలినవాఁడు స్వదేశమందు నొ
క్కరుఁడును లేకపోయె నని కుందుచు నుండఁగ, నేఁడు పండితా

దరమును గాంచువాఁడు, నయతత్పరుఁడున్, మఱి మాదుశిష్యుఁడై
పరగినవాఁడు, గాంగఝరపద్ధతి నాశువుఁ జెప్పువాఁడు, ని
ర్భరమతిశాలి గాడెపలి రాఘవుఁ డొక్కఁడు గానుపించె; మే
ల్తరగతి గాఁగ నీశతవధానము నేఁ డొనరించి చూపె; బా

పురె! కొఱంతల్ దొరంగెఁ; గడు మోదము గల్గెను; గీర్తి దక్కెఁ; నీ
వరుసకు వచ్చు నంచు విని 'వత్స! యొనర్పు శతావధాన మే
మరుదుగఁ జూడఁగోరితిమి, యట్టులె డాక్టరుగారు, నీసభా
వరులును సంతసం బనెడు వార్ధిని దేలఁగలా' రటంచుఁ జె
ప్ప రహి వహించి సల్పితివి; వహ్వారె! నీకవితాసుధాగ వి
స్ఫుర దరవింద జాల మధుపూర రసంబులఁ ద్రోచి, మేటిభూ
ధరముల ధిక్కరించు వనితాకుచమండలి నొత్తు బుచ్చి, య
ద్దిరె యనిపించె; మిక్కిలి సుధీజనమోదముఁ గూర్చె; నింక భూ
వరుల సభాస్థలంబులను వర్ధిలవోయి సుగౌరవంబులన్,
బరపఁగదోయి కీర్తిసుధ, భవ్యవచఃకుసుమంబులన్ బరా
త్పరుని యజింపవోయి, గుణవంతులఁ బుత్త్రులఁ గాంచవోయి యా
దరమున నిన్నుఁ బ్రోచు సతతంబును నాపరదేవి రాఘవా! ౮

## ధ్రువచరిత్ర వ్రాసినపుడు (1941.)

శ్లో. భాస్వత్పన్నగమాళి రత్న కిరణ ప్రాగ్భార హాస్యం ముహుః
కృత్వా, హైమశిలోచ్చయస్య సుషమాం హత్వా చ విస్ఫూర్జితామ్,
పీత్వా గోపుర గోపురాగ్ర విచల ల్లావణ్య పాథోనిధిం
విద్వద్వందిత! వీరరాఘవకవే! జాగర్తి తే సద్యశః. ౯

శ్లో. గుణోత్తరా మక్షరరూపికాం స
ద్వృత్తా మలంకారయుతాం సుభావామ్,
త్వత్కావ్యకన్యా మవలోక్య లోకే
కో వాఽధరాస్వాదరుచిం న వేత్తి? ౧౦

మ. శతఘంటా కవితాప్రచారమును మత్సాన్నిధ్యమం దద్భుత
ప్రతిభన్ ముందొనకొండలోఁ బొగడితిన్ బ్రస్తవ్య మయ్యారె యం;

చతి బాల్యంబు బది; నేఁడు నీధ్రువకథాసద్గ్రంథముల్ జూచితిన్;
క్షితినాథస్తుతిపాత్ర మయ్యె వరలక్ష్మీనామసందీప్తమై. ౧౧

చ. ప్రతిభ కొకింత పొత్తమును బట్టి పఠించితి వీవు; శిష్యసం
తతి కనురాగ కందళ మితం డనుకీరితి నాకు దక్కె; న
ద్భుత మగుశక్తి నీ కొదవెఁబో వరశాంభవిసత్కృపన్ బర
శ్యత కృతి కల్పనాభ్యుదయసంపదచేఁ దులఁ దూఁగు రాఘవా! ౧౨

## బ్రహ్మశ్రీ శతావధానులు, తిరుపతి వేంకటకవులు.

ఉ. రాఘవశాస్త్రి! యుష్మదభిరామకవిత్వపటుత్వ ధాటి యా
రా! ఘనపద్ధతిన్ గని, పురారి జటా పటలానట త్తరం
గౌఘ వియద్ధునీ ఘుమ ఘుమార్భటులన్ నిరసించి మించెఁబో
శ్లాఘనఁ జేసి మెచ్చఁదగు చాడ్పున హెచ్చయి మించునేర్పునన్.
(తి. శా.) ౧

చ. భవ దసమాన వాక్యశరపంక్తులు నొక్కట నేఁగుదేరఁ, గా
కవిప నిశాచరుల్ వదనగహ్వరముల్ నెఱ విప్పి దీనులై
తవ తవ లాడి మూలలను దాఁగక యుందురె? గాడెపల్లి రా
ఘవ కవి! మిత్రహృద్విమలకంజరవీ! సరసోల్లసద్గవీ! ౨

క. శ్రుతిసంహితావిదుండవు
మతిమంతుండవు కవిత్వమంజుల మేధా
న్వితుఁడవు సాహిత్యధృత
వ్రతుఁడవు వినుతింపఁదగవె? రాఘవశాస్త్రీ!
(వేం. శా.) 3

## బ్రహ్మశ్రీ అభినవతిక్కన దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు.

(నెల్లూరు.)

1916 జూన్ 26 వ తేది నెల్లూరు టౌన్‌హాలులో బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరావుగారి యధ్యక్షత క్రింద జరిగిన శతావధానము ముగిసిన తరువాత

చ. ఇరువదియైదువత్సరము లేడ ? గుణోజ్జ్వలదాశు వా క్చమ
త్కరణ శతావధాన కవితా పరిపాకరసం బి దేడ! మీ
గురుతర పాండితీపటిమకున్ గిరిపుత్రి కృపాకటాక్షవి
స్ఫురణము కారణం బనుచుఁ బోలఁ దలంచెద వీరరాఘవా! ౧

తే. తోఁచు నొకచోట, నొకచోటఁ దోఁపకుండు
సరస సందర్భ మవధానసమయమందు;
ఏటి కీకొద ? నిలుఁ ః డఁ గృతులు వ్రాసి
గడన సేయుము కీర్తి రాఘవమనీషి! ౨

ఉ. ఆరయ సంస్కృతాంధ్రములయందు నిరర్గళ సాహితీ చమ
త్కారము మీకుఁ గల్మి యవధానమునందు ప్రకాశమయ్యె; మీ
సార కళాప్రవీణతకుఁ జాలిన గ్రంథము నొండు వ్రాసి వా
ణీ రమణీ కటాక్షసరణిన్ జరితార్థము గాంచు మర్వరన్. ౩

ఉ. గాలికిఁ బోవు పద్యములె గా కవధానములందు నెట్టి ధీ
శాలికినైన భావ రస సంభృత వాగ్రచనల్ ఘటిల్ల; వీ
లీలఁ బ్రబంధశైలులకు లేశము తగ్గక ప్రజ్ఞఁ జూపు వా
చాలత మీ పరాంబికయె సత్యము గా నిడె వీరరాఘవా! ౪

చ. ఎరుఁగనివారి యల్లరుల కేమి ? సమగ్రరసోత్తరంబు గా
నిర వగు పద్య మొండు రచియించిన మెచ్చరె విద్వదగ్రణుల్ ?
సరసత మీకవిత్వమున సర్వవిధంబుల నొప్పుచున్న; దీ
సరణిని జూచి సత్కృతు లొసంగఁగలేని రసజ్ఞు లుందురే ? ౫

## బ్రహ్మశ్రీ శతావధాని పిశుపాటి చిదంబరశాస్త్రిగారు.

(కరవది, ఒంగోలు తాలూకా)

ఈగ్రంథభాగమున 28 వ పుటలో నున్న రెండు పద్యములేగాక మఱిరెండు.

ఉ. శ్రీపతి దివ్యపాద సరసీరుహ నిర్య దమర్త్య దీర్ఘికా
టోప జవాతిమంజుల పటుస్ఫుటనాద వచః పరంపరా
రోపిత కీర్తిచంద్రికల రోదసి నించుచు సంచరించు గా
జేపలి వీరరాఘవుని శేవిని గాంచితిరే సభాసదుల్ ! ౧

ఉ. ఓఘు తరంగ సంఘ సముదగ్ర పరిస్ఫురిత ప్రభావ వి
ద్యా ఘనతావిశేష సముదారమహోర్భటి వేగ నిస్సర
ల్లాఘవమై నిరర్గళ విలాస కళా రమణీయమైన మా
రాఘవశాస్త్రి కావ్యము నిరంకుశ మన్నను లోప మున్నదే ?. ౨

బాలసరస్వతి శ్రీమాన్ బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులవారు

(నైజాం, ఆత్మకూరు సంస్థాన విద్వాంసులు.)

వీరు చెప్పిన ప్రశంసాపద్యము లీగ్రంథములో 24 వ పుటలో నున్నవి. అటఁ జూచునది.

బ్రహ్మశ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు.

(లలితాకుటీరము, సికందరాబాద్.) (16-1-1938.)

క. అవిరళ గంగా వీచీ
ప్లవమాన విలాస భావ పావన మగు మీ
కవితాప్రవాహతటముల
నవగాహింపంగ నబ్బె నని హర్షింతున్. ౧

క. మేఘము స్మృతిఁ దవులును భవ
దోఘప్రాగాంధ్ర సంస్కృతోభయభాషా
లాఘవ కవితాయత ధా
రా ఘనభర మఱమునపుడు రాఘవశాస్త్రీ !. ౨

బ్రహ్మశ్రీ అష్టావధాని ఉప్పల పిచ్చయ్యశాస్త్రిగారు
(సోమేపల్లి, మార్కాపురము తాలూకా.)

సీ. శ్రీ భారతుల నరసింహశాస్త్రి కృపాక
టాక్షామృత రసాప్తి నంకురించి
భగవత్యుపాసనాబలముచేఁ గ్రొంజాయ
లంతంత కెదుగ మాఁకాకు వేసి
దైవముదిన్నె రామావనీపతిసభా
కాయమానమునందుఁ గలయ నల్లి
గద్వాల మొదలుగాఁ గల నృపాగ్రణులయా
స్థానమధ్యములఁ బుష్పములు పూచి
తే. ఇపుడు పరిణత ఫలతతు లెసక మెసఁగఁ
దనరు చున్నది నీ కవిత్వమృదులతిక
గాడెపల్లి మహాన్వయ కంధి చంద్ర!
ఘన సుగుణ సాంద్ర! వీరరాఘవ కవీంద్ర!

సీ. వ్రాసినాఁడవు కవివ్రాతచిత్తానంద
కరములై తనరారు గ్రంథములను
వేసినాఁడవు శేముషీవిశేషాప్తి భూ
ధవుల సన్నిధి నవధానములను
కోసినాఁడవు వాదఘోరాసిధారచేఁ
గుకవి గర్వలతానికుంజములను
పూసినాఁడవు హరిదూర్భరికుడ్యములందు
ధవళోరుకీర్తి సుధారసంబు
తే. వేసినాఁడవు గళసీమ వేలకొలఁదిఁ
బ్రకట బిరుదాంకితములైన పతకములను

నీకు సరి యెవ్వ రీ ధరణీతలమున ?
గాడెపలి వీరరాఘవ కవివరేణ్య !. ౨

ఉ. కాకవి గర్వభూరుహ నికాయము వేళులతోఁ బెకల్చి, భ
ద్రాకర భూభృదీశ నికపైకవిహారిణియై నిరంతరా
స్తోక రసాతిరేక రయ శోభితయై కవివంద్యయై తగెన్
నీకవితాసరస్వతి మనీషివతంసమ ! వీరరాఘవా ! ౩

మత్తేభమాలిక :— ౧౨ గీట్లు.

ఒకచో శంభు జటాటవీ పరిలుఠ ద్ద్యోవాహినీ నిర్మలో
ర్మి కదంబ స్ఫుట నర్తనక్రమ జవా సేయ ప్రమేయంబు, వే
ఱొకచో నిస్తుల గోస్తనీ ఫల గుళుచ్ఛోద్భూత మాధుర్య, మిం
కొకచో శారద చంద్రమః కిరణ నిష్ఠ్యూతాంబు సంపర్క సా
ధక తాదాత్మ్య ద్రవీభవ చ్ఛశి శిలాంతర్వాహినీ వీచికా
నిక రావేగ వికర్షమాణ తటభూ నిక్షిప్త సప్తచ్ఛదో
త్థ కన చ్ఛీతల వాలుకా శకల శైత్య స్నిగ్ధ సౌరభ్య, మొ
క్కొకచో యౌవన ఘూర్ణ లోల నయనాన్యోన్యాపకర్ష క్రియా
ధిక పీన స్తన కర్కశత్వము కడుం దీపింప, శబ్దాగ్ర చి
త్ర కళాకౌశల ముల్లసిల్లఁ బటు ధారా ధోరణీ ధారణా
స్వకపోలోచిత కల్పనా చతురమై భాసిల్లు నీకైత సా
ర్థకమై వర్ధిలు వీరరాఘవ కవీ ! ప్రత్యర్థి భూభృత్పవీ ! ౪

## బ్రహ్మశ్రీ శతావధాని ఉప్పల. వేంకటశాస్త్రిగారు

(ముడివేముల, మార్కాపురము తాలూకా.)

సీ. పదసౌష్ఠవమునకుఁ బ్రతిభ మతింత గ
ల్గింపఁజాలెడి కుంటులేని నడక

మంజులధ్వనికి సమంజస మగు మైత్రి
గూరుపఁ జాలు గంభీర భావ
మభినవ రసిక జనాళికిఁ దనశైలి
నేరిపించెడి యలంకార మహిత
చంపకోత్పల మృదు శయ్యా విరాజిత
ధరణీ పురందర దర్శనీయ

తే. రాణ్మహేంద్రాధిపుని మందిరమునఁ గవి ని
లింపనాథులచేత లాలింపఁబడిన
కావ్యకన్యక ప్రేమ నీకరముఁ బట్టె
గాడెపలి వంశ్య! వీరరాఘవ మనీషి!. ౧

చ. నిరుపమ సత్కవిత్వరమణీమణి నుచ్చరకొట్టి దానితో
సరసము లాడు నేరుపు రసజ్ఞశిఖామణి! నీకుఁ దప్ప నె
వ్వరికిని లేదు నిక్కముగ; వహ్వా రె కాకవి దుర్మదాపహో
త్కరచణ రాఘవాభిధ! సుధాకరశశ్వదనూన సద్యశా! ౨

ఉ. నవ్య కవిత్వతత్త్వకలనఙ్ గడిదేతి, రసప్రధాన స
త్కావ్యతతిఙ్ రచించు కవికాంతులు నూర్లకొలందిఁ గల్గినఙ్
భవ్యయశోవిశాల! జనపాల బహూకృతపాత్ర! మిత్ర! నీ
కావ్యమె నవ్య, మగ్రరసిక స్తవనీయము రాఘవాభిధా! ౩

## బ్రహ్మశ్రీ శతావధాని గౌరావఝ్ఝల. రామకృష్ణశాస్త్రిగారు

(కర్నూల్ మునిసిపల్ హైస్కూల్ తెలుఁగుపండితులు.)

సీ. ఆశుధాశాకవిత్వాతి నైపుణిఁ జాటుఁ
గలము సాఁపక వ్రాయఁ గలుగు ధాటి
రసవత్ప్రబంధ నిర్మాణశక్తిని జాటు
నవనవాలంకరణప్రసక్తి

సర్వంకషప్రజ్ఞఁ జాటు నూతనభావ
శబ్దార్థయోజనసాహసంబు
శతవధానవిధాన చాకచక్యముఁ జాటుఁ
బ్రౌఢ దీర్ఘ సమాస పాటవంబు
తే. గద్దవాలాది ధారణీకాంతసన్ని
ధానకీర్తి నిధాన విద్యాప్రసంగ
సంగతిని జాటు బహువిధస్వర్ణరచిత
కంకణావళి వీరరాఘవ కవీంద్ర!. ౧

## బ్రహ్మశ్రీ విద్వాన్ మేడవరము సత్యనారాయణశాస్త్రిగారు

(కడప మునిసిపల్ హైస్కూల్ తెలుఁగుపండితులు.)

క. సద్యః పరనిర్వృతిదము
లుద్యదలంకార గుణగణోత్కృష్టంబుల్
హృద్యములు భవద్విరచిత
పద్యము లతిరసము లనఘపదభావంబుల్. ౧

ఉ. ధారల రాహువక్త్ర హిమధామ నిరర్గళ నిర్గళ త్సుధా
ధారల శారికా ముఖ విదారిత చూత మరంద శీకరా
సారల నన్నవ ప్రసవసాయక సాయక నాయకాసవో
దారల నద్దిరా! యనక తప్పదు గీష్పతికేని సత్కవీ! ౨

## బ్రహ్మశ్రీ కాసలనాటి సుబ్బారాయకవిగారు

(కొలుకుల, మార్కాపురము తాలూకా.)

చ. పరిణత గోస్తనీ రుచిర భావము లెన్నఁగ నేల? సర్వతో
భిరుచుల పాఠకోత్తములఁ బిల్చుచు వింపొనరించు; నిట్టి మీ
విరచన లెందుఁ జూచినను వేనకు వేల్ లిటు వ్రాయు నేర్పు నె
వ్వరు గిరి గీచి చెప్పి? రది ప్రాక్తన పుణ్యమ గాక దేశికా! ౧

## బ్రహ్మశ్రీ విద్వాన్ సంగుభొట్ల నరసింహశాస్త్రిగారు
(కర్నూల్ కోల్సు మెమోరియల్ హైస్కూల్ పండితులు)

ఉ. భావము లుల్లసిల్లఁ, బదబంధము మైత్రిని వీడకుండ, న
ర్థావళిసంగ్రహంబు సముదంచితపద్ధతి జాఱకుండ, నా
నావిధపాత్రపోషణ మనౌచితిజుష్టము గాకయుండ మో
దావహ మయ్యె నీకవిత యద్దిర! రాఘవశాస్త్రి సత్కవీ! ౧

సీ. ఒకమాఱు నన్నయ సుకవిచందంబున
నక్షరరమ్యత నాదరించి
ఒకమాఱు శ్రీనాథునకు సాటి యౌ నన
ప్రౌఢ దీర్ఘ సమాస ఫక్కిఁ జూపి
ఒకమాఱు పోతన కొజ్జయౌవిధమున
సమాజధారాశుద్ధిఁ జక్కదిద్ది
ఒకమాఱు పెద్దన కుద్దియౌ యనునట్లు
జిగిబిగికైతలఁ జేర్చి కూర్చి

తే. వివిధకవితామనోహరవీథులందు
సంచరించెను నీకల మంచితముగఁ
బ్రాంజలీకృత రాజాధిరాజచంద్ర!
సూక్తినిస్తంద్ర! రాఘవ సుకవిచంద్ర! ౨

సీ. రాజనరేంద్రుని రాణ్మహేంద్రంబున
శబ్దశాసనుసుశిక్షణల నంది
మనుమసిద్ధీశ్వరు ఘనసింహపురిలోన
సోమయాజుల బహుశుశ్రుతుల నంది
మండితరెడ్డిరా ట్కొండవీట్పురిలోనఁ
గవిరాజు బహుమతు లవధరించి

వెసఁ గృష్ణరాయల విద్యానగరమందు
తాతయ్యపూర్వపద్ధతుల నేర్చి
తే. ఇపుడు శ్రీకృష్ణరామావనీంద్రచంద్రు
గద్దువాలను దమసమక్షమునఁ జేరి
ప్రోడతన మందెఁ గైత యన్ పూవుఁబోఁడి
సరసకవిధుర్య! రాఘవశాస్త్రివర్య!

## బ్రహ్మశ్రీ గొట్టిముక్కుల కృష్ణమూర్తిగారు

(శాస్త్రిగారి శిష్యుఁడు, గద్వాల.)

ఉ. వ్రాసిన పద్యరత్నములు రమ్యములై మనయాంధ్రమాతకై
చేసిన రత్నహారముల చెల్వున నొప్పుచు నున్నవయ్య, మీ
శాసనముల్ మహాప్రథితసత్వులు పూర్వబుధుల్ వచించు ధ
ర్మాసన వాక్సుధారసమునందలి సారమె గాదె దేశికా! ౧

మ. శ్లథమా పూర్వపు టాంధ్రరాజ్యవిభవైశ్వర్యమ్ము లాక్కొమ్మడిన్
బృథులం బైన గభీరపద్యతతిచే రేకెత్తఁగాఁ జేసి, యాం
ధ్రధరాధీశుల కీర్తికాంత కొక స్థానం బిచ్చి, యాంధ్రోర్విని
బ్రథితం బౌ నటు మేలుకొల్పినది మీ వైషమ్య మేగా గురూ! ౨

## బ్రహ్మశ్రీ విద్వాన్ గొట్టిముక్కుల గోపాలకృష్ణశాస్త్రిగారు

నంద్యాల, మునిసిపల్ హైస్కూల్ సహాయాంధ్రపండితులు.

మ. భవదీయోన్నతి మూర్తియందున నెగా భావించితిన్ గాని, మీ
యవధానప్రతిభోన్నతిన్, సుపద దివ్యస్ఫూర్తిన్ భావోన్నతిన్,
కవితా నిర్య దవార్య సంఘటిత వాక్యప్రౌఢిమాత్యున్నతిన్
సవిమర్శంబుగ వీరరాఘవ కవీశా! చూడఁగాఁ గల్గితిన్. ౧

శా. ఆశాంతంబుల మీకవిత్వలత లయ్యారే! విజృంభించి పృ
థ్వీశాళి ప్రణయానురాగ జల సందీప్తంబులై సద్గుణ

ప్రాశస్త్య ప్రసవాభిరమ్య ఫల సంభావ్యంబులై మాకు ది
వ్యాశీర్లాభము లిచ్చె రాఘవకవీంద్రా ! సద్బుధగ్రామణీ ! ౨

## శ్రీమాన్ అమరచింత వేంకటాచార్యులవారు

(అమరచింత, నైజాం.)

శా. నాణీయస్తర తారహారములవిన్నాణంబు మే లెన్న గీ
ర్వాణాంధ్రామృత పూర పూరిత పద ప్రౌఢ ప్రయోగంబు లా
వాణీదేవియ నీముఖాబ్జమున నావాసించెనో కా, కిటుల్
రాణింపం గలదే ? భవత్కవనసారస్యంబు విద్వత్కవీ ! ౧

సీ. శరదబ్జ మకరంద ఝుర సోదరంబులై
యలరారు నొక్కొక్క సెలవునందు
గంభీర సౌర గంగాప్రవాహములీల
జానొందు నొక్కొక్క చాయయందు
మలయానిల కిశోర చలన సఖంబులై
తనరారు నొక్కొక్క తావునందు
ప్రావృట్పయోద ధారాపాతముల పెంపు
వాటిల్లు నొక్కొక్క పట్టునందు

తే. ప్రకట శరదిందు సాంద్ర చంద్రికల మేల్మి
సొబగు నగుచుండు నొక్కొక్కచోటునందు
నదిర ! నీశైలి వర్ణింప నలవి యగునె ?
గాడెపలి వీరరాఘవ కవిశశాంక ! ౨

సీ. నానావనీశ్వరాస్థానాంగణంబుల
నభినయించెను మేటి యాటకత్తె
పలు తెలుంగుల భావ పరిపాటి రసికుల
వలచి తా వలపించు వన్నెలాడి

తగువృత్తిఁ బాడిపైఁ దనయేలి నాతని
కీర్తి నిల్పెడు పెద్ద గేస్తురాలు
క్రొంగ్రొత్త కీరితి కూఁతులఁ గనుచుఁ బా
లించెడు పచ్చి బాలెంతరాలు
తే. స్వైర సంచార ధీరయై పరుల కాత్మ
భావ మీని శిరీష మృద్వంగి సతత
యౌవనసమేత నీకవితాత్మజాత
గాడెపలి వీరరాఘవ కవిశశాంక. 3

## బ్రహ్మశ్రీ మేడవరము సుబ్బరాయుఁడు కవిగారు

(పోలేపల్లి అగ్రహారము, నెల్లూరుజిల్లా.)

వీరు వ్రాసిన ప్రశంసా పద్య మిందు 85 పుటలో నున్నది. అందుఁ జూచునది.

## శ్రీయుత శతావధాని దోమా వేంకటస్వామి గుప్తగారు

(ప్రకృతము బెజవాడ.)

చ. కవులను గాంచినాఁడ సదఖర్వుల నెందఱి నేని, మీవలెన్
మివులఁగ మిత్రభావమతి మేకొని వైరివచస్తమోనికా
య విభవహారులై యల మహానట తుంగ జటాటవీ నట
త్పవిమల గాంగధాటిఁ దగు రమ్యకవిత్వ మెసంగువార లీ
యవని న నేరు లుండ గని యాత్మఁ దలంచెదనయ్య వీరరా
ఘవకవివర్య! ప్రోల్లస దఖండ యశస్సువిలాస భాసురా!. ౧
మ. గదవాలాది సమస్త భూరమణ ముఖ్యశ్రీ సభారంగ రం
గ దుదారాభ్రధునీ తృణీకరణ నిష్కాలుష్య కీర్తిచ్ఛటా
ముదితాశేష కవీంద్ర రాఘవ కవిన్ మోదంబుతోఁ గూర్చిన
ట్టిదశన్ గాంచినవానిపుణ్యమును ధాటిన్ బల్కఁగా సాధ్యమే? ౨

## విద్వాన్ మద్దులపల్లి వీరరాఘవశర్మ.

(ప్రకృతము నంద్యాల మునిసిపల్ హైస్కూల్ సహాయాంధ్రపండితుఁడు)

సీ. కవిసింహ మని తోఁప గర్జించి తిరుపతి
పండితసభలోనఁ బ్రబలినావు
నెల్లూర నుల్లాస మెల్లవారికిఁ గల్గ
నవధానములఁ బేరు నందినావు
గద్వాల సంస్థాన కవిరాజవై యుండి
కీర్తి ప్రతిష్ఠల గెల్చినావు
ఆబాల గోపాల మాఁదల లూఁపంగఁ
జాటు పద్యావళిఁ జాటినావు
తే. అతి విషమ సమస్యల నెల్ల నాశుధార
భావ గంభీర పద్యాలఁ బలికినావు
అపర శ్రీనాథ బిరుదాన నలరినావు
వీరరాఘవ కవివర్య వినుతచర్య. ౧

శా. నీవాగ్ధాటియు, నీకవిత్వఝరియున్, నీయాశువేగంబు, నీ
భావోదాత్త సమాస వైఖరియుఁ బైపై వీర ధారాళ ధా
రావేశంబున హెచ్చి వచ్చి పదు మర్యాదల్ విలోకింప నా
రా! విశ్వంబున వీరరాఘవుఁడవే యైనట్లుగాఁ దోఁచెడిన్. ౨

## బ్రహ్మశ్రీ చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రిగారు. (గుంటూరు)

గద్వాలాస్థాన విద్వాంసులలో నొకరును,...గద్వాల ప్రభూత్తంసులకు బహుమాననీయులును నగు బ్రహ్మశ్రీ గాడేపల్లి వీరరాఘవ కవి మహోదయులు...సంస్కృతాంధ్రములయం దందెవేసిన విద్వాంసు లగుటయేగాక చతుర్విధ

కవితాప్రపూర్ణులై శతావధానాదు లొనర్చి యాంధ్ర పండిత లోక చిరపరిచితులై యున్నవారు.

(ధ్రువచరిత్రలోని తొలిపలుకునుండి.)

తే. కొంచి వడఁబోసి తిగుచు చిక్కని మరంద,
మేరి యొలిచిన పక్వకర్పూరకదళి,
కలయ మాఁగిన గోస్తనీఫలగుళుచ్ఛ
మన్న ! నీయాశు కవితా మహోర్మ్యాసరణి.

బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బరాట్కవిగారు.
(స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురము, నైజాం.)

ఉ. కమ్మని యాంధ్రభాష నుడికారపుసొంపు, రసంబు పెంపు, భా
వమ్ములయింపు, శబ్దములవైఖరి, బల్మధురం బెసంగు వా
క్యమ్ముల మేల్చుకృత్కృతుల యందము చందము లివ్వి యెల్ల నీ
సొమ్ములె పో గణించి యెటుచూచిన రాఘవశాస్త్రి సత్కవీ !

ఉ. చాటి నచింపబోలుఁ దమసాహసమైన కవిత్వధాటి, యు
త్పాటితశత్రుకోటి పరిపాటి, రసప్రచురార్థరత్నవ
త్పేటి నవోన్మిషత్ప్రతిభ వెల్గిన మంజులభావకోటి; వే
యేటికి ? నీకు సాటి మఱి యీవె సుమీ కవివీరరాఘవా !

ఉ. పెద్దవు సద్గుణంబులకుఁ, బెద్దవు సత్కవికోటిలోపలన్,
బెద్దవు పండితావళులఁ బెద్దవు; వేయుగఁ జెప్ప నేల ? నీ
పద్దెములందుఁ గాన నగుభావమె, దీర్ఘసమాస పుష్టియే
పెద్దఱికంబుఁ జాటు సరవిన్ నెఱవిందుగ నెందు సత్కవీ !

బ్రహ్మశ్రీ విద్వాన్ మద్దులపల్లి నరసింహశర్మగారు
(ప్రకృతము ఇండియన్ రైల్వేస్కూల్ పండితులు, గుంతకల్లు.)

శా. వేగాటోప వినిర్జితేశ్వరజటా వీథీపత ద్వాహినీ
వేగంబై తగు నాశుధార బిగువై వెల్గొందు మీకైత మే

ల్బాగుల్ వద్దనుకొన్నవారికిని నాహ్లాదంబు చేకూర్చుఁగా !
శ్రీ గాడేపలి వీరరాఘవకవీ ! చిద్రూపవాగ్భారవీ !. ౧

తే. సమాజసృష్టిని సల్పెడు స్రష్టకన్న
మిన్న యగుఁ గవిబ్రహ్మ యటన్న నుడిని
సార్థకముఁ జేసె రాఘవశాస్త్రి యట్టె
పందిని మదేభముగ మార్చి వైచి యౌర !. ౨

సీ. కల్పనాచాతురి కమనీయ మంచును
'గుంటూరి చేఁద' తాఁ గ్రుద్ది పలుకు
ప్రౌఢంపు శైలి స్వభావసిద్ధం బని
వచియించు 'సులభంపుఁ' బద్యపంక్తి
ఆత్మగౌరవ మెన్న నతని సొత్తే యని
పల్కు నెల్లెత్తి 'యావ్యాసమాని'
శ్లేషోక్తులను పుట్ట శ్రీరాఘవుం డని
'ద్విజశట్ట' పద్యంబు వెల్లడించు
తే. 'వికిర మిడఁ' జేసి శివునకుఁ బెండ్లిఁ జేసె
పూఁత మెఱుఁగులకుఁ బసిండి పూఁత వెట్టె
ననుచు గద్వాల, రామరాడ్జనులు మెచ్చి
రవుర ! యెంత ఘనుఁడవు రాఘవ కవీంద్ర ! 3

## బ్రహ్మశ్రీ రెంటచింతల వేంకట సుబ్రహ్మణ్యముగారు

(మార్కాపురము.)

తే. పండితులఁ జూచి గిఱరించు ప్రౌఢులైన
కవులపైఁ గాలు దువ్వు పకాల్న నవ్వి,
గేలి సేయును కువిమర్శకాళి నెల్ల
తగని అమ్మాయి రాఘవ ! తమరికైత.

తారణసంవత్సరాషాఢ బహుళములో నేను కర్నూలు వెళ్లి అలంపూరు క్షేత్రము చూడఁబోవుచుండఁగా రాఘవ శాస్త్రిగారు రైల్వేస్టేషనులోఁ గాన్పించి 'మూఁడు నెలల సెలవుదినములలో నా కోసమై మూన్నాళ్లు వెచ్చఁబెట్టవా?' యని కోరఁగా అట్లే యని అలంపూరునుండి గద్వాల వెళ్లి ఆషాఢ బ ౭ నుండి ౧౨ పర్యంతము (1944 జులై 12-17 వఱకు) ౬ దినములు వారి కవితావ్యాసంగము నొకముఖ మునకుఁ దేవలయు నని తదేక దీక్షగాఁ గూర్చుండి ప్రయ త్నించి, అన్నిదినములుగూడ శీర్షికలు వ్రాయుట, కొఱవ సరవలు వారు చెప్పుచుండఁగా గ్రంథములోని కెక్కించుట, వారు చేసిన యవధానాదికములను పట్టిగట్టుట యింతమా త్రమే చేయఁగలిగి, చేయఁదలఁచుకొనిన పని యప్పటిలోఁ దెమలునట్లు తోఁపక పోఁగాఁ గార్యాంతరము లుండి యప్పటి కంతటితో నాఁపఁదలఁచుకొని సెలవు గోరుచు

మ. ఒకటా? రెండ? మఱొండ? వేనకును వేలో లక్షలో యున్నయ
ట్లు కనం బడ్డవి పద్యముల్; ముగియునట్టుల్ సేయఁగాఁ జూడ నేం
డ్లకు నైనన్ సరిపోవవచ్చు; దినముల్ చాలంగరా వౌట, నేఁ
టికి నాకున్ సెలవిమ్ము, వేఱొకతఱిన్ డీకొంద మోమిత్రమా!. ౧

అని 'వారు కొన్నిదినములు నాకొఱకై వినియోగింపవా?' యని యన్నందులకై వ్రాసి ఆవల అన్నాళ్లు వారి కవితాపరి శీలనము చేసినందులకుఁ గల్గిన సంతోషమును బట్టఁజాలక నా వ్రాసిన పద్యములు:—

సీ. కొండలపైనుండి గుండ్లు దొర్లించుచు
పడి దూఁకు సెలయేటిదుడుకుఁదనము

పెటపెటార్భటులతోఁ జిటిలి మబ్బులనుండి
తెగిపడు పిడుగుల తీవ్రతనము
భూనభోంతరముల నూని యవిచ్ఛిన్న
ధాటి నేతెంచు మిన్నేటిధాటి
తళుకు తళుక్కని తులకించి మించు క్రొ
మ్మించుల పెనుమిఱుమిట్లుదాట్లు
తే. ఎత్తుగడలందు, శబ్దవిజృంభణమునఁ,
దెంపులేని సమాసాలఁ, దెఱలు స్ఫురణ
నెందుఁ జూచిన మీ కైతలందు వెలయుఁ
గాడెపలి వీరరాఘవ కవివరేణ్య!.

సీ. దుడుకుఁదనంబుతోఁ దూఁగియాడుటె గాని
నాలి వోయిన చచ్చు నడక లేదు
అంబరచుంబి భావాకర్షణమె కాని
క్రింది చూపుల దేబెరింత లేదు
పుంఖానుపుంఖిత స్ఫురణంబులే కాని
యోజించి చెప్పెడి యోజ లేదు
ఉడివోని యౌదాత్త్య మొప్పుచుండుటె కాని
సందర్భ మెఱుఁగని జాడ లేదు
తే. పుట్టు బుడకలనుండి యిప్పట్టుదాఁక
నేకధాటిని మీకవితాకుమారి
యేమి పోకడలం బోయి యొసఁగెనయ్య!
గాడెపలి వీరరాఘవ కవివరేణ్య!.

చ. నిలిచినఁ గూరుచుండిన ననేకులలోపల రెండు మూఁడు జే
నలకును పైపయిన్ మిగు లనందగు మూర్తి నొసంగినట్టి యా

పలుకువెలంది. పెన్మిటి యపప్రథ పాల్పడకుండ నీదుకై
తలకును నట్టి కీర్తి నిడి ధన్యత గాంచెను జూవె సత్కవీ!. ४

మ. చతురాస్యుం డెటువంటి నేరుపరియై సాగించినన్ గూడ నం
దతుకుల్ తప్పవు నూడు; రాఘవకవి ప్రాగ్రేసరా కారదీ
క్షితకున్ దగ్గ కవిత్వమున్, బ్రతిభయున్ గల్పించి, కొల్చిండ నూ
ర్జితమౌ వస్త్రము నేయు మగ్గమున సృష్టింపంగ లేడాయెగా!. ౫

ఉ. ఎక్కడ వ్రాసినాడవో! యహీనతరాశుకవిత్వధారకుఁ
జిక్కదనంబుఁ గూరిచి, స్పృశించిన భావముసందుగొందులన్
జిక్కు దొలంచి, యౌచితికి నేరుపు గూరిచి, యెందుఁ జూచినన్
జక్కఁగ నీదుకైత కొనసాగెను రాఘవశాస్త్రి సత్కవీ!. ౬

ఉ. వచ్చిన పద్యమట్లు చదువంబడు నంతియ కాని క్రొత్తగా
నచ్చునఁ దీర్చుచున్న విషయం బని యించుక దోఁపనీవుగా!
యెచ్చట నేర్చి తౌశు? వరశే! కవిరాఘవశాస్త్రి! చూడఁగా
నచ్చతురాస్యురాణియె ప్రియంపడి నాలుకపై వసించెనో!. ౭

శా. ప్రారంభించు శతావధానములయం దష్టావధానంబులన్
ధారా ధోరణి ధైర్య ధారణలు సంధానింప నౌ; నందున
న్మీరల్ దిట్టలుగాఁ గనంబడుదు రన్నింటన్ విచారింప; న
య్యా రే! రాఘవశాస్త్రి సత్కవివరేణ్యా! యెంత ధీరుండవో!. ౮

1941 నవంబరు 12 వ తేది నేను దైవముదిన్నె రామారెడ్డిగారిని జూచుటకు బెళగల్లు (ప్రత్తికొండ తాలూకా) వెళ్లినపుడు, రెడ్డిగారు చెఱువువైపు విహారార్థము వెళ్లి మాటలసందర్భమున రాఘవశాస్త్రిగారి యలోక సామాన్య ప్రతిభావిశేషములను బ్రశంసించుచు నాతోఁ

జెప్పిన విషయమును గూర్చియు, 1944 జులై 15 వ తేది రాత్రి గద్వాలాస్థానపండితులలో నొక రగు శ్రీమార్గ దేశికాచార్యులవా రేదో 'రాణిగారితో ఏవిషయమైనఁ జెప్పవలసిన సందర్భములో ధైర్యముగాఁ జెప్పెడివారు మీకంటె నెవ రున్నా?' రని (ఆచార్యులవారి స్వవిషయమును గుఱించినది) నేను వినుచుండఁగాఁ జెప్పినది చేర్చియు వ్రాసిన పద్య మీక్రిందిది:—

మ. చెవులారన్ విని చెప్పునట్టి వివి 'యాక్షేపింతురే గాని రా
ఘవశాస్త్రిప్రతిభావిశేషముల నాకాంక్షింపరై' రంచు భూ
ధవుఁడాదైవముదిన్నె రెడ్డి పలికెన్, 'ధైర్యంబుగాఁ జెప్ప మీ
రె వలంతుల్ మఱి లే' రటంచు ఘనులే యిట్లాడ నాలించితిన్. ౯

శాస్త్రిగా రీదినములలో (1944 జులై) యొకనాఁటి రాత్రి తాము దోనకొండలో ఆంగీరస చైత్రములో కూర్మదాసుగారు చేసిన సప్తాహమునకును, వేంకటాపురాగ్రహారములో మొదలి వేంకటప్పయ్యశాస్త్రిగారు చేయ సంకల్పించుకొన్న సప్తాహమునకును జేసిన సాహాయ్యమును గుఱించి చెప్పఁగా విని ఆశ్చర్యము దోఁచి నా వ్రాసినది.

ఉ. ఎందఱ కెన్ని సాయముల నేగతిఁ జేసితొ చిత్రగుప్తుఁ డా
చంద మెఱుంగు, జీవములు జాఱక నిల్చినవార లున్న వా
రుం దెలియంగలారు; చతురుండయి పుట్టినదాని కేమి సే
యం దగు నింతకన్న ? నవురా ! కృతకృత్యుఁడవయ్య మిత్రమా !.

మ. సమయస్ఫూర్తిగ మాటలాడఁ గల ప్రజ్ఞల్ నేర్చినా, వెంత కా
ర్యమునైనన్ మఱి వీరధైర్యమునఁ జేయం గల్గు, దేశేని క్రా

ర్యముతోడన్ దల నిక్కఁబెట్ట నతలప్రాంతంబునం ద్రొక్కి, దు
త్తమకీర్తిన్ గడియించి తన్నిటను శాస్త్రబ్రహ్మ తేజంబులన్. ౧౦

(వారి యవధానములను గుఱించి)

చ. కటికి కసాయివానివలె గట్టిగ నిట్టటు నొక్కిపట్టి యెం
తటికిని గొంతుకోఁతలకుఁ దగ్గటులే యుసికొంద్రు పృచ్ఛకుల్;
దిటవుగఁ దీడి నిల్చి కసిదీఱఁగ నందఱ కన్నిరీతులన్
దట తట చెప్పివేసిన విధానమె మీయెడఁ దోఁచు సత్కవీ!. ౧౧

ఎఱ్ఱగొండపాలెములోఁ దనుగురువులగు రాళ్లభండి నృసింహశాస్త్రిగారి యధ్యక్షత క్రిందఁ జేసిన ప్రథమాష్టావధానములో (చూ. 66 వ పుట) 'మఠమున సన్యాసి యొకఁడు మానిని గూడెన్' అనుసమస్య, ఇంకొకటి, నృసింహశాస్త్రిగారే యిప్పించి, తాము చిన్నప్పుడు పూరించినదానికంటెఁ దమశిష్యుఁడు రాఘవశాస్త్రి మెఱుఁగుగాఁ బూరించె నని సంతోషించి, అవధానాంతమున వారు, తమపద్యములను విని పించి యందలి తారతమ్యమును సభ కెఱుకపఱచి రను సంగతి రాఘవశాస్త్రిగారు నాతోఁ జెప్పుచుండఁగా వారి కొమార్తె (11 ఏండ్లు) పూలు కుట్టుకొనుచు విని, యేమో నవ్వి యానందించెను. అప్పు డా బాలిక నుద్దేశించి నేను జెప్పినది:—

ఉ. అంతటివాఁడు మీ జనకుఁ; డాయనకీర్తిని నిల్పఁబెట్టు ధీ
మంతులు పుత్త్రిలేనియుఁ, గుమారికలేనియు నాదురొక్క ? క
ల్పాంతము దాఁక జీర్ణదశ నందని వాఙ్మయ మెంతొ నిల్పినాఁ,
డింతకు, కాల మున్నయది యేమయినన్ సరె రాఘవాంబికా!. ౧౨

తర్వాత, రాఘవశాస్త్రిగారితో సెలవు దీసికొనుచు, '1927 నుండి మెమో చేయవలె నని యనుకొనుచుంటిమి, ఇంతవఱ కేమి చేయలేక పోయితిమి, వ్రాఁతలోని కెక్కింపక పోయినచో జీర్ణించి పోవు పద్యము లనేకము లున్నవి కాని; వ్రాసిపెట్టినవి, వ్రాయవలసినవి యొకచోట నొకముఖముగా నుద్ధరించుటకు జాగ్రత్త పడవలసిన' దనుచు కాలమును నమ్మఁజాలక వ్రాసినది:—

చ. తినువును నమ్మరాదు, కడుఁ దప్పడు, దెప్పడు మోసగించునో,
వెనుక నొనర్చినట్టి కృషి విస్తృతమయ్యు ఫలంబు లేక చి
క్కినయది; దాని నొక్కదరికిన్ దెమలింతము; తిన్న తిన్నగా
దినమున కెట్టులైనను బదిం బది పద్యములైన వ్రాయఁడా!. ౧౩

—: అవభృథము. :—

'యన్మరణం త దవభృథ' మ్మని ఆమ్నాయజ్ఞ పరిసమాప్తికి మరణమే అవభృథ స్నానముగా వేదము చెప్పుచున్నట్లు ఐహిక లోకములో 30–4–1891వ తేది పుట్టి, ఆంధ్ర వాఙ్మయరంగమున అడుగుపెట్టి, అవధానాశుకవనాదులచే అఖండ కీర్తినార్జించి, ఆస్థానముల నలంకరించి, 1921 నుండి అయిదాఱేండ్లు కర్నూలు జిల్లాబోర్డులోను, అవసానమునకు గద్వాలలోను హైస్కూళ్లలో ఆంధ్రపండితపదవి నధిష్ఠించి, 54 సంవత్సరముల జీవితములో ఆడవలసిన ఆటల నన్నిటిని ఆడి, జగన్నాటకరంగమునుండి రాఘవశాస్త్రిగారు 5–3–1945 వ తేది గద్వాలలో అంతర్ధానమైపోయిరి. అంతిమ

సంస్కారమున కపరోక్షమునం దుండి ఆవేదనపడిన శిష్య రత్నము చిరంజీవి గొట్టిముక్కల కృష్ణమూర్తి అర్పించిన అశ్రుతర్పణము.

తే. పింగళి కవీంద్రు వర్ధంతి పిలుపు వచ్చె (15-3-1944)
వెంట రావలె నంద్యాల కంటిరి గద !
జబ్బుతో నాఁడు పోమైతి; మబ్బ ! నేఁడు
చితిపయికి నెట్లు నను వీడి చేరినారొ !

తే. దివిజకవివరు గుండియల్ డిగ్గు రనఁగ
నరిగె నానాఁడు శ్రీనాథుఁ డమరపురికి;
అతని గుండియ లగల నేఁ డరుగు టేమి ?
గురువరా ! లేనిచో నటకుం బనేమి ?

—: రాఘవ శాస్త్రిగారు గతించిన తర్వాత. :—

నే నేది శంకించుచుంటినో అది అట్లే అయినది. కారణ ఆషాఢములో 5, 6 దినములు చేసిన కృషి గాక, మరల ఆమాఘ పూర్ణిమకు నేను విద్వత్సభలకు వెళ్లి మఱి రెండు దినములు వారినిమిత్తముగానే యుండి యేదో కొన్నింటికి శీర్షికలు వ్రాసి మాఘ బ ౬ శనివారము (1945 ఫిబ్రవరి 3) సెలవు దీసికొని వచ్చితిని. నన్ను రైలు ఎక్కించి యింటికిఁ బోయి మంచ మెక్కిరఁట, సరిగా ఒక్క నెలకు ఫాల్గున బ ౭ లకు (5-3-1945) గతించిరి. ఆవార్త నాకు 22 దినముల మీఁదఁ దెలిసినపిమ్మట వారి కవితావ్యాసంగ పత్రములు వృథాగాఁ బోవునే యని వానిని దీసికొని వచ్చుటకై పార్థివ అధిక చైత్ర బ. (౯) ౧౦ శనివారము (7-4-1945) గద్వాలకు వెళ్లితిని. అప్పుడు వారికుమారుల కోదార్పుగా నావ్రాసినది:—

సీ. ఇరువది వత్సరా లెదుగకుండనె యవ
ధానాదు లొనరింపఁ బూనినాఁడు
పండితరాజ సభారంగముల కెక్కి
రంజించి సత్కృతుల్ గుంజినాఁడు
ఘన పాండితీప్రౌఢి ఘంటాశతంబుల
నొప్పుగాఁ గొన్నింటిఁ జెప్పినాఁడు
ఆంధ్రవాఙ్మయ మున్నయందాఁక నిల్చెడి
వాఙ్మయంబును గొంత వ్రాసినాఁడు
తే. మీయదృష్టము సరి లేక మీదు తండ్రి
చంటి పిల్లల మిము వీడి సాగినాఁడు
తల్లి చాటునఁ బెరిఁగి వర్ధిల్లరయ్య
వీరరాఘవకవిరాట్కుమారులార !.

శాస్త్రిగారు గతించునాఁటికి నలుగురు కుమారులు, ఒక కొమార్తె (పెద్దది) ఉండిరి. చిన్న కుమారుఁడు 7, 8 మాసములుగా జ్వరపు గడ్డతో బాధపడుచుండి తండ్రి పోయిన 3 మాసములకు గతించెను. పెద్దకుమారుఁడు (శివరామదీక్షితులు) తండ్రి గతించునాఁటికి కైదవయేఁడు నిండనివసికూన.

—: స్మారక సభావిశేషములు. :—

నంద్యాలలో నేను కార్యదర్శిగానుండి నడుపుచువచ్చిన వైదికధర్మపరిషత్సభమున పార్థివ (నిజ) సంవత్సరాది నాఁడు (13–4–1945 శుక్రవారము) బ్రహ్మశ్రీ పాణ్యాము రామచంద్రయ్య బి, ఏ. గారి యధ్యక్షతక్రింద స్మారకసభచేసి శాస్త్రిగారి వాఙ్మయసేవావిశేషములను వెల్లడించితిమి. ఆసభలో నాచదివినపద్యములు:—

చ. కొఱఁతల కేమి గాని కడకున్ బసికూనలఁ జేరఁదీసి యా
ముఱిపెము ముద్దు ముచ్చటలు పూర్తిగఁ దీఱవుగా సరే, కనుల్
దెఱవని కుఱ్ఱలన్ బెనుచు దిక్కు కనంబడకుండఁ జేసి నీ
తెఱఁగున నీవు పోయితి, విదే యొక పెద్దకొఱంత సత్కవీ! ౧

శా. నీ వున్నన్ని దినంబు లందఱును నిన్ బ్రేమించినారే, బహు
ప్రావీణ్యంబగు నీదుకైత చెవులారన్ విన్నవారే, నుతుల్
కైవారంబులు చేసినారె, యిపుడేగా చూడఁగాఁ బోలు! నా
యా విశ్వాసము వీరరాఘవ కవీంద్రా! నీ పరోక్షంబునన్. ౨

సీ. నిన్ను మా వాఁ డని యెన్ని చెప్పినదాన
గౌరవం బనుకొన్నవారు గలరు
నిన్ను మా కవి యని యెన్నుకొన్నందున
ఘనత యనుకొన్న రాడ్ఘసులు గలరు
నిన్ను మా స్నేహితుం డన్నచో వెలలేని
గణ్యత యనుకొన్న కవులు గలరు
నిన్ను మా సీమవాఁ డన్నచోఁ దులలేని
ప్రఖ్యాతి యనుకొన్న ప్రజలు గలరు
తే. నీవు లేనట్టి కాలాన నిన్ను నెట్లు
గారవింతురొ, పూజింత్రొ కానవలయు;
కాల మున్నది, చూడఁగాఁ గనులు గలవు
గాడెపలి వీరరాఘవ కవివరేణ్య!. ౩

నంద్యాల మునిసిపల్ ముస్లిం హైస్కూల్ హిందీ, తెలుఁగు పండితులు జనాబ్ విద్వాన్ దావూద్ సాహెబ్ గారు నాఁటి స్మారక సభలోఁ జదివిన పద్యములు.

శా. శ్రీనాథాదులు త్రోవలం దెలిపి యాంధ్రిన్ మంచి దారిద్ర్యయో
షాన్వత్యంబును గాంచి యేఁగిరఁట, లెస్సా. నేను నా పంథయుం

దే నాకంబును గాంతు నంచు నసువుల్ దేహంబు వీడంగఁ ద
చ్ఛ్రీనాథాదులఁ జేర రాఘవకవీ! చిత్రంబు మీ పోకడల్ ! ౧

మ. తెలుఁగుందేశము మీకవిత్వరసవత్తీర్థమ్ముల౯ గ్రుంకి ని
ర్మల యుష్మన్మృదుభావనోదమున బ్రహ్మానందమున్ జెంద ది
క్కులకున్ బ్రాఁకిన మీయశస్సుమలతాంగుల్ కుల్కులన్ జూప వ
ర్తిలుఁ డో రాఘవశాస్త్రి! స్వర్గమున నిర్ణిద్రప్రభావంబున౯. ౨

సీ. మారికాపురమున మీఱి డంబము గొట్టు
కొప్రఘుం గవులను గ్రుమ్మినాఁడు
సులభ సమాస మన్ పలు కోర్వఁగాలేక
తీండ్రంబుగ జవాబు దెలుపునాఁడు
ప్రళయోగ్రరూపమున్ బ్రకటించు గ్రామ్యవా
దము రూపుమాఁపఁగాఁ దలఁచునాఁడు
గద్వాల సంస్థాన విద్వత్కవుల మధ్య
శాఙ్గ్యంఘ్రిచర్చల జరుపునాఁడు

తే. శత్రు సంతతి గుండియల్ జల్లు మనఁగ
నాశుగాశుకవిత్వ సారాతిశయత
రూపు మాపిన రఘురాము రూప మనఁగ
గాడెపలి రాఘవాఖ్య! మీ క్షాత్ర మొప్పు.

శా. ఓ విద్వత్కవిసార్వభౌమ! హృదయప్రోద్భూత భావాత్త భా
షా వైశద్యము, శైలిరమ్యత, సమస్యాపూరణప్రక్రియల్
గ్రావం బందున నుండి గుండ్లుబలె నాకాశంబునం దూండి గ
ర్జావద్భీష్మత సాగు మీ కిదె నమస్యల్ కీర్తికాయాశ్రితా!

ఉ. ఒక్కొకపద్యమందును రసోత్కటమౌ ధ్వని, వాక్యవాక్యమం
దొక్కొకనూతనత్వము, మహోన్నతభావము, సౌకుమార్యము౯
నిక్కము మీకవిత్వరస నీరధిఁ గ్రుంకిన యజ్ఞమూర్తి స
మ్యక్కవితామహారథము నార్య! కవుల్ వినుతింపఁ ద్రోలఁడే?

బ్రహ్మశ్రీ విద్వాన్ సంగుభొట్ల నరసింహ శాస్త్రి గారు పంపిన పద్యములలో నొకటి.

(ప్రకృతము ఆళ్లగడ్డ, కర్నూల్ జిల్లా.)

సీ. దైవముదిన్నెయాస్థానంపుఁ గవిచంద్ర !
క్రుంకితే దుష్కాలకోపకలన ?
గద్వాల సంస్థానఘనరత్నదీపంబ !
మలిగిపోయితె విధివిలసనమున ?
రాయల సీమాగ్రరంగ జయ స్తంభ !
పడితివే నియతిదుష్పాకవశత ?
ఆంధ్రరాష్ట్రోజ్జ్వలదానన తిలకంబ !
చెదిరిపోయితె దైవచేష్టితమున ?
తే. రసికజనులను దుఃఖాంబురాశి ముంచి
యరిగితివె స్వర్గసీమకు ? తిరిగి రావొ ?
ప్రాంజలీకృత రాజాధిరాజచంద్ర !
సూక్తినిస్తంద్ర ! రాఘవ సుకవిచంద్ర !

బ్రహ్మశ్రీ గడియారము రామకృష్ణశర్మగారు 29-3-45 అలంపూరులో స్మారకసభ జరిపి చదివిన పద్యములలో

సీ. తిరుపతి వేంకటేశ్వరులతో సరి మించు
రమ్యసత్కవితాధురంధరుండు
అఖిలదేశ నృపాల కాస్థానపూజిత
నానావధాన విధాన చణుఁడు
గద్వాల సంస్థాన కవితావినోద నా
టకరంగ సూత్రధారకనటుండు
శీతాద్రిశిఖరసంపాతస్రవంతినీ
ధారాసదృశవక్తృతాఘనుండు

తే. మంజులామోఘ దీర్ఘ సమాస పద్య
కల్పనానల్ప చాతురీ ఖ్యాతకీర్తి
క్రమ సంభాషి వీరరాఘవ మనీషి
వసుధ నెడఁబాసి స్వర్లోకవాసి యయ్యె.

బ్రహ్మశ్రీ చిలుకూరి శ్రీరాములుగారు.

11-6-45 త్రిలింగలోఁ బ్రకటించిన పద్యములలో

శా. ఈడేరీ ? నిఖిలాంధ్రపండితులలో పసీయాంధ్రభూమండల
క్రీడారంగమునన్ కవిత్వమున, వక్తృత్వంబునన్ దేవస
మ్రాడాలోకిత సర్వశాస్త్రనిధి! స్వర్గస్థుండవై పోతివే ?
గాడేపల్యుప వీరరాఘవ ! యశస్కాయా ! సుహృద్రత్నమా !

—: అకారణ బాంధవ్యము :—

చ. మనమునఁ గొన్న నెవ్వగల మాన్చి ఘటింతురు కౌన్యసమ్మదం,
బనఘుక థాముఖంబున హితాహితబోధ మొనర్తు రింపుగాఁ,
గనుఁగొనుకంటె నద్భుతముగాఁ గనఁజేతు రతీంద్రియార్థముల్
ఘనమతు లెల్లవారల కకారణ బంధులు గారె సత్కవుల్ !

(పూర్వకవి చాటువు.)

—: అభ్యర్థన :—

శ్లో. రాఘవస్య ప్రభావేణ భవతాం చైవ తేజసా,
ఏత త్సర్వం మయా తత్ర యథావ దుపపాదితమ్,
అత్ర య న్న కృతం శేషం త త్సర్వం క్రియతా మితి.

(రామా-సుందర ౫౮. ౧౬౭)

భాషా సేవకః

మద్దులపల్లి. వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

శతావధాని

## గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారి గ్రంథములు.

౧. చమత్కార కవిత్వము. 1-8-0

౨. త్రిపురాంతకస్థల మాహాత్మ్యము. 3 ఆ. పద్యకావ్యము. 1-0-0

3. శ్రీ సత్యవరలక్ష్మీ ధ్రువచరిత్రము. 1-0-0

(1947 నుండి విద్వాన్ ప్రిలిమెనరి పాఠ్యగ్రంథము.)

## మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గ్రంథములు.

౧. సత్యనారాయణ మాహాత్మ్యము. ౫ ఆ. పద్యకావ్యము. 1-0-0

ఫస్ట్‌క్లాస్ సర్టిఫికెట్టు పొందినది.

౨. దైవప్రార్థన—సుభాషితములు. 0-8-0

అనుక్షణము పఠింపఁదగిన భక్తి జ్ఞాన వైరాగ్య నీతి పద్యములు 3-౨ం. మూఁడవముద్రణము.

౩. కుక్కల మొఱ. 0-2-0

కఠినహృదయమును గూడఁ గరఁగించు పద్యములు.

౪. అమృతసందేశము. 0-8-0

ప్రతి పద్యచమత్కారము.

౫. చేతావనిఖండనము. 0-8-0

అనేక సందేహములను సప్రమాణముగాఁ దీర్చు గ్రంథము.

౬. బ్రహ్మస్వామి. 0-8-0
ఒకసిద్ధపురుషుని యద్భుతచర్యలు.

౭. ప్రియదర్శికా నాటిక-ఆంధ్రీకరణము. 0-12-0
1950 బి. ఏ. పాఠ్యగ్రంథము.

౮. సౌశీల్యము. వచనము. 0-12-0

౯. ఇంద్రగంటి శేషావధానులవారి చరిత్ర. 0-4-0

౧౦. భక్తపోతరాజీయము.
5 అంకముల నాటకము. (అచ్చులో.)

౧౧. త్యాగరాజు. ,, ,,

౧౨. వినాయకజనన శ్యమంతకోపాఖ్యానము నాటకము ,,

౧౩. పెండ్లి రాయబారము. పద్యములు ,,

౧౪. కవితా వినోదము. ,, ,,

౧౫. అద్భుతచర్యలు. వచనము. ,,

౧౬. చతుర్దశమనుచరిత్ర. ,, ,,

౧౭. బుడ్డా వేంగల రెడ్డిగారి చరిత్ర ,,

౧౮. గోకర్ణం రామాభొట్లగారి చరిత్ర. ,,

అడ్రస్.— కవితాసామ్రాజ్యము,
నంద్యాల.